# కావ్యోద్యానము

కూర్పరి :
విద్వాన్ శ్రీ గడికపాటి లక్ష్మీకాంతయ్య, ఎం. ఏ.,
ఆంధ్రోపన్యాసకులు, నిజాం కళాశాల (రిటైర్డు)
హైదరాబాదు

శ్రీ నివాస బుక్ డిపో
మార్కెట్ వీధి - సికిందరాబాదు

# విషయసూచిక

# కృతజ్ఞత

సర్వస్వామ్యాయుతమగు తమ రచనలను, ప్రచురణలను ఈ సంకలనమందు చేర్చుకొనుటకు సహృదయతతో అనుమతించిన క్రింది రచయితలకు, ప్రచురణ కర్తలకు మా హృదయపూర్వక కృతజ్ఞత.

1. డా. కో. మహదేవశాస్త్రి, ఎం. ఏ. డి. లిట్.,
   వారి సోదరులు - తిరుపతి
   (జాతీయ జీవనము - వాఙ్మయము)
2. శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ, బెంగుళూరు.
   (రాయలనాటి రసికత)
3. ఆంధ్ర విశ్వవిద్యాలయము - వాల్తేరు.
   (కళాపూర్ణోదయము)
4. వేంకట్రామ అండ్ కో., విజయవాడ.
   సర్వేపల్లి రాధాకృష్ణ పండితుఁడు.
   భారతీయ నాగరికతా విస్తరణము

ఇట్లు
ప్రకాశకులు.

# జాతీయజీవనము - వాఙ్మయము

—శ్రీ కోరాడ రామకృష్ణయ్య

సామాన్యముగా జాతీయజీవనము తద్వాఙ్మయమునఁ బ్రతిబింబితంబై యుండునను విషయము నితర భాషావాఙ్మయ పరిచితి లేని కేవల హైందవ విజ్ఞానధురంధరు లగు మనవారు కొందఱు పాటింపరేమో కాని, పాశ్చాత్య వాఙ్మయములను, అచ్చటి విమర్శకాభిప్రాయములను బరిశీలించినవారి కెల్లరకును అది వాఙ్మయ విషయమున నొక ముఖ్య తత్త్వముగ గోచరింపక మానదు. ఏతత్తత్త్వావగాహనకు దేశచరిత్ర జ్ఞానము కూడ కొంచె మవసరమని తోఁచెడిని. దేశమున నొక్కొక్క కాలమునఁ గల్గు వివిధ రూపంబులగు విప్లవములు జాతీయ జీవనము నెట్లు మార్చుచుండునో అట్లే భాషా వాఙ్మయములను గూడ మార్పఁగలిగియుండును. ఒకవేళ మనవా రీ విషయము నంతగా గమనింపకున్నను, దేశచరిత్ర రచనా విషయమున నాది నుండియు తూష్ణీంభావము వహించి యెల్లప్పుడును పరమార్థ చింతాతత్పరులైన వీరియెడల నిది యంత యాశ్చర్యజనకము కాదు.

మన మొక మహాకవిచే రచింపఁబడిన యొక గ్రంథము చదువుచుండినచో, అద్దానఁ జిప్పిలుచుండు రసంబులు మన మనోభావంబుల నాకర్షించి యానందమున నోలలాడించును

గదా. అప్పు డొకవేళ మన పరిశీలనాబుద్ధి మాటువడి యుండ వచ్చునుగాని, మఱియొకసారి దానిం బరిశీలనతోఁ జదివిన, ఆ గ్రంథమునందలి పాత్రల చర్యలనుండియు, వారి సంభాషణా క్రమమునుండియు, భావములనుండియు అట్టి పాత్రల నాడించు నాంతరశక్తి యగు నా గ్రంథకర్త యభిప్రాయములఁ గని పట్టుట యంత దుస్సాధ్యము కాబోదు. కవుల స్వాభిప్రాయ సూచన నెంత మాత్రము సహింపని నాటకాది రూపకములలో నిది మిక్కిలి దుస్సాధ్యమనియే చెప్పవలసియున్నను,సామాన్య ముగ ప్రతిగ్రంథము వెనుకను మాటువడియో దాని నంత నావరించియో లేక నడుమ నొకచోఁ బొడసూపుచుండియో ఆ కవి చదువరులకుఁ గన్పట్టుచునేయుండును. మఱియు ప్రతి మనుజుని భావములును-భావ మననేల, వాని జీవితమంతయు, నా యా కాలముచే నిర్ణీతంబై యుండును. అనఁగా వాని జీవిత మా కాలమునందలి సాంఘికాది పరిస్థితుల నాశ్రయించి యుండు ననుట. కావున నొక సంఘమునందలి ప్రతి వ్యక్తి యొక్క యాశయములును ఆ కాలమందా సంఘస్థితిని, సంఘ జీవితమును వ్యక్తీకరించుచునే యుండును. ప్రతిభావంతుఁడగు నొక కవిచే రచియింపఁబడిన గ్రంథమునందు మన మా గ్రంథ కర్త యభిప్రాయములను మాత్రమే సేకరించుట లేదు. సాధా రణముగా నొక కవి తన దేశకాల వ్యవస్థలకు లోనై సాంఘిక వ్యవస్థలను, జాతిమత వికాసములను బయలుపఱచుచునే యుండును గావున నా యుగమందలి వాఙ్మయమునం దంత టను ఆ కాలమున నా జాతియొక్క స్థితిగతు లన్నియు

సూచింపఁబడుచునే యుండును. ఒకవేళ నొక కాలమున నొక రిద్దఱు మహామహులు దేశకాల వ్యవస్థల నధిగమించి సార్వజనీనంబులును పరమోత్కృష్టంబులు నగు భావములను, ఆదర్శములను తమ గ్రంథముల వెలయించినను, ఆ కాలమున వాఙ్మయమంతయు నట్టిదై యుండుట గాని, ఎంత గొప్ప కవులైనను, తమ గ్రంథరాజముల నెచ్చటనైనఁ దమచుట్టుప్రక్కల దేశముననో, సంఘముననో యుద్రేకము పుట్టించి తన్మయంబు గావించుచుండిన తాత్కాలిక మహోద్యమ విషయములను స్వాభావికమగు పొరపాటుననైనఁ గనఁబఱుపకుండుటగాని తటస్థింపదు. ఈ రీతిగా నొక దేశమున నొక కాలమందలి వాఙ్మయ మచ్చటి జనులమనోవీథుల నెగతెగక పాఱుచుండెడి భావప్రవాహమును, వారి జీవితచరితను దనలో కేంద్రీకృతమగునట్లు చేసి అప్పటి సంఘస్థితి ననశ్వరంబును శాశ్వతంబును నగునటు లా దేశమున నెలకొల్పు ననుటకు సంశయము లేదు.

ఇట్లు వాఙ్మయము దేశచరిత్రజ్ఞాన సంపాదనమునకుఁ దోడ్పడు ననుట వ్యక్తమే. అట్లే దేశచరిత్రయు వాఙ్మయాభివృద్ధికిం దోడ్పడెడి యా యా కారణముల నిరూపింప సమర్థంబై యుండును. చరిత్రకన్న వాఙ్మయమున నొక్క విశేషము కలదు. చరిత్ర యా యా దేశములం గల్గు వివిధోద్యమములను, వాని వికాసమును, అచ్చటి రాజకీయార్థిక సాంఘిక నైతిక స్థితులను వర్ణించి, ఆ యా యుద్యమంబులకును వాని పరిణామములకును కారణముల నారసి నిరూపించుచుండ, ఈ వాఙ్మయ మట్టి యుద్యమ కారణంబులకు మూలంబు లగు

జనుల భావోద్రేకములను, వారి యంతఃకరణవృత్తులను విశద పఱచును. మఱియు నిది దేశమునఁ గలిగిన రాజకీయ విప్లవములవలనఁ గాని, అన్యదేశీయ భాషా సంసర్గమువలనఁ గాని ఆ జాతీయజీవనమునఁ గలిగిన మార్పులనుగూడ విస్పష్టంబుగఁ దెల్పుచుండును. కావున వీని సంబంధం బతిసన్నిహితంబని యెన్నఁదగి యున్నది.

ఇందులకు దార్కాణముగ నిప్పుడు మన దేశమున బాగుగా వ్యాపించి మిగులనెన్నికగన్న యాంగ్ల వాఙ్మయముం జూడనగును. ఆ దేశమున జాతీయజీవన మే కాలమున నెట్లు మాఱుచువచ్చెనో, తదనుగుణంబుగనే కవితయందలి రుచియు మాఱుచువచ్చెను. ఈ కవితారుచికిఁ దగినట్లుగనే విమర్శన పద్ధతులును ప్రబలినవి. అప్పు డే యే భావము లాదేశీయుల మనముల నాకర్షించి యుద్రేకము గల్గించుచుండినవో అవియే యా యుగమందలి కవితయందును స్ఫురించుచుండినవి. ఆంగ్ల దేశమున పదునాల్గవ శతాబ్దమునకుఁ బూర్వము వాఙ్మయమున చేరఁదగిన కవిత మిగుల స్వల్పమేయని చెప్పనగును. ఈ 14 వ శతాబ్దమందలి తన దేశీయుల స్థితిగతులను, మతాచారముల దుస్థితిని, భాషావైఖరిని దెల్పుచు "ఛాసరు" అను కవి "కాంటర్ బరీ కథలు" అను గ్రంథమును రచించియున్నాఁడు. పదునాఱవ శతాబ్దమున ఆంగ్లదేశీయ నావికశిఖామణుల యద్భుతయాత్రల వలనను, వారిచేఁ గనుఁగొనఁబడిన నూతన ఖండముల పరిజ్ఞానమువలనను వారికి సముద్రములు స్వాధీనమై వారు పరదేశములతో సులభముగ వ్యాపా

రము చేయగలుగుటచే దేశ మొక్కమాఱుగ ధనవంత మగుట వలనను దేశీయులకుఁ గలిగిన యపరిమితానందోత్సాహముల యద్భుత ఫలమో యన్నట్లాకాలమున షేక్స్పియర్, సిడ్నీ, స్పెన్సర్ మొదలగు మహాకవీంద్రులు బయలు వెడలి, తమ యా యుత్సాహము నప్రతిమానం బగు కవితా రూపమున వెలయించి యాంగ్లవాఙ్మయమున నగ్రపీఠిక నలంకరించిరి. తరువాత పదునేడవ శతాబ్ది మధ్యమున దేశమున సంభవించిన రాజకీయములును మతవిషయకములునగు కల్లోలములనన్నిటిని ఆ కాలమున కవిసార్వభౌముఁ డగు మిల్టన్ వ్రాసిన గ్రంథములనుండి బాగుగఁ దెలిసికొనవచ్చును. మఱియు నీ శతాబ్దము యొక్క యుత్తర భాగమున ప్రజాప్రభుత్వము పోయిన పిదప నాంగ్లసింహాసనము నధిష్ఠించిన రెండవ చార్లెసునకు ఫ్రెంచి దేశముతో సంబంధమును, దానియం దభిమానమును గలుగుటవలన నా దేశీయులగు మాల్‌హర్బి, బాయిలూ మొదలగు వారి కవితారీతులును విమర్శనపద్ధతులును ఈ దేశమున వ్యాపించి యిచ్చటి కవితాపద్ధతులనుగూడ మార్చినవి. దీనితో కవితయందలి పూర్వపురుచి మాఱి కవితాప్రవాహము మాఱుత్రోవఁ బట్టినది. అప్పటి కవులు భావనాశక్తిని కొలుచుట మాని, అతివిశదంబును వ్యక్తంబును నగు శైలిలో ఆ కాలమునఁ బ్రబలిన జీవనపద్ధతులను, కాఫీక్లబ్బులను, చీట్లాటలను, పానగృహములనుగూర్చి చమత్కారముగ వర్ణింపఁ జొచ్చిరి. తమ కాలపు జీవనపద్ధతులను అభిప్రాయములనుబట్టి చూచుటచే, వారికి షేక్స్పియరు మొదలగు వారి కవితలయం

దాదరము లేకుండెను. పదునెనిమిదవ శతాబ్దమున నైరోపా దేశముల నెల్ల నొక్కమాఱుగా కలఁత నొందించినను గొప్ప రాజకీయవిప్లవము ఫ్రాన్సుదేశమున బయలుదేఱినది. దీనికి వ్యక్తిస్వాతంత్ర్యము, విశ్వజనసౌభ్రాత్రము మొదలగు నుదార భావంబులు జనుల మనంబునం దుదయించుటయే ముఖ్యకారణము. ఇంగ్లాండు దేశమునకుఁగూడ నీ నూతన భావములు ప్రాఁకినవి. ఇచ్చటి మహాకవుల మనంబులును అట్టి గంభీర భావములతోఁ బొంగిపొరలినవి. మరల కవితయందలి రుచి మాఱి, పూర్వ కవితయందును ప్రాచీన మగు దేశ చరిత్ర యందును ఆదరము హెచ్చినది. 17వ శతాబ్దమునఁ బ్రబలిన కవితాపదతులపై నాదరము పోయినది. ప్రకృతియే వీరి నూతనభావములకును కవితకును గూడ నుద్బోధకం బయ్యెను. షెల్లీ, బైరన్, కోలరిడ్జి, వర్డ్సువర్తు మొదలగువారి స్వాతంత్ర్యాదర్శమును ప్రకృతివైచిత్ర్యములను అనేకరీతులఁ గొనియాడి యాంగ్లవాఙ్మయమున మరల సహజ కవితను నెలకొల్పి యొక నూతనయుగ మేర్పఱిచిరి. 19వ శతాబ్దమాంగ్ల దేశమున నొక గొప్ప పారిశ్రామికయుగ మని చెప్పవచ్చును. ప్రకృతిశాస్త్రము విశేషముగ నభివృద్ధి గాంచినది. జాతీయ జీవన మనేకవిధములై పర్వినది. దీనిని వాఙ్మయమున నెలకొల్పుటకు నవలలు విశేషముగఁ దోడ్పడినవి. యంత్రాగారములలోఁ బ్రబలిన కొన్ని యమానుష కృత్యంబులను సంస్కరించుటకు లేడీ బ్రౌనింగ్, డికెన్సు మొదలగువారి వ్రాఁతలు సహాయపడినవి. టెనిసన్ అను కవీంద్రుఁడాకాలపు దేశోద్ధార

కులను గొనియాడి యనేకవిధము లగు యుగధర్మములను కవితయందు నెలకొల్పి ఈ యుగమునకు వాఙ్మయమున శాశ్వతపదవిని కల్పించినాఁడు. కావున ఆంగ్లవాఙ్మయ పఠనంబున నేయే యుగముల నేయే ధర్మములు ప్రబలినవో, ఆ జాతియొక్క జీవనపద్ధతు లేయే రీతుల మార్పు చెందినవో కనుగొనుట సులభసాధ్య మను మాట విశదమే యగుచున్నది గదా.

ఇఁక, హైందవవిజ్ఞానమునకంతకును మూలాధారంబగు సంస్కృతభాషావాఙ్మయ మాజాతీయతత్త్వము నెట్లుస్ఫురింప జేయుచున్నదో చూతము. ఏతత్పరిశీలనా విషయమున నాంగ్లవాఙ్మయమునకును సంస్కృత వాఙ్మయమునకును నొక్క భేదము కలదు. ఆంగ్లభాషయందు తద్దేశ చరిత్రను తెల్పు ననేకగ్రంథములు కలవు గాని, సంస్కృతవాఙ్మయము మిగుల ప్రాచీన మగుటవలనను, అప్పటికాలపు చరిత్రనుదెల్పు నితరాధారములు లేకుండుటవలనను, ఉన్న వాఙ్మయమును బట్టియే మన మా కాలపు చరిత్రను నిర్ణయింపవలసియున్నది. ఇప్పటికి నాలుగైదువేల యేండ్లనుండి వచ్చిన వాఙ్మయము నుండియే, మన మా కాలమున నివసించి యుండిన హైందవ జాతియొక్క స్థితిగతులను, వారి నాగరికతను తెలిసికొనఁ గలుగుచున్నా మనువిషయమే జాతీయజీవనమునకును వాఙ్మయమునకును గల సన్నిహిత సంబంధమునకు ప్రబలమగు నిదర్శనము. హైందవ విజ్ఞానమునకు మూలము లగువానిలో ప్రాచీనతమంబు లగు ఋగ్వేదమంత్రములు, ఇతర దేశము

లలో నాగరకతాగంధమే లేని కాలమునాఁటి హైందవుల నాగరకతా గరిమను చాటుచున్న వని పెద్దలు చెప్పుచున్నారు. చారిత్రక దృష్టితో పరిశీలించినపుడు హిందూ్వార్యుల నాగరకత ఋగ్వేదకాలమున పసితనమున నున్నదందురు. అప్పుడు వారిలోఁ గొంతమంది వ్యవసాయము వలన జీవించుచున్నను చాలమంది పశుచారణోపజీవులనియు, మంత్రరచనా సమర్థులగు బ్రాహ్మణులే విల్లంబులను బూని తమ శత్రువులతోఁ బోరుచుండెడివా రనియు, స్త్రీలుకూడ మంత్రములు రచించుచుండెడివా రనియు, వారుబట్టలనునేసికొనుచుండెడివా రనియు, ప్రకృతియందు గోచరము లగు వైచిత్ర్యములనే వారారాధించెడి వారనియు, తదారాధనా రూపములే యీ ఋగ్వేదమంత్రము లనియు తెలియవచ్చుచున్నది. కాలక్రమమున నిట్టి యారాధనయందు శ్రద్ధ తగ్గిన కొలఁదిని ఆ జనులకు క్రతువులయం దాదరము హెచ్చుటయు, ఈ క్రతువిధానముల నుద్గాత్రధ్వర్యులకు విధింపఁబడిన కార్యక్రమము ననుసరించి వీరు పఠింప వలసిన మంత్ర సముదాయమే సామయజుర్వేద రూపంబులు చెందినట్లును, వీరీకార్యక్రమమును నడుపవలసినరీతులను ఆ యా సంహితల యొక్క యాంతర్యార్థమును దెల్పు గద్యరూపంబులైన వ్యాఖ్యానంబులే బ్రాహ్మణము లనియుఁ గూడ దెలియవచ్చుచున్నది. ఈ బ్రాహ్మణముల కాలము వీరి జాతీయ జీవితమునను వాఙ్మయమునసనుగూడ రెండవయుగమని చెప్పవచ్చును. ఈ కాలమున నార్యులు కర్మపరులును తత్త్వవిచారణవ్యగ్రులు

నై యుండిరి. ఇప్పుడే వర్ణధర్మములుగూడఁ బ్రబలినవి. వార్ధక మున జను లరణ్యములలో వసియించుట యనెడి యాచారము వాడుకలోనికి వచ్చినది. బ్రాహ్మణాంతర్గతములైన యారణ్యకము లను భాగములు తత్త్వవిచారణ రూపంబులును ఉపనిషత్తులకు మూలభూతంబులు నై వెలసినవి. ఇవన్నియుఁ బూర్వయుగమందలిమంత్రములవలె ఛందోబద్ధములు గాక గద్య రూపంబుననే రచియింపఁబడినవి. పిదప నుపనిషత్తుల యుత్కర్ష హెచ్చి కపిలుఁడు సాంఖ్యదర్శనము వ్యాపింపఁజేయునప్పటికి ఋత్విక్కుల ప్రాబల్యము తగ్గినది. ఇది మూఁడవయుగము. ఈ కాలమున సంహితా బ్రాహ్మణములయందలి యంశములను సులభముగ బోధపఱచుకొనుటకుఁగాను వానిని క్లుప్తపఱుపవలె నను బుద్ధితో సూత్రములను వెలయించిరి. ఇంకను వివిధ శాఖల హైందవ విజ్ఞానమంతయు సూత్రములలోనికి వచ్చినది. నాగరకత హెచ్చినది. వాఙ్మయము వృద్ధి చెందినది. వైదిక కర్మకలాపం బంతయు శ్రౌతసూత్రముల నింపఁబడినది ఆచార వ్యవహారములు నిర్ణయించుటకు గృహ్యసూత్రములు, పరిపాలనా క్రమమును దెల్పుటకు ధర్మసూత్రములు, ప్రాతిశాఖ్యలు, శిక్షా సూత్రములు, పాణిని వ్యాకరణ సూత్రములు, ఛందస్సూత్రములు మొదలగునవి బయలుదేఱినవి. హైందవ విజ్ఞానమున కంతకు నలంకారభూతంబులగు షడ్దర్శనములును బయలుదేఱినవి. ఇవి యన్నియు నా కాలమందలి హిందువుల యాత్మజిజ్ఞాసను అగాధంబగు బుద్ధిబలంబును వారి నాగరకతావికాసంబును వేనోళ్ల చాటుచున్నవి. ఈ కాలమున సాంఘిక జీవనమున

పెక్కుమార్పులు జరిగినవి. బ్రాహ్మణుల యధికారము విజృంభించినది. ఋగ్వేదమతమునందా వేశము తగ్గినది. త్రిమూర్తులు మొదలగు ననేక దేవతలు వెలసిరి. అర్థము లేని కర్మలు ప్రబలినవి. జాతివైషమ్యములు, నంత్యజాతియందనాదరము నంకురించినవి. ఇట్టి సమయమున గౌతమబుద్ధుడు బయలుదేఱి, వర్ణభేదమువలన గొప్పతనము రాఁబోదనియు, సత్ప్రవర్తనవలన నందఱు ముక్తిఁ బడయఁగల రనియు, జీవహింస కూడదనియు-నీ మొదలగు బోధలు చేయుటచే, జనసామాన్యము నొక్కసారిగా నాకర్షింపఁగలిగెను. అప్పటినుండియు బౌద్ధమతమంతకంతకు వృద్ధిచెంది యశోకునికాలమున దిగంతవ్యాప్తి చెంది హిందూమతము నణఁచివేసినది. పిదప, హిందూదేశము పరదేశీయుల దండయాత్రలకు లోనై చాల కాలమువఱకు శాంతి లేక యుండెను. ఆంధ్ర, గుప్త, విక్రమాదిత్యుల కాలమునఁ గొంత శాంతి గలుగుటచే హిందూమతము మరల గొంత తలయెత్తుటకును, కాళిదాసాది మహాకవుల కవితా విజృంభణమునకును కొంత యవకాశము దొరికినది, కాని, క్రమక్రమముగ సామాన్య జనులలో విద్యావ్యాప్తి తగ్గుచుండుటచేతను, కవులకును సామాన్య జనులకును సంబంధము తగ్గుటచేతను, దేశము మహమ్మదీయుల కధీనమైనపిదప జాతీయభావమే నష్టప్రాయమగుటవలనను, తరువాతి కవితకును జాతీయ జీవనమునకును అంత సంబంధమున్నట్లు కనఁబడదు. సహజకవిత తగ్గినకొలఁది కవితావిమర్శన ప్రబలి యాలంకారిక గ్రంథములు బయలు వెడలినవి. ఈ యాలంకారికుల నిబంధనలను దాఁటి

పోకుండుట కూడ కవుల కాచారమైనది. ఇట్లు హైందవ వాఙ్మయము ప్రాచీనార్యుల జాతీయ జీవన పద్ధతిని విశదము చేయుచునే యున్నది.

ఇంతకుఁబూర్వము చాలా కాలముక్రిందటనే యార్యులు దక్షిణహిందూస్థానమునకు వచ్చియుండుటచే హైందవవిజ్ఞాన మచ్చట వ్యాపించుటేగాక క్రమముగఁ గొంతకాలమునకు సంస్కృతభాషా సంసర్గమువలన దేశభాషలయందు వాఙ్మయాభివృద్ధికి చేయూఁత దొరికినది. చాల కాలమువరకును సంస్కృత ప్రాకృతభాషలకే రాజావలంబనము లభించుటవలన దేశభాష లభివృద్ధి చెందుటకు వీలు లేకయున్నను, క్రీ. శ. 7వ శతాబ్ది ప్రాంతమున వేఁగిదేశమును జయించిన చాళుక్య ప్రభువులు దేశికవిత నీ దేశమున నెలకొల్పినట్లు నన్నెచోడ మహాకవి తన కుమారసంభవ కావ్యమునందు-

మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్రవిషయం
బునఁ జనచాళుక్యరాజు * మొదలుగ పలువుర్॥

అను పద్యమునఁ దెల్పియున్నాఁడు. ఇట్లు సత్యాశ్రయునిచే నాటఁబడిన దేశికవితా వృక్షము సంస్కృతభాషా వాఙ్మయములను దోహదముచే క్రమముగ వృద్ధిచెంది రాజనరేంద్రుని నాఁటికి పుష్టి గాంచి యమూల్యములగు ఫలముల నిచ్చినది. సంస్కృతవాఙ్మయమే దేశమున నెక్కుడాదరము వడసి

---

* సత్యాశ్రయునితొట్టి చాళుక్యనృపుల్.

యుండుటచేతను, పండితులు కవులు నగువా రీ భాషయందే యభిమానము కలవా రగుటచేతను దేశభాషలోని దేశీయ కవిత యప్పటి సంస్కృతపండితుల యాదరమును బడయ గల శిష్టకవితను పుట్టించునంతటి స్థితిలోనికి రాకుండుట చేతను, సంస్కృతగ్రంథముల భాషాంతరీకరణములే ప్రథమ మున నీ దేశీయ వాఙ్మయమున 'ప్రసిద్ధిగాంచిన' గ్రంథము లగుట తటస్థించి యుండును. మఱియు నప్పటికి దేశమున వ్యాప్తిఁ జెందియున్న బౌద్ధజైనమతముల నణచివేసి సామాన్య జనులలో వైదికధర్మములను వ్యాపింపఁజేయు నుద్దేశముతో సకల విజ్ఞానధర్మంబులకు నాలవాలం బైనట్టియు భారతే తిహాసంబును పురాణంబులను దేశభాషలలోనికిఁ దెచ్చిరి. తిక్కనసోమయాజి చెప్పినట్లు "భారతామృతముఁ గర్ణ పుటంబుల నారఁ గ్రోలి యాంధ్రావళి మోదముం బొరయఁ గల్గు" నని యప్పటివారు తలంచిరి. కావుననే యీ యుగ మాంధ్ర వాఙ్మయమున భాషాంతరీకరణయుగమై వెలుఁగొందె నది. కాని, ఈ యుగమున కంతకును, ఈ యుగమునకేమి-ఆంధ్రవాఙ్మయమున కంతకును, అలంకారంబగు నాంధ్ర భారతము కేవలాంధ్రీకరణమని చెప్పుట సమంజసము కాదు. దీనిని కేవలాంధ్రీకరణముఁగ భావించి మూలముతో నచ్చటచ్చట పరిచూచి ఆ యా పట్ల మూలముకన్న కొంత భేదముగ నుండు టయే గాక, ఎక్కువ రసవంతముగను, రమణీయముగను నుండుటను గనుఁగొనియు, పూర్వపు ప్రమాణము చేతనే దీనిని విమర్శించి మూలమునకు సరిగ లేదని కొందఱాక్షేపింతురు.

కాని, యొక విధమగు దోషముగ నెన్నంబడుచున్నను ఈ గుణమే దీని యుత్కృష్టతకుఁ గారణము. కావున, భాషాంతరీకరణమైనను, ఈ గ్రంథమును మూలముకన్న రసవంతముగను రమ్యముగను జేయు నుద్దేశముతోడనే తిక్కనాదులు కొంత స్వాతంత్ర్యమును దీసికొని యుండిరి గావున, నీ యుగముననే రాఁబోవు యుగమునందలి స్వతంత్ర గ్రంథముల చిన్నెలు కొంతవరకు పొడసూపి యుండినవని చెప్పనొప్పును. మొత్తము మీద నీ యుగమునందు మతాభిమానమే వాఙ్మయ ప్రవాహమును నడిపినదని చెప్పవచ్చును.

క్రమముగ కవుల కీ భాషయం దభిమానము హెచ్చుటయు, సంస్కృతకావ్యాదుల ననువదించుటయే గాక తమ స్వతంత్ర కల్పనాశక్తిని వర్ణనాచాతుర్యమును ఎక్కుడుగ చూపవలెననెడి యభిలాష బలమగుటచే మూలగ్రంథముల నుండి కథను, కొన్ని కల్పనలను మాత్రమే తీసికొని స్వకల్పనలచేఁ బెంచి భాషాంతరీకరణమునకును స్వతంత్ర గ్రంథమునకును మధ్యస్థముగ నుండునట్లు చేయుచువచ్చిరి. దీనికి శ్రీనాథుఁడే ముఖ్యోదాహరణము ఈతనిని భాషాంతరీకరణయుగమునకును కావ్యయుగమునకును నడుమ రెంటినికలుపుచుండెడి యొక వంతెనకుఁ బోల్పవచ్చును. 14 వ శతాబ్ది ప్రారంభమున ప్రతాపరుద్రదేవుని యాస్థానమున నుండిన విద్యానాథుఁడను సంస్కృత కవివలెనే ఆతని మంత్రులకుఁ గాని దండనాథులకుఁ గాని కృతియిచ్చిన మారన, మంచన, భాస్కరకవి మొదలగు వారి గ్రంథములవలన నా కాలపు స్థితిగతులు తెలిసికొనగలిగి

నట్లే, పదునైదవ శతాబ్దమున నున్న శ్రీనాథుని గ్రంథముల వలన నా కాలమందలి రెడ్ల చరిత్రను, నాంధ్రజనుల స్థితిగతులను గూడ విశేషముగాఁ దెలిసికొనఁ గలుగుదుము. తరువాత 16 వ శతాబ్దమున నాంగ్లదేశమందువలెనే కృష్ణదేరాయల భుజపీఠిక నలంకరించి మహోన్నత పదవి నొందిన యాంధ్ర భూమియందు నొక నూతన వికాసము గలిగి రాజకవియు, కవిరాజును నగు నాతని ప్రాపున కవితాసతి నూతన తేజంబు వడసినది. ఈ కాలమున నాంధ్రదేశమందు వలెనే యాంధ్ర సారస్వతమునను స్వాతంత్ర్యగుణము నెలకొల్పఁబడినది. సంస్కృత గ్రంథములను దెనిఁగించుట మాని యే పురాణము నుండియో యొక గాథను దీసికొని దానిని తన రచన కనుకూలమగునట్లు పెంచి రసవంతములగు స్వతంత్ర కావ్యములను రచించుటకుఁ బ్రథమమున దారితీసినవాఁడు రాయల యాస్థాన కవియగు పెద్దనార్యుఁడు. ఇంక నీ యాస్థానముననుండి యష్ట దిగ్గజములని పేరు వడసిన ముక్కు-తిమ్మనాదు లీ దారినేపోయి, యనేకములగు స్వతంత్ర ప్రబంధముల నాంధ్రవాఙ్మయమున కలంకారములుగఁ జేసిరి. కృష్ణదేవరాయలు దక్షిణహిందూస్థానము నేలిన రాజు లందఱిలో గొప్పవాఁ డనియు, నాతని పరాక్రమము వైదుష్యము కవి జనంబులయెడ నాతనికిఁ గల యాదరమునే గాక యప్పటిజనుల జీవితపద్ధతులు, భావములు మొదలగు విషయముల నా కాలపు పెద్దన, తిమ్మన, మల్లన, ధూర్జటి మొదలగువారి కవితలనుబట్టి మనము గ్రహింపఁగలము. ఇట్లే ఇఁక తరువాతి కవులుకూడ పెద్దన చూపిన ప్రబంధ

సరళినే గతానుగతికముగ ప్రవర్తించుటచేతను, తమ పాండిత్య ప్రకర్ష చూపుటయే ఆ కాలమున నొక గుణముగ పరిగణింపఁ బడుటవలనను, క్రమముగ కవితకు వికాసము తగ్గుటయేగాక ఆ కవిత యా యా కవుల కాశ్రయులగువారి వంశ చరిత నొక్కింత మనకుఁ దెల్పుచుండెనే గాని, ఆంధ్రదేశమునందలి జనసామాన్యము యొక్క స్థితిగతుల నంతగాఁ దెలుపునదిగా లేదు. ఇది యదియన నేల? సామాన్యముగ నాంధ్రవాఙ్మయ మంతయు అట్టిదయని చెప్పవచ్చును. ఇంతకు నీ దేశమందలి కవిత రసజ్ఞులగు కొందఱు రాజుల పోషణమువలన వృద్ధిచెందిన దగుటవలన నా కవులును తమ కాశ్రయులై తమ్ము పోషించు చున్నవారి ప్రభావంబును, వంశావళియుఁ గొంత వర్ణించి యాశ్వాసాంతముల మఱి రెండు మూఁడు బిరుదావళులు చదువుచుండుటయేగాని వారి కారాజ్యమందలి జనులయొక్క గాని సామాన్యముగ నాంధ్రజాతియొక్క గాని స్థితిగతులను ఆశయములను వర్ణించుట కుత్సాహము కలుగలేదు. దీనికి కారణ మాంధ్రజాతీయ స్వాతంత్ర్యము కొంతకాలమైన నెడ తెగక లేకుండుటయే. కొందఱు రాజు లాంధ్రకవుల నాదరించి యాంధ్రవాణి నుద్ధరించినను, దేశమున శాంతి తక్కువ యగుటచే జాతీయజీవనమున కంతగా ప్రోత్సాహము లేకుండెను. రాజుల యాస్థానములలోఁ దమ కాలమును గడుపుచుండిన కవిరాజులకు సామాన్యజనులతో విశేషపరిచితిగాని, వారిభావములను ఆదర్శ ములను పరిశీలించుటకుఁ దగిన యవకాశముగాని యున్నట్లు కనఁబడదు. మఱియు సామాన్య జనులలో విద్యావ్యాప్తి

శూన్యప్రాయంబగుటంజేసి యిట్టి పరస్పర సంబంధమునకు వీలు దొరకియుండదు. కావున, అప్పటి రాజులును వారిమంత్రులును సామాన్యముగ యశోలుబ్ధులగుటచే, కవిరాజుల సంకీర్తనంబున తమపేరు శాశ్వతంబుగ నుండుననితలఁచివారివలనఁ గృతులు గొనుచుండిరి. కవులును తమ్మాదరించువారు లేక వారి ప్రాపున చేరి వారి గుణములు సంకీర్తనము చేయుచు, కథాభాగమున కే పురాణమునుండియో యొక విషయమును దీసి, దానియందే తమ చాతుర్యంబును వెలయింపఁజూచిరి. కావున, వీరి గ్రంథములలో సాధారణముగా మనకు దినచర్యయందుఁ గనఁబడెడి మానవ జీవితంబును మనోవృత్తులను భావంబులను గనఁబఱుపక, పూర్వయుగములఁ బ్రసిద్ధిచెందిన కించిదతిమానుష ప్రభావము గలవారి చర్యలను, వారి యాకారములను మనయెదుట నిల్పి, మన కున్నతాదర్శములను బోధించుచుండిరి. వాఙ్మయము యొక్క ముఖ్యప్రయోజనము మానవజీవిత ప్రతిపాదనముగాని నైతికమార్గ ప్రతిపాదనము మాత్రమే కాదు. ప్రతిభావంతుఁడొకడు మానవజీవితమును బాగుగఁ బరిశీలించి, ఆయా జనుల యవస్థలను ఆయా స్థితులవారి భావములను ఒక్కొక్క విషయమున వారి కనుభవసిద్ధము లయ్యును బయటికి వెల్వడ సమర్థములుగాని మనోవృత్తులను బాగుగ కనిపెట్టి చక్కని సందర్భమున గల్పించి చిత్రించియున్నచో, అవి వారి మనమును తత్క్షణమే యాకర్షించుటకు సంశయంబేమి? ఒక పుస్తకము చేబట్టినంతనే, అందు పాఠకునకు స్వానుభవము లగు విషయము లనేకములు పొడకట్టుటయే గాక, తనవలెనే

కష్టసుఖములకుఁ బాల్పడినవారి జీవితములను గుఱించిన యభిప్రాయములను వాని కది వెలిపఱచుచుండును. అట్టివాని స్థితికై సానుభూతి గనఁబఱచు ననేకులగు సాటిజను లా గ్రంథమునఁ గనఁబడుటచేతనే, వాని కొక రీతి యానందమును తాపోపశమనంబును మనశ్శాంతియుఁ గల్గుచుండును. కావుననే జార్జి ఎలియట్ అను నామె 'వాఙ్మయ మనునది మన యనుభవజ్ఞానమును వృద్ధి చేసికొనుటకును, సామాన్యముగా మనము గలిసికొనుటకు వీలు లేని పలువురు సజాతీయులతోడి సంబంధము కలుగఁజేసికొనుటకును ముఖ్యమార్గ'మని చెప్పియున్నది. ఇట్లు సార్వజనీనంబులు సహజంబులునగు జాతీయభావములను మనోవృత్తులను బ్రతిపాదించున దగుటం జేసియే వాఙ్మయమునందు మానవకోటి కంత యభిమానమును గౌరవమును గలుగుచున్నది.

కాని, మనయాంధ్రకవు లీవిషయము నంతగా పాటించినట్లు కనఁబడదు. ముఖ్యముగ ప్రబంధ మనునది చాలవఱకు వర్ణనాత్మకమగు కవితలోఁ జేరినదేగాని భావావబోధమే ముఖ్య విషయముగఁ గలది కాదు. మఱియు నలంకారశాస్త్ర నిబంధన లీ గ్రంథములను నైజకవితకు మరింతదూరముగఁ జేసినవేమో. సాధారణముగా నిటీవలి ప్రబంధములలో కథాసరణియు రచనాప్రణాళికయు సమానమే యగుటచే కథ మొదలు చెప్పినచో తుదవఱకు నూహించి చెప్పుట సుసాధ్యమగుచుండును. ఆలంకారిక మతప్రకారముగ నష్టాదశవర్ణనలు లేనిది కావ్యంబు గాకుండుటచే నెట్లయిన నా వర్ణనలను కథలోఁ

ప్రవేశపెట్టి యాగ్రంథమును కావ్య మనిపించుట తటస్థించు చున్నట్లున్నది. మఱియు నాయకుఁడు ధీరోదాత్తుడయి యుండ వలెననియు, అట్టివానికీ యీగుణంబులుండవలెననియుముందు గనే పేర్కొని యుండుటచే నీ గ్రంథకర్తల కేమాత్రమును గ్రంథమందలి పాత్రలను స్వానుభవమునుండి యథేచ్ఛముగ నిరూపించుట కుత్సాహము లేకుండెను; తమ గ్రంథము శాస్త్ర సమ్మతమగు ప్రబంధమో, నాటకమో కాకపోవునేమోయని యా నిబంధనల నతిక్రమింప నొల్లకుండుటవలన, వారి గ్రంథ ముల నట్టాడు పాత్ర లచ్చున పోతపోసినవానివలెనుండుటయే కాని నేలమీఁద స్వేచ్ఛావిహారము సల్పుచు తమతమ మనో వృత్తులను మనకు విచ్చలవిడిగ వెలిపుచ్చుచున్న వారివలె గను పట్టరు. తొలియుగమున తిక్కనాదు లట్టి పాత్రలను సృష్టింపక పోలేదు. కాని సామాన్యముగా కవు లాయా కాలములందలి మానవజీవితమును బరిశీలించి సందర్భానుసారముగఁ బాత్రలను సృష్టింపక యే పురాణము నుండియో యొక ప్రఖ్యాత పురు షుని దీసికొని వాని ప్రసిద్ధంబులగు గుణములను వర్ణించుటచే నీ గ్రంథములను సులభముగ శాస్త్రసమ్మతములైన వానిఁగఁ జేయఁగలుగుచుండిరి. వీరికీ యాలంకారిక సమ్మతంబు లగు నుత్తమ పాత్రలు పూర్వ పురాణగాథలయందుఁ గన్పట్టెనే కాని, తాత్కాలిక దేశచరిత్రయం దెప్పుడును గన్పట్టలేదు. దీనికి కారణ మాంధ్రజనుల కెప్పుడు నాయా రాజుల ప్రాపున సుఖజీవనము పడయుటయందే కాని సాంఘికజీవనమునందును, దేశచరిత యందును విశేషాభిమానము లేకుండుటయే

కావచ్చును. జనుల మనముల నొక విధమగు స్వాతంత్ర్యాభిలాషయు నాత్మగౌరవమును నుదయించినఁ గాని సంఘోద్యమములందు రుచియు, వానియం దభిమానమును పుట్టవు. సంఘోద్యమములును, దేశోద్యమములును కవిజన మనంబుల కుద్దీపకములు. కవితకే కాదు, తదితర మానవ శక్తుల కన్నిటికి నభ్యుదయ వికాసము లుత్తేజకములే. అట్టి కాలముననే కవితయు నూతనమై స్వాభావికమై వికాసవంతమై వెలుగొందుట; కాని నాఁడు తాపత్రయ సంతాపితంబులగు నా కవిజన మనంబుల వోలె వికాసహీనమై యేవో కొన్ని కట్టుబాట్లకు లోనై గతానుగతికంబుగ నుండును. కావున కొంతవఱకాంధ్ర వాఙ్మయస్థితి యా జనుల స్థితిగతులనుగూడఁ దెల్పుచున్న దనుటలో సంశయములేదు.

కాని యిప్పుడు హిందూదేశ చరిత్రయం దొక నూతన యుగము ప్రారంభమైనది. ఇప్పటికి 150 సంవత్సరములక్రిందటనే బ్రిటిషు సామ్రాజ్య మీ దేశమున శాంతిని నెలకొల్పినను, ఈ శాంతియొక్కయు నాంగ్ల దేశీయుల సంసర్గము యొక్కయు, నాంగ్ల వాఙ్మయ పఠనము యొక్కయు ఫలితము లిప్పుడే కొంచెము గన్పట్టుచున్నవి. ఈ సామ్రాజ్యావలంబనమున నింతకాలమునుండియు నివురు గవిసిన నిప్పువలె నున్న ప్రాచీన హైందవవిజ్ఞాన మిప్పుడు స్వాభావిక తేజంబునఁ బ్రకాశించుచున్నది. తద్దేశచరిత్రము చదివినతోడనే యీ దేశజనులకు జాతీయ జీవనమునం దభిలాష యుదయించినది. ఆత్మగౌరవము వ్యక్తిస్వాతంత్ర్యము మొదలగు నుదారభావము లంకు

రించినవి. దేశాభిమానమును భాషాభిమానమును హెచ్చి నవి. దేశజనుల మనంబు నుత్సాహపూరితంబులై యున్నతా దర్శంబులతోఁ దులదూఁగుచున్నవి. దేశ సేవయు భాషా సేవయు ప్రతివానికిని ముఖ్యవిధులనియంగీకరింపఁబడుచున్నవి. ఇట్టి నూతనాదర్శంబులు నూతనోద్యమంబులు వాఙ్మయమునఁ బ్రతిఫలింపకపోలేదు. సంస్కృతవాఙ్మయ మంతయు తీక్ష్ణ బుద్ధితోఁ బరిశీలింపఁబడుచున్నది. ఈ భాషయే యాధునిక శబ్ద శాస్త్రసమస్యల ననేకములను సాధించుటకు దోడ్పడి యా శాస్త్రము నభివృద్ధిచేసిన పాశ్చాత్యుల గొప్ప మన్ననలకుఁ బాత్రమైనది. ప్రాచీన హైందవ నాగరకత యంతయు నట్టి నమ్మఁదగని పురాణగాథ క్రింద త్రోసివేయఁబడక, నవీన విమర్శనా పద్ధతుల ధాటి కాఁగి లోకజనుల నాశ్చర్య నిమగ్నులఁ జేయుచున్నది. ప్రస్తుతము వెనుకబడియున్న హైందవజాతి పురోభివృద్ధికి ప్రాచీన నాగరకతయే మూలాధార మగునని గుర్తించుటచే, దానిని పునరుజ్జీవింపఁ జేయుటకు సాధ్యమగు ప్రయత్నము లన్నియు చేయఁబడుచున్నవి. రవీంద్రనాథుఁడు మొదలగు కవీశ్వరు లీ నూతనోద్యమముల యాదర్శములఁ గొనియాడుచు, నీ జాతియందలి నూతనోద్బోధమునకుఁ దగిన ప్రోత్సాహము నిచ్చుచున్నారు. ఆంగ్లవాఙ్మయ సంసర్గము వలనఁ గవిత యందలి పూర్వపు రుచి మాఱినది. దేశభాషా వాఙ్మయము లన్నిటిలోవలెనే, యాంధ్ర వాఙ్మయమునను నూతనశాఖలు బయలుదేఱినవి. సంస్కృత వాఙ్మయాశ్రయ మును వదలి యాంధ్రదేశస్థితిని జాతితత్వమును వెల్లడింపగల

రచనలు, నవలలు, నాటకములు, విమర్శనములు, ఖండకావ్యములు మొదలగునవి బయలుదేరుచున్నవి. ఈ జాతీయోద్బోధముయొక్క చిన్నెలు క్రమముగ కవితయందును బ్రసరించుచున్నవి. పురాణ కథలకు బదులుగా స్వాత్మానుభవ నివేదనమే కవితకు వస్తువు కాఁ జొచ్చినది. అనేక సంఘములు పరిషత్తులు బయలుదేఱి భాషను వాఙ్మయమును వృద్ధిపఱచు విధానముల నారయుచున్నవి. ఇప్పటి కాంధ్రకవిత కాశ్రయాపేక్ష తప్పినదని చెప్పవచ్చును. క్రమముగ దేశమున విద్యావ్యాప్తి హెచ్చుచుండుటచే కవితయొక్క గుణాగుణములు నిర్ణయించి తగు ప్రోత్సాహము నిచ్చుట కాంధ్రజన సమితియే పూనుకొనుచున్నది. ఇట్లు జాతీయజీవనముతోపాటు వాఙ్మయమును భిన్నావస్థలఁ బొందుచుండుటను గనిపట్టి, ఇప్పుడు వ్యక్తములై క్రమముగ స్ఫుటము లగుచున్న యీ నూతనయుగ చిహ్నములను ధర్మములను కవితయందు నెలకొల్పి దేశ జనుల కుత్సాహమును నుద్రేకమును పుట్టించి, ఈ జాతీయోద్యమమునకుఁ దోడ్పడి దేశీయ కవిశిఖామణు లందఱును శాశ్వతకీర్తిని బడయుదురు గాక!

# రాయల నాటి రసికత

— శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ

రాయలకాలపు జనుల జీవితమును సాక్షాత్తుగా తెలుపు గ్రంథము లేవియు లేవనుట యందఱు ఎఱిఁగిన విషయమే. పరంపరగా ఆ విషయమును స్పృశించు గ్రంథము లనేకములు గలవు. వానిలో ముఖ్యమైనవి మూఁడు: రాయలే రచించెనను ప్రసిద్ధిని బడసిన ఆముక్తమాల్యద; ఆయన కంకితములగు భాగ్యమును బడసిన పెద్దనార్యుని మనుచరిత్రము; తిమ్మన్న పారిజాతాపహరణమును.

పై మూఁడు గ్రంథములును ప్రబంధములే. సత్యమగు విషయమును మాత్రము చెప్పవలయునను నిర్బంధ మా గ్రంథ కర్తలలో నెవరుగాని చేసికొన్నవారు కారు. మఱియు అనుభవమునకు రానివి—అసత్యములైనవి—ఎన్ని విషయములు చెప్పినను ఎవరును వారి నాక్షేపించినవా రాకాలమున లేరు. నేఁడు మన మాక్షేపించిన వారికి నష్టములేదు; మనకు లాభము లేదు. కాని వ్రాసిన కవి సత్యమైయుండఁగా, అతఁడు జీవించి, సంచరించి, చూచి, అనుభవించిన సంఘము కన్నుల యెదుర సత్యమైయుండఁగా, అతఁడు వ్రాసిన కావ్యములలో మాత్రము అంతయును అసత్యమే యుండుట అసాధ్యము. తత్త్వశాస్త్ర సిద్ధాంతు లేమందురోకాని, సాహిత్యమువారమగు మనకు సత్యములేని యసత్యముగాని యసత్యములేని సత్యముగాని

దొరకుపదార్థముగాదు!కనుక చాదస్తములేనిదృష్టితోఁజూచితి మేని, సమకాలికజనుల త్రికరణప్రవృత్తులు ప్రతికవి గ్రంథము నందును ప్రతిబింబించి యుండుట యెఱుఁగవచ్చును.

అట్లే పై మూఁడు గ్రంథములయందును వర్ణింపఁబడిన వ్యక్తులు ప్రాయశః అలౌకికములైనను, అవి లౌకికులగు కవుల చేతిలోనే తయారైనవిగావున వీరిలోకపుగుర్తులను పూర్తిగా తప్పించుకొనలేకపోయినవి. శ్రీవిల్లిపుత్తూరినిండ వజ్రకుట్టిమ ములు, మణితోరణములు, సువర్ణసౌధములు యెన్నియున్నను ఆ యూరి సరస్సులలో అంతరగంగ, ప్రాఁచి ఎట్లో వచ్చి సందులోదూటి చోటు చేసికొన్నవి. (ఆము. మా. ఆ. ౧. ౭౧) విష్ణుచిత్తుఁడెంత విరక్తసంసారియై, 'అబుద్ధేతుధనుఃపత్రుఁడై' నను, (ఆము. ఆ. ౫.ప. ౧౫౬) వానకాలమున భార్య వంట చేసిన పొగదగిలి యామెకన్నులు నొచ్చునే యని ముందుగానే టెంకాయ బొండ్లముల నెండించి సిద్ధముగాఁజేసి పెట్టుకో వలసెను (ఆము. ఆ. ౧-౮౦) మఱియు తనకు సాయోపేయ భూతుఁడగు శ్రీరంగనాథుఁడే తనబిడ్డను వలచి పెండ్లిచేసి యిమ్మని మధ్యస్థము పంపగా 'మీ యింటికివచ్చి పెండ్లి చేసి యీయను. మా యింటికి నీవే రావలయును' అని పరమ భక్తాగ్రేసరుఁడు ఖండితముగా బల్కి పూర్వకాలపు మామగారి మర్యాదను—ఈ కాలమున నిది అల్లుండ్ల మర్యాద—నిలుపు కొన్నాడు! (ఆము. ఆ. ౭-౫౫) పెద్దనగారి హిమవత్పర్వత శిఖరమందు పెరిగిన 'జటిల ద్రాఘాగుళుచ్ఛంబులు', వెను గొండవే; కోనలు, కాఱుచిచ్చులు, కోతులు, పందులు, దున్న

పోతులు—అన్నియు నిక్కడివే యక్కడ కెక్కినవి. వరూధిని యెన్నిమాఱులు జ్ఞప్తికిఁ దెచ్చుకొన్నను తాను దేవతయను విషయమును మఱచి, పదేపదే మనవలె చెమర్చును; కన్నులు మూసికొనును. స్వరోచి నిర్జరుఁడే; కాని వాని వెంట వేఁటకు పంది వలలు మోచికొని 'గూనివీపులదుర గొణఁగి తిట్టుచు నేకుఁ గఱచినట్టి కుక్క గండ్లనంగ, మూతి నఱపమీసముల'తోఁ బోయిన బోయముదుసళ్ళు రాయలసీమ పల్లెలోనివారే! (మను. ఆ. ౪-౩౬)

కాఁబట్టి కవులు కావ్యములందలి వస్తువుల నెంతపైకెత్తినను భూలోకపుగాలిని దాఁటునంత మీఁదికి ద్రోయఁ జాలరు. అట్టి స్థితిలో అప్పటి మనుష్యస్వరూపమును వానినుండి వేఱు పఱుచుట యొక కష్టముగాదు. పై మూఁడు గ్రంథముల నుండి రాయలకాలపు రసికజీవన మెట్లుండెనని గ్రహింపఁ జూచుటయే యిప్పటి నా ప్రయత్నము.

రసిక శబ్దమున కెక్కువ వ్యాఖ్యానము చేయ నక్కర లేదు. రసికుఁడనఁగా భోగియని యందఱెఱుఁగుదురు. తన మనస్సున కానందము నిచ్చు భోగము అనుభవించుటలో కష్ట సుఖములుగాని, లాభ నష్టములుగాని తుదకు ధర్మాధర్మములు గాని యెక్కువగా లెక్కపెట్టక పని చేయువాఁడు రసికుఁడు.

భోగములు ప్రవృత్తిభోగములని, నివృత్తిభోగములని రెండు విధములుగా వింగడింపవచ్చును. ఎందుకనఁగా, ప్రవృత్తి మార్గమునందుండి ప్రాపంచికములకు గృహాశయ్యాది భోగ ముల ననుభవించుటయం దెంత యానందము గలదో యంతే,

మఱియు నంతకన్న నెక్కువయే-నివృత్తిమార్గమునకుఁ జేరిన భక్తి, త్యాగము, వైరాగ్యము, శాంతి- మొదలగు వాని ననుభవించు నప్పుడును గలదు ఆనంద మనునది మనోధర్మముగాని వస్తుధర్మముగాదు. ఏ కారణముచేతఁగాని దేనియందు మనస్సు దృఢముగా లగ్నమగునో దాని ననుభవించునప్పుడు మనకు నిరతిశయానందము గలుగును. అట్టి యానందమును సాధింపఁ బ్రయత్నించుటయే రసికత్వమునకు లక్షణము.

రసికత్వమెంతయుండునో యంతగొప్పతనము మనుష్యజాతియందుండును. ఇది లేనివారు నడపీనుఁగులుగానుందురే కాని బ్రతికినవారి గుంపులోఁ జేరరు. కారణమేమనఁగా : రసికతకు మూలప్రకృతి సత్త్వము. సత్త్వమనఁగా, వలపు, ఉత్సాహము, కోపము మొదలగు భావములు మనస్సులో నుదయించిన వెంటనే వాని యుద్రేకమునకు తగినట్లుగా దేహమునందలి నరముల బిగువు హెచ్చించి, రక్తము నుడికించి, కంపస్వేద రోమాంచాదులను గలిగించి, కార్యశూరత్వమునకై ప్రేరించు చేతన గుణము. కావుననే పై కంపరోమాంచాదులు 'సాత్త్వికభావము'లని లాక్షణికు లందురు. ఈశక్తి బలిష్ఠముగా నుండని వారు రసికులు కాఁజాలరు. అట్టివారికి భావములు కలుగవచ్చును గానివానివలన ఫలమేమియుఁ గలుగదు. వారి వలపు వంచన; వారి యుత్సాహము దంభము వారికి కోపము వచ్చినచో పెదవులఁ గొఱుకుజలమైనను పండ్లకుండదు. పనినిగాని వారు పట్టనే పట్టరు; పట్టినను సాధింపఁజాలరు. రాయలకాలపువారి రసికత గమనించితిమేని మన మెంత యరసికశిఖామణులమై యున్నామో పోల్చుకొని గ్రహింపఁగలము.

భోగముల ప్రవృత్తి నివృత్తి భేదముచే రెండు విధము లంటిని. ఆ కాలపు వారి నివృత్తి రసికత తరువాత వివరింతును. ప్రవృత్తిభోగములు పలువిధములు పదార్థములు లెక్కపెట్టి పట్టీ వ్రాయుటలో ప్రవీణులయిన ప్రాచీనులు ఈ భోగము లెనిమిది యనిరి. ఇల్లు, వస్త్రము, ఆభరణము, గంధము, పుష్పము, తాంబూలము, శయ్య, స్త్రీ యని. కాని యన్ని భోగముల కాధారమగు అన్నపాన భోగములను వారేల పరిగణింపలేదో వింతగా నున్నది. మఱియు స్నానమును గూడ భోగముగనే పరిగణింపవలసి యున్నది. కాబట్టి మనకిప్పుడు పై పదునొకండు భోగ్య విషయముల గూర్చి యాకాలపు వారి దృష్టిని తెలిసికొనవలసియున్నది. దృష్టిని తెలిసికొనిన సిద్ధిని దెలిసికొన్నట్లే ఎందుకనఁగా మనసులోని పరాయణ మెంత గొప్పగా నుండునో యంత పూర్ణముగా దానిని సాధించుట కందఱికిని శక్తిలేకున్నను కలవారు దానిని సాధించి తీఱుదురనుట యసత్యముగాదు. కావున వస్తువులను గూర్చి వారిదృష్టి యెఱుంగుటయే యిట్టి సందర్భములలో ముఖ్యము.

ఆకాలపువారు అల్పతృప్తులుగారు. ఏ విషయమందును వారియాశ గొప్పది. జీర్ణశక్తియు దానికిఁ దగినట్లు గొప్పదే. వారపేక్షించు వస్తువులెల్ల నాయాజాతిలో సాధ్యమైనంత వఱకన్ని విధముల నుత్తమములైనవి — లేక యుత్తమములుగా వారికిఁ దోచినవి. అట్టివానిని వారు తనివిదీఱ ననుభవించిన వారు. ఎక్కువ వారి స్వాధీనమందున్నప్పుడు కొంచెమనునది వారెఱుఁగరు. వరూధినితో మాయాప్రవరుఁ డిట్లు పలికెను:

ఉ. నీ చనుదోయి సంకుమద • నిర్భర వాసన మేన నూన న
య్యో ! చిరసౌఖ్యముల్ గనుట • యొండె; తపంబొనరించి పాపముల్
రాచుట యొండెఁ ; గా కిహప • రంబుల కూరక దూరమై వయః
శ్రీచన రెంటికిం జెడిన • రేవఁడనైదునె యో మృగేక్షణా !

(మను. ఆ. ౩. ౧౦౫)

కాని యిది పెద్దన్న కాలమందలివా రెల్లరును ఇంచు మించుగాఁ జెప్పెడుమాట. భోగములేకాదు; వారి భావము లును ఇట్టివే. పాండ్యరాజునకు 'వెఱ్ఱిశైవంబు ముదిరి' యుం డెను. వాని భార్య పరమపతివ్రత; కాని యామెకు వైష్ణవంబు ముదిరియుండెను. గ్రంథకర్త దీనిని వెఱ్ఱియనలేదు కారణ మేమనఁగా శైవద్వేషము, వైష్ణవాభిమానమును అతనికంత ముదిరి యుండుటయే. ఎట్లును ఏదియైనను 'ముదిరి' యుండెనే కాని వారు పచ్చి, దోర, యెఱుఁగరు. జోరని వాన గురియు చుండఁగా దేశాంతరము నుండి వచ్చిన మార్గస్థులు పట్టణము లలోఁ దలదాఁచుకొనుట కెక్కడనైనను నిలుతురుగదా! ఆ కాలమున నట్టివారు వాన వెలియు వఱకును అట్టిచోట్ల చర్చించు విషయము లేమనుకొన్నారు? అశ్వపతి, గజపతి, నర పతి-వీరిలో నెవరెక్కువ బలవంతులని! వారప్పు డొక్కొక్క రొక్కొక్కని పక్షము వహించి మాటలాడి, వాదించి, తుదకు వ్యవహారము తెగక మొత్తులాడుదురఁట! వాన కొంచెము వెలిసినవెంటనే యెవరిత్రోవ వారిదిగాఁ బోవుదురు! (ఆము. ఆ. ౪-౧౩) అది వేఱుమాట. 'పోనీ లే; మనకేల?,యని తాము పట్టిన దేనినిగాని యుదాసీనముగాఁ జూచు పద్ధతియే యా

కాలపు వారియెడఁ గానరాదు. యామునాచార్యుఁడు చిక్కని బ్రహ్మచారి; అప్పుడతనికి చదువు, దానికి ఫలముగా పరులను వాదమున జయించుట, వైష్ణవమతమును స్థాపించుట-వీనియం దపారమైన యుత్సాహము; అవి సాధించి రాజైనాఁడు. ఆ రాజభోగములలో బ్రాంతవన్నియు మఱచెను. మఱల నెవఁడో తన తప్పుచూపి బోధింపఁగా ఆ క్షణమందే రాజ్యము గీజ్య మన్నియు వదలి సన్న్యాసమును గ్రహించెను! ఇట్టివారి భోగ తృష్ణ యల్పముగాఁ గాని, భోగ్యవస్తువులు పనికిమాలినవిగాఁ గాని యుండఁగలవా? క్రమముగా వానిని బరీక్షింతము.

ఆ కాలపుటిండ్లలో మన యూహాశక్తిని మీఱిన రత్నాల గోడలు, వజ్రాల కంబములు మొదలగు వానిని మఱచితిమేని యింత తేల్చుకొనవచ్చును. అవి యన్ని ఋతువులకును అను కూలముగా హితముగా నుండునట్లు కట్టినవి ముంగిటిలో ఇరు ప్రక్కల అరుగులు. కంబములపై బొమ్మలు తీర్చియుండురు. గోడలపై చిత్తరువులు. ఎత్తైన మేడలు; అచ్చటనే వెన్నెల సౌఖ్యము లనుభవించుటకు చంద్రశాలలు. కలశములు; ధ్వజ ములు. అవి పలువన్నెల వస్త్రములతోఁ జేసినవి. ఇంటికొక పూలతోఁట. అందు చెంగలువల కొలను. అవకాశమున్నచో దాని ప్రక్కన కృత్రిమముగా తయారు చేసిన కొండ. అందు వారివారి యిష్టానుసారముగా తయారుచేసిన గుహలు. మీఁదికి మెట్లు. నీటిని పైకి వెదచల్లు ధారాజల యంత్రములు. వేస విలో ప్రత్యేకముగా చలువమయములైన ధారాగృహములు గలవు. ఇంటిలో చిలుకలు, హంసలు, నెమిళ్ళు, పావురములు,

లేళ్ళు మొదలగు పెంపుడు జంతువులు గలవు. చిలుకలకు బంగారు పంజరములు, నెమిళ్ళకు 'యష్టి' యనఁబడు విశాలమగు గూటము మీఁది పలకలును గలవు. చిలుకలకు మాటలు నెమిళ్ళకు ఆటలు నేర్పుట యింటి యాఁడువారి వినోదములలో నొకటి.

అప్పటి గృహరచనలో నన్నిటికన్న గొప్పవింత యేమనఁగా: కోపగృహము! కోపగించు కొన్న వారు—ముఖ్యముగా యజమానునిపై యజమానురాలికి కోపము వచ్చినప్పుడు-ఆ కోపము తీఱువఱకును, లేక యెవరైన తీర్చువఱకును ఆ యింటిలోనుండి తలుపులుబిగించుకొందురఁట! ఏబుద్ధిమంతుఁడుదీనిని గల్పించెనో కాని యిది చాల మంచి పద్ధతి; తక్కిన వారు తమ తమ పనులు తకరారులేకుండఁ జేసుకోవచ్చును. ఆ కోపము తీర్పవలసిన యక్కఱ గలవారు పోయి తీర్తురు. కైకేయి కొఱకు దశరథుఁడే దీనినికల్పించెనేమో! రాయలకును పెద్దన్నకును దీని యక్కఱ తోఁపలేదుగాని తిమ్మన్నకుమాత్ర మిది సత్యభామకొఱకై తయారు చేయలసి వచ్చినది.

వారి వస్త్రాభరణాదులకు ముందు వేషరచనలో ప్రధానాంగమగు స్నానమునుగూర్చి తెలిసికొందము. స్నానమనఁగా అభ్యంజనము. తక్కినది భోగములలోఁ జేరదు. అప్పటివారు సామాన్యముగా అభ్యంగమే నిత్యస్నానముగా నుంచుకొన్నట్లు కానవచ్చుచున్నది. నిత్యాభ్యంజనము వైద్యశాస్త్ర విహితము. విష్ణుచిత్తుని యింటిలో ప్రతిశనివారమును పరదేశ వైష్ణవులకు తలంటు నీళ్ళు జరుగుచుండెను. వారికి

అరఁటి పూరేకుల దొప్పల నిండ నూనెయు ఉద్వర్తనమునకు ఇప్పపిండియు సరఫరా యగుచుండెను. (ఆ. ఆ. ౧-౮౭) నదిలో స్నానము. పాప మూపేదవానియింట నంతకంటె నేమి లభింపగలదు? కలిగినవారి తలంటు తరగతియే వేఱు. మొదలు సంపెంగనూనె మొదలగు సుగంధ తైలములతో తలయంటు; తరువాత నెనరైనను వెంట్రుకలు మెల్లగా గోళ్ళతోవిప్పి, చిక్కుదీసి, విదిలించి, నడుమనడుమ పన్నీరు చల్లుచు, శ్రీగంధము ఉపిరికపప్పును నూరి పట్టించవలయును. తరువాత దేహాభ్యంగము. పిదప 'గొజ్జఁగినీటి వెల్లువలు గోవజవాదుల నిగ్గుచూప' (మను. ఆ. ౫-౫౭) తెలుపిలేక పలువురు వెంటవెంటనే పోయవలయును! తరువాత పలుచని వలిపముతో వేఱొక్కరు తడియొత్తవలెను! అభ్యంగపు గుణములు పొగడుట కాయుర్వేదమునకు మాటలు చాలవు. కావుననే మనలో నన్ని శుభకార్యములకు నది మొదటిదిగా పెద్దలు నిర్ణయించిరి. ఆరోగ్యకాంతులగు రసికులు సుగంధతైలాది సేవనచే దానిని మఱింత యాహ్లాదకరముగాఁజేసి యనుభవించిరి. మఱియు ఆ కాలమున స్త్రీకు పురుషులకుఁగూడ నిడుపై దట్టమైన తలవెంట్రుకలు కలవు. అదియొక యలంకారముగా వారు భావించిరి. స్త్రీలకు తలనిండ వెంట్రుకలున్న సొగసను విషయము మన మింకను పూర్తిగా మఱచిపోలేదు గాని మగవారికి వెంట్రుకలలంకారముగాదు, వికారమను భావము నేఁడు ప్రబలినది. దానికిఁదోడు పాశ్చాత్య దాస్యధ్వజమైన పాపట మగవారందఱి తలకెక్కుటయేకాక స్త్రీలకుఁగూడ నందందు వెంట్రు

కలఁగ త్తరించుకొను వేడుక తలచూపుచున్నది! తలవెంట్రుకల సొంపును సొగసును పురుషులందుఁ గూడ గమనించి సంతసించిన వారిలో పెద్దన్న మొదటివాఁడని చెప్పవలయును. పరమ వైదికుఁడగు ప్రవరునికిని 'తెగఁబాఱెడు వెంట్రుకలు' తలపై మోపిన వాఁడతఁడు! (మను. ఆ. ౩. ౬.) సగరచక్రవర్తి ముమ్మనుమడు భగీరథుఁడు తపస్సు చేయునప్పుడు తక్కిన యవయవము లెంత కృశించినవని గమనింపలేదుగాని, వాని "నిడుద పెన్నెఱి వేణి జడగట్టె' ననియే పెద్దన్నకు పెద్ద దుఃఖము! (మను. ఆ. ౨-౯) వెంట్రుకలను బెంచుటకు అభ్యంగమే ముఖ్యదోహదము. కావుననే ఆ కాలపువారి కది యంతముఖ్యము.

వారు ధరించుచుండిన వస్త్రములు ముఖ్యముగా వన్నెలవి. వట్టి తెల్ల వస్త్రములు పురుషు లపురూపముగా ధరింతురు కాని స్త్రీలకు మాత్ర మవి పనికిరావు. సత్యభామకు కోపము వచ్చినప్పుడు తెల్లచీర గట్టుకొని యుండెనఁట. (పా. ఆ. ౧-౧౧౪) తక్కినపు డెల్ల చాల నభిమానముతోఁ గట్టుకొను వస్త్రములు చెంగావివి. అందును బంగారు సరిగలు నించినవి చాల ప్రియములు. వైదికుఁడగు ప్రవరుని వేషము వేసికొన్నను, గంధర్వుఁడు 'పసిఁడిమ్రాఁత చెరంగు మిసిమి దోఁపఁ జెలంగు నరుణాంశు కోత్తరీయంబుతోడ' (మను. ఆ. ౩-౨౧) నే వచ్చెనుగాని దానిని మానలేఁడయ్యెను! వాఁడు కట్టిన దోవతియు 'నీర్కావిపింజ' గలదే. కొందఱు 'మువ్వన్నె చుంగు' లను దాల్చుచుండిరి. (ఆ. ఆ. ౧-౩౯) ఈ వస్త్రము

లన్నియు పాముపొరలవలె 'ఊఁదినఁబాఱు' నంత సూక్ష్మ ముగా నుండెనట! (మను. ఆ. ౫-౫౭) రాయల దాడికి వెఱచి గజపతి యడవులకుఁ బాఱిపోఁగా నతని దేహమున కంటుకొన్న సాలీండ్లవలలు ఉత్తరీయములవలెనే యుండెనఁట! (ఆ. ఆ. ౧-౩౯) అట్టి సౌకుమార్యము నపేక్షించు రసికు లుండిరి. కావుననే యాకాలమున నట్టి నూలును అట్టి నేఁతయు సాధ్యములైనవి. ఇప్పటి ఖద్దరుధారు లనేకులు తాము కట్టు కొను వస్త్రము లెంత ముతకగానున్న నంత దేశాభిమాన మెక్కువ చూపినట్లు, స్వరాజ్యమున కంతదగ్గఱఁ బోయినట్లు భావించెదరు. కావుననే యిన్నాళ్ళు ప్రయత్నము జరుపు చున్నను నయమైన ఖద్దరు గుడ్డలు లభించుట యరుదైనది. అది యట్లుండె.

సొమ్ముల విషయమున ఆ కాలమందు స్త్రీపురుషుల కెక్కువ భేద మున్నట్లే తోఁపదు. సొమ్ముల స్వరూపమందు కొంత తేడా యుండవచ్చును గాని—అదియు సందేహమే— వాని మీఁది యాశలో నిరువురును సమానులే. స్త్రీలకు ఆభ రణములు ధరించుట యావశ్యకమని శాస్త్రమే విధించుచున్నది. భర్త కది ఆయుస్సును వృద్ధిఁ బొందించునఁట. అది నిజమేని అప్పిచ్చిన వారిదే అదృష్టము. కాని మగవాఁడును వారాల సొమ్ములు ధరింపవలెనని రాయల రాజనీతి! హారములు, భుజ కీర్తులు, ఉంగరములు, ఒడ్డాణము, కాళ్ళచేతుల కడియములు, చెవుల కుండలములు, శిరోమణి మొదలగునవి యా కాలమున స్త్రీ పురుషులు సమానముగా ధరించు చుండిరి. మగవారికి

కిరీటము, ఆడువారికి ముక్కర మొదలుగా కొన్నిటిలో భేద మున్నట్లు తోఁచుచున్నది. ఇట్లు సమానమైన యాభరణముల యాశగల యాలుమగల సంసారములో శాంతి యెక్కువగా నుండునేమోయని యూహించుచున్నాను. ఉన్న నిద్దరికిని సొమ్ములుండును. లేకున్న నిద్దరికిని లేదు! అంతేగాని ఆర్జించు శ్రమమంతయు నొకరికి, అలంకారమంతయు నొకరికి, అను తక రారు లేకుండును. నిజముగాఁ జూచిన మగవారికి సొమ్ముల మీఁద యాశ యేల యింతగా తగ్గినదని చిత్రముగాఁదోచును. ఇప్పటిమగవారిది మఱియు నన్యాయము. అనఁగా సొమ్ముల మీఁదియాశ ఇప్పటి పురుషులకు పూర్తిగా నశించినదని చెప్ప లేము. అట్లగుట స్వభావవిరుద్ధమే మో! పూర్వము కిరీటకటకాం గదమేఖలాదులయందున్న యాశ యిప్పుడంతర్ధానమైగుండీలు గడియారపు గొలుసులు, అపురూపముగా ఉంగరములు మొద లగువానియందు వెలచి వెలచి వ్యాపించుచున్నది. దీనికర్థ మేమనఁగా, మనకు నేఁడు మనజాతిసొమ్ములు మన యానంద మునకై ధరించు ధైర్యము లేదుగాని, యింకొకజాతిసొమ్ములు వారి మెప్పులకై ధరించుదాస్య మున్నదన్న మాట. మనవస్త్ర ములు నిట్లేకదా! సరిగంచుల సేలము ధోవతులు—నేఁత పని కెల్ల నెత్తిపూలవంటివి—గట్టుటకు మనకు సంకోచము కలదు గాని, 'సర్జు సూటు'లలో దూరుటకు సిగ్గులేదు! పింజెలు పోసి యలంకారముగా చుంగులు చుంగులుగ ధోవతి కట్టుకొనిబైటఁ గనబడుటకు బిడియము; కాని చాఁకలివాని 'ఇస్త్రీ' రేఖలు చెడునేమోయని చేతులు కాళ్ళు చెక్కబొమ్మలవలె ఆడించుచు

వీధులలో వెడలుటకు వెనుదీయము! ప్రాచీనులు స్వతంత్రులు; రసికులు. కావుననే వారు తమకు సొమ్ములపైఁగల ప్రీతిని తమ యిచ్చవచ్చినట్లు ధారాళముగ, నిర్భయముగఁజూపుకొను వారు. మనవలె వారికి మరియొకరికి మొగము చూచి వారికన్న ముందుగా పండ్లిగిలింపవలసిన పనియుండలేదు.

ఆ కాలపువారి వేషరచనలో గంధ పుష్పములు ప్రధానములైనవి. పరదేశమునుండి స్వదేశమునకు సుగంధ ద్రవ్యములు సమృద్ధిగా వచ్చుటకు అనుకూలములు గల్పింపవలయునని రాయల రాజనీతి. (ఆ. ఆ. ౪-౨౪౫) రాచనగరిలో సుగంధముల కొక్క పెద్ద భాండాగారముండెను. కొమరగిరి వేమారెడ్డి కాలమున నా భాండాగారాధ్యక్షుఁడైన యవచి తిప్పయ్యసెట్టి పేరు శ్రీనాథుని పుణ్యమున ఆంధ్రవాఙ్మయమున శాశ్వతముగా నిలిచినది. ఏ పదార్థములకు సుగంధము చేర్పవచ్చునో యాపదార్థములకెల్ల వారు వాసనకట్టియేయనుభవించిరి. వారి యిండ్ల కిటికీలగుండా యెప్పుడును సుగంధ ధూపములు వెడలుచుండెను. తుదకు వీధులలో గంధపునీళ్ళతో కలయంపి చల్లవలెనని వారి పరాయణము. కస్తూరి, పునుఁగు జవ్వాజి, పచ్చకర్పూరము, కుంకుమపూవు, శ్రీగంధము, అగరు, పన్నీరు మొదలగు సహజ సుగంధద్రవ్యములలో వారు మునిఁగి తేలినవారు. కొంత ప్రాఁతపడినను పరిమళము తగ్గునని వానిని వారు స్వీకరింపరు. వరూధిని ప్రవరునికి చూపిన యీ పరిమళవస్తువుల గమగమ లూహించి యానందింపుఁడు;

"సద్యో వినిర్భిన్న సారంగ నాభికా
హృతమై పిసాళించు మృగమదంబు,
కసటువో బీరెండఁ గరఁగి కట్టిల నంటి
గమగమ వలచు చొక్కపు జవాజి,
పొరలెత్తి ఘనసారతరువులఁ దను దాన
తొరఁగిన పచ్చకప్పురపు సిరము,
గొజ్జంగి పూఁబొదల్ గురియంగఁ బటికంపు
దొనల నిండిన యట్టి తుహినజలము,
వివిధ కుసుమ కదంబంబు........."

(మను. ఆ. ౨-౫౫)

ఇవిగాక వీని పరస్పర సమ్మేళనముచే తయారగు కలపములు పలుతెఱఁగుల నుపయోగించుచుండిరి. ఆ కాలమున నీ సుగంధద్రవ్యములను తయారుచేయుటలో ఆంధ్రులు చాలప్రసిద్ధులఁట. వారు 'చెవుల సంకులు, లోవంక భుజంబులు, కొంకిసిగలు, కావిదుప్పట్లు' గలిగి 'గంధకలనాకుసుమ స్రగ్గ్రథనాదుల నాంధ్యంబులే కలరు' చుండిరని రాయలు చెప్పుచున్నాఁడు. (ఆ. ఆ. ४—३५) తరువాత మహమ్మదీయుల రాజ్య కాలమున హిందువు లా విద్యను మఱచిరి కాని మహమ్మదీయులు దాని యందు చక్కని పాండిత్యమును గడించిరి. నేఁటికిని పరిమళ కారక విద్య ఇంచుమించు వారి సొమ్మైయై యున్నది. ముసల్మానులు సామాన్యముగ మనకన్న నెక్కువ రసికులుగా నింకను ఉండుటయే దానికి కారణము. నేఁటి మనపాలికి బ్రహ్మదేవుఁడు సుగంధ వస్తువులనే సృష్టిచేయక యుండినను నష్టములేదు. ముక్కున్న ముక్కిఁడి వారము మనము. మఱియు

మన కిప్పు డా తీక్ష్ణ సుగంధములను ఓర్చుకొను శక్తియు లేదు. కస్తూరి వాసన చూచితిమేని మన కిప్పుడు ముక్కులో నెత్తురు పడును! మనలో నిందుమీఁద నెవరికైనను సుగంధము ఎందుకైనను గావలయునేని పడమటి సీమవారి సారాయికంపుల 'సెంటు' లున్నవి. కాఁబట్టియే అపురూపముగా పెండ్లి పేరంటములలో ఎవరైన అత్తరో పన్నీరో యిచ్చినయెడల, అది దేహము నెక్కడ సోకునో యను భయముచే ముక్కు మైలతో మురుగు చేతిరుమాళ్ళలో వేయించుకొని భద్రముగా మడిచి జేబులలో దాచిపెట్టుదుము! ఒకవేళ నాశపడినను మనమేమి ఒడలిపై స్వతంత్రముగా పూసికొనఁ గలమా? మన దేహములు మన యధీనములా? దర్జీవాని కమ్ముకొన్నవి! వాఁడు మన కష్టదిగ్బంధనముచేసి మన స్వేద పరిమళమును మన దేహము మీఁదనే భద్రముగ రక్షించి పెట్టుచున్నాఁడు.

సుగంధములపై నింత యభిమానముగలవారు కావుననే యాకాలపువారికి పూవులన్న ప్రాణముగా నుండెను. ఇండ్లకు ఉద్యానమొక ముఖ్యాంగమని వెనుకనే చెప్పితిని. అందులో అనేక విధముల పుష్పలతలు దండిగా పెంచుచుండిరి. పూవు లనఁగా నిర్గంధకుసుమములుగావు. కన్నులకు ముక్కునకుఁ గూడ ఆప్యాయనకరములగు పూవులను మన భరతభూమివలెనే ఇతర దేశములు మనకీయఁజాలవు. కావుననే మన ప్రాచీనులు 'వాసనలేని పువ్వు, బుధవర్గములేని పురంబు...' అని పనికిరాని పదార్థములలోఁ జేర్చి తిరస్కరించిరి. పరిమళము లేకున్నను కొన్ని పువ్వులు అందముచే జనుల నాకర్షించును. మనదేశమం

దట్టి పువ్వులలో నుత్తమమైనది, విడువరాని చెలువము గలది తామరపువ్వు. కాఁబట్టి దానిలో లేని పరిమళమును కొండంతలుగా వర్ణించి, మన కవులు తృప్తిపడుదురు! అప్పటి తోఁటలలో పెంపఁబడునవి, వా రెక్కువ ప్రీతితో వాడుచుండినవి. పాదరి, జాజి, విరజాజి, మల్లె, మొల్ల, సంపంగి, మొగలి, చెంగలువ మెదలగునవి. గొజ్జఁగి పువ్వులును, వానినుండి సోనలుగా జాఱు సుగంధజలమును ఆ కాలపు కావ్యములందు పలుమాఱు వర్ణింపఁబడినవి. ఇవి యేపువ్వులో తెలియదు. గులాబిపువ్వు లేయని యొక్కరు వ్రాసిరి. అది నిజమేని గులాబీ పువ్వులనుండి పన్నీరు కాఱుచుండునని యా కాలపు కవులు నమ్మి రనవలసియున్నది. అనఁగా వా రాపువ్వులను చూడకయే వ్రాసినారన్నమాట! ఉండవచ్చును. అది ఉండనిండు. ఇంటి తోఁటల పూవులే కాక పుష్పలావికలు వేలుగా అమ్ముచుండిరి. ఆ కాలపు వారు పూవులను చిత్రవిచిత్రములగు హారములుగాఁ గూర్చి మెడలో ధరించుచుండిరి. ఎత్తులుగట్టి తలలో ముడుచుకొనుచుండిరి. ఇండ్లముందఱ ప్రాతస్సాయంకాలములందు చల్లుచుండిరి. సరములు గట్టి తోరణములుగా వ్రేలార్చుచుండిరి. వస్త్రములు తైలములు మొదలగువానికి వాసన కట్టుచుండిరి. చెండ్లుగాఁ గూర్చి సరస క్రీడ లాడుచుండిరి. విసనకఱ్ఱలుగాఁ గూర్చి వీచుకొనుచుండిరి! తుదకు వేసవిరాత్రులందు గంపల కొలఁది పాన్పుగాఁ బరచుకొని దానిపైఁబరుండి నిద్రించుచుండిరి! మన యిప్పటి స్థితి చూడుఁడు. సుగంధమే యక్కఱలేని వారికి వాసనపూవు లేల ? దొరలసీమలోని పూవులకు

వాసనలేదు. కాని వారు రసికులు గావున వాని వన్నెకు రూపమునకు వలచి పలుకష్టములువడి తోఁటలలో ఇండ్లలో పలువిధములుగా పెంచుకొని చూచి సంతోషింతురు. వారికి దొరకిన సుగంధ పుష్పమంతయు ఒక గులాబీపూవే. దానికి వారెన్నియో దోహదములు చేసి దివ్యకుసుమముగా భావించి పెంచుకొందురు. కనుక మనకును అవే గతియైనవి. పార్కులలో, ఇండ్లముందఱ కుండలలో, మేజాలపైని గ్లాసులలో, ఉత్సవకాలములందు వచ్చిన పెద్దమనుష్యులకిచ్చు చేతి తురాయిలలో, అగ్రాసనాధిపతుల కందిచ్చు పూలటోపీ గంపలలలో — ఎక్కడచూచినను అవే నిర్గంధ కుసుమములే! అపురూపముగా నేఁటితరుణులు దొరలవలెనే కోటు గుండీల సందులో గులాబిపూవు చెక్కుకొనుట కలదు. కాని మఱి యేవాసనగలపూవును కాని అంతమాత్రము మన్నించిన పాపమునఁబోఁగా నేను జూడలేదు. వేయేల? బెంగుళూరు 'లాల్ బాగ్' వంటి తోఁటలో వేలకొలది నెలకు వెచ్చమగుచున్నను, మల్లితీఁగవంటి దొకటి చూతమన్నను లేక యుండుటకు మనవంటి నిర్భాగ్య దామోదరుల యరసికత్వమే కదా కారణము! పోనిండు.

ఆ కాలపువారి అన్నపాన భోగములను వినుఁడు. అమృతము త్రాఁగి ఆఁకలి దప్పులు చంపుకొనియున్న దేవతలకుఁ గూడ 'అప్పటప్పటికిని జిహ్వా త్రుప్పుడుల్ల అమెతలు'— అనఁగా విందుభోజనములు - గావలయునఁట! (మను. ఆ ౨-౧౧) అట్లున్నప్పుడు నిత్యము కనీసము రెండుపూటలు ఆఁకలిదప్పులు గలిగిన యదృష్టవంతులకు, రుచి నెఱుఁగఁగల

రసికులకు, అడుగవలయునా? కాఁబట్టి యప్పటివారికి భుక్తి విషయమై చాలశ్రద్ధ. ఏయేఋతువునందుఏయేతినుబండములు పానీయములు హితమో ఆయా ఋతువుల వాని వానిని తిని త్రాఁగుచుండినవారు వారు. విష్ణుచిత్తునియింటి నిత్య సమారాధనలోని వేసవి భోజనమును వినుఁడు :

'చ. తెలి నులివెచ్చ యోగిరము • తియ్యని చారులుఁ దిమ్మనంబులున్
బలుచని యంబళుల్ చెఱకు • పా లెడనీళ్ళు రసావళుల్ ఫలం
బులును సుగంధి శీతజల • ముల్ వడపిందెలు నీరుఁ జల్లయున్
వెలయఁగ బెట్టు భోజనము • వేసవిఁ జందనచర్చ మున్నుగన్'

(ఆ. ఆ. ౧-౮౧)

రాజ పురోహితుని యింట జరుగుచుండిన యీ క్రింది పానక పూజ మన కీ కాలమున తలఁచుకొన్న 'హా' యనిపించుచు ఉవ్విళ్ళూరించును:

'పరిపక్వ సురభిరంభాఫలంబులతోడ
దళమెక్కు పనస పెన్దొనలతోడ
ఘృతపిండ నిభ కర్కరీ ఖండములతోడఁ
బలు తెరంగుల మావిపండ్లతోడ
గోస్తనీ మృదు గుళుచ్ఛస్తోమములతోడఁ
గప్పులేఱిన వడప్రప్పుతోడ
సుమధుర స్థూల దాడిమ బీజములతోడఁ
దనుపారు రసదాడి గనెలతోడ
పానకం బతిథుల కిడ్డఁ దాను గ్రోలి
యర్చనాదత చందనచర్చఁ దేలి

విరులు సిగఁ దాల్చి కర్పూర వీటిఁ జూరు
కొట్టుచు ద్విజుండు వెన్నెలఁ బిట్టుగాయ.'

(ఆ. ఆ. ౨-౭౩)

ఇవి శాకాహారుల యింటి తిండి తీర్థములు. ఇతరులు దోరమామిడి ముక్కలలో అప్పుడే తడియార్చిన చేఁపలు తరిగి వేసి నువ్వుల నూనె తిరుగఁబోత వేసి తాలింపుచేసి తిందురఁట (ఆ. ఆ. ౨-౬౮) వేసవిలో-ఈ తాలింపు సుఖమును తిని చూచినవారు చెప్పవలయును గాని నేనెఱుఁగను-ఆ చేపఁల కూరను తిన్న కనరు పోవుటకు సంధ్యవేళలందు ఇసుకలో పూడ్చి పెట్టియుండిన చల్లని యెడనీళ్లు త్రాగుచుండిరి. ఇంకను భోగాసక్తులు నారికేళాసవమును ద్రాఁగుచుండిరి. (ఆ. ఆ. ౨-౬౧) ఇతర ఋతువులలో వేఱుమద్యము. మద్యపానము పంచమహాపాతకములలో నొకటిగా భావింపఁబడియున్నను, ధర్మశాస్త్రములు దానికెంత కఠిన శిక్ష విధించినను, మన కవులు మాత్రము దానిని వదలలేక పోయిరి. కవులు వదలలేదనఁగా జనులు వదలలేదనియే యర్థము.

పై ది కొంతవఱకును నాగరకులయిండ్ల భోజనము. అనాగరకులగువారియిండ్లభోజనముత క్కినఋతువులలో నెట్లుండునో యెఱుఁగము గాని వారి వానకాలపు భోజన మిట్లుండునఁట:

'మ. గురుగుం జెంచలి తుమ్మి లేఁదగిరిసా • కుం దింత్రిణీ పల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతో • గట్టావిఁ గుట్టారికో
గిరముల్ మెక్కి, తమింబసుల్ పొలమువోఁ • గ్రేఁపు ల్మెయిన్ నాక, మే
కెరువుం గుంపటి మంచమెక్కిరి ప్రభు • త్వైకాప్తి రెడ్డజడిన్'

(ఆ. ఆ. ౪-౧౩౪)

నాగరకుల భోజనమందు వారి కెంత తృప్తి సంతోష ములు గలవో వీరికి వీరి భోజ్యములందును అంతే కలవు. కారణ మేమనఁగా అది జాత్యన్నము. "అమృతమైనను జవుల జాత్యన్న సమమె?" (ఆ.ఆ.౬-౩౪)యని రాయలు చెప్పెను. త్యాగరాజు "అటుకులరుచి యెద్దులకు తెలియునా" యని యడుగుచున్నాఁడు! (రూ. 'కలినరులకు') అనఁగా పలు మాఱు తిని యనుభవించి వాడుకపడినవారికేఁ దప్పఁ దక్కిన వారికి పదార్థముల రుచి గోచరింపదు. 'అనుభవరసికో విజా నాతి' యను నానుడి సర్వసత్యమైనది. రుచిగూడ మనస్సులో నున్నంత వస్తువులలో లేదు.

ఇంత పానభోజనప్రియు లగువారి కజీర్ణరోగములు రావా యని యడుగవచ్చును. కాని యిట్లడుగుట మన జీర్ణ శకి యింతటిదని వెల్లడించునేకాని వేఱుకాదు. కారణ మేమ నఁగా వారాఁకలికి భుజించువారే కాని మోమోటమునకుఁ గాని పద్ధతి ప్రకారముగాని ఇష్టము లేకున్నను భుజించువారు గారు. పగటిపూట 'అపరాహ్ణమునన్ గాని మఱి శుద్ధకోష్ఠతఁ గాని తమిన్ భుక్తి యెపుడుఁ గనఁ బథ్యమగున్' (ఆ. ఆ. ౪-౨౮౧) అనుట రాయల రాజనీతియందలి రత్నములలో నొక్కటి. ఆహారదోషము ఆరోగ్య నాశనమునకే కాక 'విజ్ఞాన నాశంబునకును మూలంబు' అని వారు గమనించినవారు. (ఆ. ఆ ౪-౧౮౪)మఱియు ఏయే ఋతువులయందే యేతిండి హిత మను విషయమున వారెక్కువ జాగ్రత్తగలిగి యుండిరనిచెప్పి తిని. అన్ని కాలములందును ఒకటే విధముగా అత్యాహార మో

అల్పాహారమో చేసి అజీర్ణరోగములను వరమడిగి తెచ్చుకొన్న వారము మనము. ఆహారమందే కాదు; అన్నిటియందును ఆరోగ్యదృష్టి వారికెక్కువ. శిశువులకు పండ్లు పుట్టువఱకును ఆ కాలపు స్త్రీలు భర్తలను సమీపింపరట! (ఆ. ఆ. ౫-౧౧౬) రాగముయొక్క విలువను శక్తిని హెచ్చించునది త్యాగము. ఇది లేనప్పుడే యది రోగముగా పరిణమించును.

ఆ కాలపువారియజీర్ణాద్యాహార దోషములను నవరించు నిత్యౌషధము తాంబూలము; ఔషధముమాత్రమే కాదు, ఇది హిందువులకు ధర్మశాస్త్రము దయతో ననుగ్రహించిన మత్తు పదార్థముగూడ. బ్రహ్మచారి, వితంతు, సన్న్యాసులు తప్ప తక్కినవా రందఱును దీని నుపయోగింపవచ్చును-వచ్చుననియే కాదు, వలయును గూడ. తాంబూల మనఁగా కేవల మాకు వక్క సున్నములు మాత్రమేకాదు; కర్పూరము, కస్తూరి, ఏల కులు మొదలగు పరిమళద్రవ్యములు లెక్కలేనన్ని యందుఁ జేర్చుచుండిరి. వచ్చినవారికి మర్యాదగా 'కర్పూర తాంబూలము' పెట్టుట యా కాలపుసామాన్యాచారములలో నొకటి. వరూథిని వసించినకోన చేరఁబోవునపుడు ప్రవరునికి వచ్చినదాని తాంబూలపుతావి,ప్రపంచమునమనుచరిత్రయున్నన్ని నాళ్ళును గమగమలాడుచుండును.

'మృగమద సౌరభ విభవ
ద్విగుణిత ఘనసారసాంద్ర వీటీగంధ
స్థగితేతర పరిమళమై
మగువ పొలుపు దెలుపు
నొక్కమారుత మొలసెన్'

(మను. ఆ. ౨-౨౪)

కావుననే యీ మందు భోగముగా పరిణమించినది. నిత్యజీవితము ఇది లేకున్న పూర్తి కానేరదు. దేవుని పూజగూడ తాంబూలము వేసికొని యేచేయవలెనని శాస్త్రమున్నది. 'రమణీ ప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురవిడెము' లేకున్న కవిత్వము సాధ్యముగాదని పెద్దన్న చెప్పెను! ఇట్టి తాంబూలములోని యితర పరిమళద్రవ్యములన్నియుఁ దీసివైచి నేఁడు అనేకులు వానికిబదులుగాపొగాకునుచేర్చుకొన్న వారు! నేఁటివారనఁగా ప్రాఁతపద్ధతికిఁ జేరిన వారనుట. క్రొత్త నాగరక తరుణులలో ననేకులకు తాంబూలము తలదిరిగించునుగదా! కాని పొగాకు పొగ మాత్రము వారికి తిరుగుచున్న తలను నిలుపును.

ఆ కాలపు శయ్యలలో ముఖ్యమగు పూలపాన్పును వెనుకనే చెప్పితినిగదా! రెండవది చిగురాకుల పాన్పు. పూవులకు తరువాత చిగుళ్ళపై ప్రాచీనులకు చాల నభిమానము గలదు. వానిని మంగళద్రవ్యములుగా వారు నిర్ణయించిరి. మూఁడవది హంసతూలికాతల్పము—అనఁగా హంసల యొడలిపై నున్న చిన్నని యీఁకెలను దెచ్చి యీనెలుతీసి ప్రత్తికిబదులుగా నుపయోగించి నించికూర్చిన లేపు. ఇది ధనికులలో సామాన్యముగా నుండెను. ఇందుకై యెన్నిహంసలను జంపవలసియుండెను అనుమాట వేఱు. రసికప్రపంచమున పాపపుణ్యా చర్చకెక్కువ చోటులేదని మొదలే మనవి చేసితిని.

కడపటి భోగమగు స్త్రీని గూర్చి ఆకాలపు రసికులప్రవృత్తిని గమనించుటకు ముందు ఒక మాట చెప్పవలసి యున్నది. అప్పటి దృష్టియంతయు మగవారి దృష్టి. తాము తప్ప

తక్కిన సృష్టియంతయు తమకొఱకె యేర్పడినదనియే వారు తలచినట్లున్నది. వస్త్రాభరణాదుల జతలో స్త్రీని గూడ గణించియుండుట వారి స్వార్థపరతకు ప్రథమోదాహరణము. స్త్రీ పురుషునికి భోగ్యవస్తువైనచో పురుషుఁడు స్త్రీకి ఏల కాఁడను చర్చ వారంటించుకోలేదు. ఆఁడది తండ్రికి ఎవఁడో యొకనికి దానమిచ్చి తొలగించుకొనవలసిన వస్తువు. మగని కామె భరింపవలసిన దాసి. ఆమెయందలి భోగ్యత తక్కువ కాకుండువఱకు అతనికి ప్రేమయో కాకున్న మోహమో యుండును. అది యే కారణము చేఁతగాని తగ్గినా మఱి యొకతెను పెండ్లాడియో 'పెట్టుకొని'యో మొదటియామె నింటిలో వదలి తలుపు తాళములు బిగించును. ఈ స్వాతంత్ర్యము గలవారు గనుకనే ఆ కాలపు మగవారికి స్త్రీని భోగ్యవస్తువుగా తప్ప నంతకన్న నెక్కువగాఁ జూడవలసిన యక్కఱ యంతగాఁ దోఁపలేదు. కావుననే మన కావ్యములలో చిన్న బాలికలను వృద్ధస్త్రీలను వర్ణించిన సన్నివేశము లరుదు. మఱియు స్త్రీలను వర్ణించు సన్నివేశమెట్టిదైనను మనకవుల దృష్టి పడకింటిలో వేచియున్న పెండ్లికొడుకు దృష్టియే కాని వేఱుండదు చూడుఁడు. మనోరమను తినుటకై రాక్షసుఁడు తఱుముకొని వచ్చుచుండఁగా నామె కుయ్యో మొఱ్ఱో!' యని యేడ్చుచు కాళ్ళకొలఁదిఁ బరువెత్తుచు వచ్చినది! ఆ వచ్చు తీవి పెద్దన కెట్లు గాన్పించినదో వినుఁడు :

'శా మట్టెల్ మ్రోయఁగ, గబ్బిచన్నుఁగవ కంపంబంద, వేణీభరం
బట్టిట్టె కటి చిమ్మ చీకటులుగా, నశ్రుప్రజం బోడికల్

గట్టన్, జూపులు చిమ్మరేగి దివి • రోలంబాళిఁ గల్పింపఁగా
మిట్టాడంగ నరుండు లేని యడవిన్ • మీనాక్షి దీనాకృతిన్.'

(మను. ఆ. ౪-౬౮)

ఆయమ యప్పుడు 'భయశోకంబుల, వెక్కుచు మెయిఁ గల విలాస విభ్రమ లక్ష్మల్, దక్కుటయును నొక యొఱపై' యుండెనఁట! (మను. ఆ. ౪-౬౯) స్త్రీలు ఏడ్చినను అదియు నొక సంగీతము! వరూధిని 'కలస్వనంబుతో' ఏడ్చినది. (మను. ఆ. ౨-౩౦) సత్యభామ యింకను గొంతు గింతు బాగుగ సవరించుకొని 'బాలపల్లవ గ్రాస కషాయ కంఠ కలకంఠవధూ కల కాకలిధ్వని'తో నేడ్చినది. (పారి. ఆ. ౧-౧౩౩) 'సంగీతకళా రహస్యనిధి' యగు గిరికాదేవి, వీరికి లోఁగిపోదునా యని 'కిన్నర వధూ రాజత్కరాంభోజ కాంభోజీరాగ విపంచికారవ సుధాపూరంబు తోరంబుగా' ఏడ్పు 'కచ్చేరి' చేసినది!

స్త్రీలయం దిట్టి భోగ్యదృష్టి కలవారు గనుకనే యా కాలపు వారు చేతనైనంతవఱకును బహుపత్నీవ్రతమును పరిపాలించిరి. స్త్రీలహృదయము నాకర్షింపఁ గల్గుట యొక మహాపురుషలక్షణముగా భావించిరి. రాయలవారిని పెద్దన్న తిమ్మన్నలు.

బిసరుహనయనా నవవిధ కుసుమాయుధ !

(మను. ఆ. ౨-౮౦)

విలోకి వధూజన సూనశరాసన !

(వై. ఆ. ౨-౮౧)

ప్రస్ఫృతి విలోచనా కుసుమబాణ !

(పారి ౧-౧౪౦)

అని యాదిగా సంబోధించి ఆఁడవారిని గెల్చుటయు ఆదిల్ ఖానుని గెల్చుటయు నొకే పౌరుషముగా భావించిరి! రాయల వారు శ్రీకాకుళములో ఏకాదశినాఁటి రాత్రి స్వప్నమందు చేసిన శ్రీమహావిష్ణు దర్శనమునకు మఱునాఁడు సభ్యులు నిర్ణయించిన ఫలములలో 'ఇతోధికబహుప్రేయసీ ప్రాప్తి'యు నొకటి. (ఆ. ఆ. ౧-౧౮)

కాని బహుపత్నీ వ్రతమునందును కొన్ని తకరారులు కలవు. ఇచ్చవచ్చినవారిని శాస్త్రోక్తముగా పెండ్లాడుటకు జాతిమత శీలాదులు విఘ్నములు గావచ్చును. కాఁబట్టి యా కాలపువారు—ముఖ్యముగా దొరలు—బహుప్రియావ్రతమునకు దిగిరి. తుదకు విధి లేక యున్నప్పుడు తప్ప వారికి మగవారి సహవాసమే సరిపడదయ్యెను. తమకు జరుగవలసిన యుపచారములన్నియు మగవారికన్న నాఁడవారుచేసినప్పుడే యెక్కువ రుచికరమని తలఁచిరి. తెలుఁగురాయని యీ రసికతయే కన్నడరాయఁడు ఆముక్తమాల్యదను రచించుట కారణము. శ్రీవిష్ణువున కొక కొఱఁత యుండెనట. కృష్ణావతారములో కంసునిసభకు పోవు త్రోవలో సుదాముఁడనుపూలవాఁడొకహారమును అతనికి సమర్పించెను. దానినతఁడుఏవగొన్నను దాక్షిణ్యమునకై గ్రహించెనుగాని, 'మగవానిచేత పూలసరము గొంటినిగదా, నా రసికత యెందుకు తరమైనది?' అను చింత యా యనాదిబ్రహ్మచారికి మానకుండెనఁట! విష్ణుచిత్తుని కూఁతురగు చూడమ్మ తాను ముడుచుకొని తీసిన శేషమాల్యమునే సమర్పింపగా సంతోషముతో గ్రహించిన కథను

రాయలు గ్రంథముగా రచించి ప్రకటించినచో నాయపకీర్తి తప్పునని యాస్వామి యాతనిని వేఁడుకొనెను. ఆ రసిక దేవతకీ రసికభక్తుని సేవయే యాముక్తమాల్యద! కావున నప్పటి రసిక ప్రభువులకు తలంటుట, నీరుపోయుట, తడియొత్తుట, అలంక రించుట, అడపము పట్టుట, పావుకోళ్ళందిచ్చుట, తుదకు ప్రక్కలో కత్తిఁబట్టుకొని నిలఁబడుట - ఇత్యాదులన్నియు స్త్రీలే చేయవలసి వచ్చెను !

కాని యీ రసికులకు వట్టి యాఁడవారైన మాత్ర మునఁ జాలునా ? అందచందములు లేని యష్టావక్రమూర్తులు లభించిన నేమి ఫలము ? వారికన్న మగవారే మేలుగదా ! కావున వారు పరిచారికలనుగూడ చక్కని వారినే వెదకి తెచ్చు కొనుచుండిరి. మనోరమ పెండ్లిలో తండ్రి కూఁతునకు— కూఁతునకిచ్చిన అల్లుని కిచ్చినట్లేకదా—అరణముగా నిచ్చిన పరిచారిక లెట్టివారో వినుడు :

"జవ్వనంపుఁ గ్రొవ్వున నివ్వటిల్లి, మవ్వంపు వాతెఱలు వివ్వ నవ్వు ననుసోఁగ వెన్నెలలం గలసి పిసాళించు చంచల దృగంచల ప్రభలన్ బచారించి, మెఱుంగుఁ జన్నులఁ గన్నె తమ్మి మొగ్గలవన్నె నటమటించి, పెన్నెఱుల మెఱుంగుఁ దుమ్మెదల వన్నెఁ దటమటించి, నెన్నడుముల విన్ను వెన్ను దన్ని, బటువుమిగిలి పిట నికాయంపురాయిడిం బుటపుటనైన కూలంకషచాటువుల మాటకారితనంబు మెఱసి, నాగరికపుఁ బనుల గరిగరికల గళరవచ్ఛ లాలాపాచరణంబుల రచణంబుల మిసమిసలఁ బసగలిగి, మేలిమైన కులుకుల రసికజనంబుల మనం

బుల మరులుకొలుపంజాలి, సురుచిరాభరణభూషితంబగు పరిచారికా సహస్రము" (మను. ఆ. ౫-౧౦౧)

సరేకాని, ఇంతటి యందచందాల జవరాండ్రు సంసారులలో లభించినను, వారు పెండ్లిపేరంటములు చేసికొనుట వదలి, కులశీలములను ధారపోసి, యీ పరిచారికావృత్తికి వత్తురా? బలవంతముగాఁ బట్టి తెచ్చుట సాధ్యమైనను సుఖముండదు. కావున నీ పనులకంతయు వేశ్యలనే నియోగించవలసి వచ్చెను. వారైనచో పై పెద్దన్నగారి వర్ణనము చాలదనిపింపఁగల్గుదురు. కావున రాజాంతఃపురములందును ధనికులయిండ్లయందును పరిచారికలందఱును ప్రాయశః వేశ్యలే. శ్రీరంగనాయకుల పెండ్లిలోఁగూడ నతనికి తలంటుశాస్త్రముచేయుటకు స్వర్గమునుండి యప్సరసలు దిగివచ్చిరి! (ఆ. ఆ. ౭-౫౬) అతఁడు రసికులకు రాజుఁగాడా? క్రమముగా సంఘమందు వేశ్యల ప్రాబల్యము బలసెను. వారులేనిది యే యుత్సవమును రంజింపదయ్యెను. ఏ దేవళమునందును వారి నాట్యసంగీతములు లేనిది భక్తులు సేవకు రారు. విష్ణుచిత్తునివంటి పరమచ్ఛాందసుని మధురనుండి సాఁగనంపుటకు వేశ్యలు; ఊరివారు వానినెదుర్కొని తోడ్కొని వచ్చుటకు వేశ్యలు; (ఆ. ఆ. ౪ ప. ౮-౩౪) ఆ మెరవణిలో పొరుగూళ్ళనుండి వచ్చిన సామంతరాజకుమారులు అందటి యెదుర నా యుత్సవపు వేశ్యలతో సరసాలాడుదురఁట! (ఆ. ఆ. ౪-౩౫)

కాని యిందఱు వేశ్యలాయా యూళ్ళలోనే లభించుట యెట్లు? కాని ఊరిలో "స్టాప్" చాలకున్న అవచి తిప్పయ్య

శెట్టివంటి సుగంధభాండాగారాధ్యక్షు లుందురుగదా. వారు ధనకనక వస్తువాహన మాణిక్యములఁదోడ దొరగారికి, ద్వీపాంతరములనుండియు 'గాణిక్యము'లఁగూడ దెప్పింతురు. (హారవిలాసము, ఆ. ౧ ప. ౨) రాజుగారికున్న నిఁక ప్రజల కేమి తక్కువ? రాయలకాలపు రసికులను వశపఱుచుకొనఁగల యా వేశ్య లెంత యందచందములుగల జాణలై యుండిరో యని కుతూహల పడవచ్చును. సంకోచింపక ఆతనివర్ణనయే వినుఁడు:

'సీ. నవలయధ్వనిగాఁగ సారెప్రేయు నదల్పు
యతినైన గుండెజల్లనఁ గలంప
సుడిసిన మొగ మెత్తి చూడకుండు పరాకు
కుసుమబాణునినైనఁ గువిటుజేయ;
శ్రీకార్యపరులఁగాంచిన లేచి మ్రొక్కు నం
జలికి నింద్రుండు సక్కొలువుగోర
హరి గృహావసర శంఖాకర్ణనకుఁ ద్రిప్పు
కడగంటి జిగి ప్రజఁ గాఁడిపాఱ

తే. గపఱలుంకించి ప్రేయఁ గొప్పవియ నవలి
కరమున నమర్పఁ బైఁటలో మరుని బటువు
విల్లక్రియఁ బట్టఁ గంచెల బిగువుఁ జన్ను
వికృఁ దిన్నెలఁ బాత్రముల్ నెత్తమాడు.'

(ఆ. ఆ ౧. ౫౯)

"పీడెంపుఁ బలుకెంపు విరిసి వెన్నెలగాయ
వరిగింజ నొకట, బల్వారుసఁ దోమ,
నొరసి యొత్తిన మఱుంగొందక మెనెని
గ్గులుదేఱఁ బసుపిడి జలకమాడ,

ముదుక గాకుండఁ బయ్యెదలోనె కేలార్చి
కలయఁ జంటను నొట్టఁగలప మలద,
రతిరయచ్ఛిన్నసూత్రమునఁ జిక్కక ముత్తె
ములు రాల గరగరికలు వహింప,

పొలసిననె యెట్టి నరుసైనఁ గులము దెలియఁ,
బ్రభుత సెడి పల్లవుఁడు పేదవడిన నేద,
నృపతి వెలియంతిపురముగా నెన్న మెలఁగ,
బాసఁ గృతిఁజెప్ప, వలఁతు లప్పద్మముఖులు.

(వై. ౬౦)

ఇదిగాక వీణ వాయింపఁగలరు; ఆడగలరు; పాడఁగలరు. ఈ చాతుర్యము వేశ్యలకే కాక యా కాలపుస్త్రీలకందఱికిని గలదు. చూడికుడుత్తమ్మ వీణతోనే కాక తంబురతోను అది లేకయు పాడఁగలదఁట! (ఆ. ఆ. ౫-౧౫౭) మఱియు రాయలకాలపు వారికి తక్కిన విషయములవలె మగవారి పాటకంటె ఆఁడవారి పాట యందే యెక్కువ రుచి యున్నట్లు కానవచ్చుచున్నది. గంధర్వులు మగవారేయైనను వారిగానకౌశల్య మందందువర్ణింపఁబడినను వారిగుఱ్ఱపుమూతుల పాట కావ్యములలో ఏదో సంప్రదాయ ప్రకారము వర్ణింపఁబడునే కాని దానిని వారుగాని యెవరుగాని విన్నవారు లేరు. ఆముక్తమాల్యదలో మాలదాసరి మంగళకైశికీ రాగమును పాడినది కథ ననుసరించి వచ్చినదిగాని తక్కిన యేచోటను మగవారి గానకౌశల్యము అతఁడుగాని తిమ్మన్నగాని, పెద్దన్నగాని యభిమానము గలిగి వర్ణింపలేదు.

ఆ కాలమువారి రసికత స్త్రీల విషయమున నెట్టిదిగా నుండెననుట కొక్కయుదాహరణము చాలును. వారికంటె ప్రాచీనులు తమ ప్రియురాండ్రు కోపగించుకొన్న యెడల వారి నోదార్చుటకు కాళ్ళకు మ్రొక్కి క్షమాపణ వేడుట కట్ట కడపటి యుపాయముగాఁ దలఁచియుండిరి. అక్కడికిని వారు కోపము వదలనియెడల నిరువురికిని విరుగడ గావలసినదే. ఒక చెలికత్తె కోపించుచున్న జవరాలి కిట్లు బోధించెను :

"ఆ. చెడుగుదాన ! కాళ్ళఁబడినాఁడు నీపతి
నింకనైన లేవనెత్తవేల ?
వలపు లెంత గట్టివాఱినవయ్యును
ఇదియె వినుము వానికెల్ల మేర !"

(శాలివాహన గాథాసప్తశతి ౪-౯౦)

[నాచే నాంధ్రీకృతము]

కాని రాయలకాలపు రసికులు తమ ప్రియురాండ్రు ఎడమ కాలితో తల దన్నినను 'కాలునొచ్చెనే!' యని బుజ్జగింపవలసినదే కాని కోపించి వదలిపోరాదని తలఁచిరి. సత్యభామ శ్రీకృష్ణున కీ మర్యాదయే చేయఁగా అతఁడు పదియాఱు వేల చిల్లర మగువలకు మగఁడయ్యును ఆమెతో నిరసించి లేచిపోకయలుక దీర్చెను! ఈ రసిక ధర్మరహస్యమును రాయలవారికి నేర్పవలసిన యక్కఱ యొకమాఱు సంభవింపఁగా తిమ్మకవి యందుకై పారిజాతాపహరణమును వ్రాసి చదివి నేర్పెనను ఐతిహ్యము మీ రెఱుఁగుదురు.

పై వేశ్యలు చాలక ఆకాలపు రసికుల శృంగార తృష్ణను పూవులమ్ము పొలఁతులును, చలి పందిళ్ళలోని చెలువలును అనుషంగికముగాఁ దీర్చుచుండిరి. వ్యాపారమునకు ధర్మ కార్యమునకును ఆఁడవారినేయ పేక్షించుట ఆకాలపువారిమనో ధర్మమును గొంత విశదపఱుపఁగలదు. కాని పూవులమ్ము వ్యాపారముమాత్రము ప్రాచీనులు స్త్రీల కిచ్చిరి. ఇందులోఁ గొంత యానురూప్యముఁ గలదు; రెండును సుకుమార వస్తువులు గావున. కాని యిప్పటి పాశ్చాత్త్య వ్యాపారులు అన్నియంగళ్ళయందును ఆఁడవారినే నియోగించి మనుష్యులకు సహజమగు పశుబుద్ధిని లాభసంపాదనకై వినియోగించుకొనుచున్నారు! కథానాయికల పాతివ్రత్యమునే పొగడిపొగడి విసిగిన మన కవులకు పై పుష్పలావికలవంటివారు దొరకుట పండుగ వచ్చినట్లు!

రాయలకాలపువారి యీ భోగతృష్ణను మనదానితోఁ బోల్చుకొనిచూచిన మనము వారికన్న నెంతో మేలుగానున్నామనిపించును. బహుపత్నీకత్వమును మనము చాలవఱకు వదలితిమి. మనలో వేశ్యలగుంపు తగ్గుచున్నది. స్త్రీదాస్యము క్రమముగా క్షీణించుచున్నది. వారి యింద్రియలోలత మనకు లేదు. ఇందు కొక ముఖ్యకారణము, స్త్రీయనఁగా కేవల భోగవస్తువే యని యిదివఱకును మనకుండినభావము పాశ్చాత్త్య పండితుల సంసర్గముచే నశించుచుండుటయే. వారికిని మనవలె మానమర్యాదలును సుఖదుఃఖములును గలవనుట పూర్వకాలము వారికన్న నేఁడు మనవా రెక్కువగ గమనించుచున్నారు. ఇది

యొక శ్లాఘ్యవిషయమే. కాని దీనికిఁదోడు మన యశక్తవై రాగ్యముగూడ నొక గొప్పహేతువని చెప్పక తప్పదు. మనకు రాఁగరాఁగ రసికత్వమూలమగుసత్త్వబలము క్షీణించుచున్నదని వెనుకనే చెప్పితిని. అదియే యిప్పటి మనవారియందు-ముఖ్యముగా తరుణులందు-శృంగారరసవైముఖ్యము, సిగ్గు, అవమానము, అదేదో యొక యసహ్యమగు దోష మనుభావము, వ్యాపించుచుండుటకుప్రధాన హేతువనిచెప్పకతప్పదు.మఱియు స్వాతంత్ర్యముగలిగి తమ ధర్మాధర్మములను న్యాయాన్యాయములను తామే నిర్ణయించుకొనఁగల భాగ్యవంతులగు ధీరుల జాతిలో కామ మొక పురుషార్థమై ధర్మార్థమోక్షములతో సమానముగా పరిగణింపఁబడునే కాని తలవంచుకోవలసిన తప్పుగా నెంచబడదు. అందులో దోషమే లేదని నేను జెప్పరాలేదు. కాని యెందులో లేదు? ఉపయోగించువారి శక్తి కొలఁది, వివేకముకొలఁది, అన్నియు గుణములుగానో దోషములుగానో పరిణమించును. తప్పుదారి కీడ్చునేమోయని సత్త్వ గుణమునే వదలుట యజీర్ణము గావచ్చునని యాహారమునే వదలినట్లు.

వదలుటయంటిని : అందుకు మాత్రము మనకు సత్త్వ మెక్కడిది? ఆ పనియు బలవంతముగా మనచేత నింకొకఁడు చేయింపవలయును గాని మనకే వదలుకొను శక్తియుండెనేని దానిని గట్టుకొనియే యుండియుందుము. ఆ రెంటిలోను సమర్థు లాకాలపు వారే. ప్రవృత్తిలో రసము లేదని తోఁచిన వెంటనే వారు నివృత్తి మార్గమునకుఁ దిరిగి తమ రసికత్వ

మక్కడఁ బ్రకటింతురు. మత్స్యధ్వజ మహారాజు యెంతో యాత్రముతో సర్వాలంకార భూషితుఁడై యొక రాత్రి భోగిని యింటికిఁ బోవుచుండెను. దారిలో పురోహితు నింట పై జెప్పిన సమారాధనలో పొట్టపగుల భుజించిన బ్రాహ్మణుఁ డొక్కడు, తనతోడి యతిథులతో వారి యింటియరుఁగుమీదనే పరుండి, యుబుసుపోకకై పలువిధములగు పద్యములు చెప్పు కొనుచు అనుషంగికముగా,

'వర్షార్ధ మష్టౌ ప్రయతేత మాసాన్
నిశార్ధమర్ధం దివసే యతేత
వార్ధక్యహేతో ర్వయసా నవేన
పరత్ర హేతో రిహ జన్మనా చ'

(వర్షాకాలమందలి సుఖమునకై తక్కిన ఎనిమిది నెలలు పాటు పడవలయును. ఇట్లే రాత్రికై పగలును, ముసలితనమునకై ప్రాయమందును, పరలోకమునకై యీ లోకమందును పాటు పడవలెను.)

అను పద్యమును జదివెను. దానిని విన్న వెంటనే యా రాజు 'అయ్యో! మోసపోతినే' యని రాజ్యము వైభవము మొద లగు నన్నిటియందును నిస్సంగుఁడై మోక్షమును సాధింపఁ బ్రయత్నించెను. కాని యే దేవుని నాశ్రయించిన మోక్షము లభించునో పాప మతని కేమి తెలియును? కాఁబట్టి మరు నాఁడే శాస్త్రములన్నియు చదివి యగ్రహారము లనుభవించు చున్న పండితులను రావించి, ముక్తి యిచ్చు దేవత యేదియో

చర్చించి నిశ్చయింపుడని యాజ్ఞ చేసెను. అట్లు వాదించి గెలిచి తత్వనిర్ణయము చేసినవారి కిది బహుమానమని బీరపూవులవంటి బంగారు నాణెముల సంచిని ఆస్థాన స్తంభమున అందఱు చూచు నట్లు వ్రేలాడఁ గట్టించెను. వారినందఱిని గెలిచి విష్ణుచిత్తుఁడు విష్ణు సర్వోత్తమత్వమును స్థాపించి యా రాజు కామతమును బోధించెనఁట ! అది యట్లుండనిండు. ఇంతటి యభినివేశము, పట్టుదల అరసికులకు సాధ్యమా ?

చాలనందుకు ఇట్టి యాకస్మికమగు మార్పు స్వాభావికమే కాదని యిప్పటి మనవారి వాదము. ఈ మాట మన స్వభావమునందలి సత్త్వదారిద్ర్యమునే వెల్లడించునుగాని వేఱు గాదు. కోపము వచ్చినవాని చేతికత్తి యెంతపని చేయఁగల దనుట మొండిచేతివాని కెట్లు తెలియును ? ఈ కాలమందే ముప్పదేండ్ల నిండుప్రాయమున, ప్యారిస్, లండన్ వంటి పట్టణములందు, సర్వసంపత్తులతో తులఁదూగుచు, స్వేచ్ఛాభోగము లనుభవించుచుండిన మిస్. ఎమ్. స్లేడ్ అను పాశ్చాత్యకన్య ఉన్నదున్నట్లుగా ఒకనాఁటి రాత్రి గాంధి మహాత్ముని జీవిత చరిత్రమును చదివిన వెంటనే అన్ని భోగములందును జిహాసఁ జెందుట, మఱునాడే నీ యాశ్రమమున శిష్యురాలిఁగా నన్నుఁ జేర్చుకొమ్మని యతనిఁ బ్రార్థించుట, అతని యనుమతిచే దేశము, కోశము అన్నియు వదలి యీ దేశమునకు వచ్చుట, అతని యాశ్రమమున ఆజీవమానము త్రికరణశుద్ధిగా బ్రహ్మచర్య మాచరింప వ్రతముఁబూని తపస్వినిగా నుండుట-మీరంద

తెలుఁగుదురు! రసికులై సత్త్వవంతులగు పాశ్చాత్యజాతిలో పుట్టియున్నందువలననే యామెయెడనిట్టి దృఢమై యాకస్మిక మైన మార్పుగలిగినది. మత్స్యధ్వజుని వైరాగ్యము నట్టిదే. యామునాచార్యుని కథ విన్నవించితిని గదా.

ఈ గ్రంథములందు వర్ణింపబడిన విరక్తులందఱికిని తలమానికమువంటివాఁడు ప్రవరుఁడు. ఏకాలమందైనను ఎవరైనను వానిపేరు చెప్పి వైరాగ్యము మాటలాడవలయును. ఏకాంతమున, వరూధినివంటి తిమిరంపు వయసుగల యచ్చరకొమరాలు తానై వలచివచ్చి,

'ప్రాంచద్భూషణ బాహుమూలరుచితోఁ
బాలిండ్లు పొంగారఁ బైయంచుల్ మోవఁగఁ
గౌఁగిలించి యధరంబానింప'

తాను, 'మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి,' సంసార సుఖమెఱిఁగిన 'కసుగందనిమేను' గల వయసువాఁడు, చదువుకొన్న విదగ్ధుఁడు, ఇంచుకయైనను ధైర్యము చలింపక, అసహ్యముతో 'హా! శ్రీహరీ!' యని దాని భుజములు పట్టి త్రోచి, అది చాలక, తన మేని కెక్కడనో యంటుకొన్న దాని యొడలి జవ్వాజిని కడిగివేసుకొను వఱకును మనసు నిలుపుకొనఁడాయెను! వైరాగ్య మింతకు మించినది మనుష్యుఁ డూహింపఁగల్గునా? ఈ యొక్కని నడఁతయే రాయల కాలమందలి విరక్తి రసికులపరాయణమెట్టిదని డంగోరా వేసి చాటుచున్నది!

అనఁగా ఆ కాలమువారు కేవలస్వార్థపరులైన భోగులో యోగులో మాత్రమై యుండిరని కాదు. వారి దృఢ మనో బలమును కార్యసాధన శక్తియు నిట్టిదని యూహించుటకు పై రెండు ప్రవృత్తి నివృత్తి విషయములు మాత్రము గ్రహించితిని. వారు యుద్ధములను జేసిరి; రాజ్యములను గెలిచిరి; దేశమును సురక్షితముగా ఏలిరి; చెఱువులు కాలువలు త్రవ్వించిరి; స్వప్నమందును ఊహింపరాని శిల్పములను సృజించిరి: చదువు సంధ్యల నభివృద్ధి పఱచిరి; చేతికొలఁది దానములిచ్చిరి. కాని వానినెల్ల వివరించుటకు నాకు శక్తిగాని, మీకవకాశముగాని యిక్కడ చాలదు.

కడపటిమాట యొకటిచెప్పి ముగించెదను. ఏ పనికి చేయి వేసినను ఆ కాలపువారు సాధించిన సిద్ధులు చాల గొప్పవి; రసికజీవనపు ఫల మది. వారికి భోగతృష్ణ యెట్లో యట్లే దయ, శౌర్యము, ఔదార్యము, పాండిత్యము, వైరాగ్యము అన్నియును గొప్పవే. అల్పత్వమునకు రసికుల బ్రతుకులో చోటులేదు. అందు మంచిదానివలె చెడ్డదియు గొప్పగా నుండవచ్చును; ఉండును. పెద్దవ్యాపారములో లాభనష్టములు రెండు పెద్దగా నుండును. గుగ్గిళ్ళసెట్లకు రెండును స్వల్పములే. మఱియు లాభమును గమనింపక నష్టమునకు మాత్రము వెఱచి వ్యాపారము వదలఁజూచుట వెఱ్ఱి. శ్రీరామునివంటి యవతార పురుషుఁడున్న కాలములో ప్రక్కలో పదితలల రావణుఁడున్నను ఓర్చుకొనవచ్చును. ఓర్వవలయునుగూడ. ఎందుకనగా రాముఁడులేనిరావణుఁడుగాని, రావణుఁడులేనిరాముఁడుగాని

యే కాలమందును గలుగుట యరుదు. ఆ యిరువురును వీరు వాలలోని వ్రేలెడంత బొమ్మలై యుండుటకంటె ప్రాణము గల పెద్ద వ్యక్తులై యుండుట మేలుగదా! జనులలో రసికత పెరిఁగినకొలఁది సదసత్తులు పెరుఁగును. తరిగినఁదరుగును. కావున నెన్ని దోషములున్నను రసికత్వము తిరస్కరింపఁ దగినది కాదు. అది నాగరికతకు నిదానము; పౌరుషమునకు ఫలము; అభ్యుదయమున కాధారము!

# కళాపూర్ణోదయము

—కీ. శే. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి

కళాపూర్ణోదయము రచించినమహాకవి పింగళిసూరన్న. ఇతడు శ్రీకృష్ణదేవరాయల కాలమునకుఁ దరువాతి వాఁడు; ప్రాయశః రామరాజ భూషణ కవికిఁ బూర్వుఁడు; మఱియు నింగ్లాండు దేశములోని కవులలో నగ్రగణ్యుండైన షేక్స్పియరునకు సమకాలికుఁడై యునికియు సుసాధ్యమే.

ఆ కాలమున నాంధ్రదేశమునఁ బ్రబలముగానుండిన కవితారీతి, ప్రబంధరచన, ప్రబంధకవులకు మధ్యకవులనియుఁ బేరుగలదు.

పింగళి సూరనార్యుఁడు మధ్యకవులకుఁ జేరినవాఁడు గావునఁ బ్రాచీనగ్రంథములను,ముఖ్యముగా భారతమును,బహు శ్రద్ధతోను, భక్తితోను బఠించియుండును. ఇందుల కమ్మహాతి హాసములోని గుంభనల జ్ఞప్తికిఁ దేఁజాలినంత సాదృశ్యముగల రచనలఁ దాఁ జేసియుంట యొక సాక్ష్యము. చూడుఁడు:. -*

కణ్వాశ్రమ వర్ణనావసరమున నాదిపర్వములోని:.

"సీ. శ్రవణ సుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువుదగిలి
కదలక వినుచుండు కరులును గరికర
కల చ్ఛాయఁ దచ్చీకరాంబు

*నా కవిత్వ తత్త్వ విచారమునందలి ముఖ్యాంశములు మాత్ర మిందు వ్రాయఁబడినవి. విపులముగా నందుఁ జూడఁదగును.

కణముల చల్లని గాడ్పానడి వానిఁ
జెంది సుఖంబున్న సింహములును
భూసుర ప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టు నీవారాన్న పిండతతులు
తే. గడఁగి భక్షింప నొక్కటఁ గలసి యాడు
చున్న యెలుకలుఁ బిల్లులు నొందు సహజ
వైరి వర్గంబులయు సహవాస మపుడు
చూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమంది."

అను పద్యమునుజూచి మణికంధరుని తపోవనము వర్ణించుచుఁ బింగళి సూరన్న వైరీతి ననుకరింపఁ జూచియు యమకమునకై స్వారస్యముఁ జెడగొట్టుకొన్నాఁడు.

"సీ. ఆవులునాఁకఁ గన్నరమోడ్చు పులులును
బులుల చన్గుడువంగ బోవు లేళ్ళు
లేళ్ళ చెర్లాట రంజిల్లెడు హరులును
హరులు గోళ్ళను గోఁక నలరు కరులు
కరుల కటాళి వైరి నాడు పాములు
పాముల లాలించు బభ్రుతతులు
బభ్రుతతులప్రక్కఁ బాయని యెలుకలు
నెలుకలఁ బెంచు పిల్లులును గలిగి..."

భీష్మాటోపమును వర్ణించుచున్న భారతములోని కొన్ని వచనముల ననుసరించి కళాపూర్ణోదయములో నష్టమాశ్వాసము నందలి "ఇత్తెఱంగున నప్పార్థివోత్తముఁడు" ఇత్యాది దీర్ఘవచనములు వ్రాయఁబడి యున్నట్లు దోఁచెడిని. మఱియు "సూరనార్యుఁడు కొన్ని యెడల నన్నెచోడుని ననుకరించి యున్నాఁ

డని" (శ్రీ) మానవల్లి రామకృష్ణ కవిగారు వ్రాసియున్నారు; కాని, సందర్భము లభిన్నముగ నుండుచోట్ల భాషయుఁ గొంత సాదృశ్యముఁ దాల్చుట యప్రకృతము గాదు. కావునఁ బోలి కలఁ బట్టి చౌర్యము నొడిగట్టుట తగదు.

ఇట్లు మన సూరన యుత్కృష్టులైన గ్రంథకర్తల జాడల నెఱిఁగినవాఁడయ్యుఁ గొంతవఱకు నంత మంచివి కాని మార్గ ముల నవలంబించియున్నాఁడు. దీనికిఁ గారణము సమ కాలికుల మెప్పింపఁ జూచుట. మఱియు మన కవి మిగుల బీదవాఁడు కాఁబోలు; కుటుంబరక్షణార్థము ద్రవ్యార్జనకై యత్నించుట దోషము కాదుకదా! ఆ కాలమున నిప్పటియట్లు ప్రజలు పుస్త కములు గొనుటచే నాదాయము గడించి జీవింపఁ జూచుటకు వీలు శుద్ధముగ లేమింజేసి యతఁడు రాజుల నాశ్రయింపవలసిన విధికి లోఁగిన వాఁడాయెను. ఇఁక నా రాజుల యిష్టానుసారము వ్రాయక యేమి చేయును? పరిపాలన కార్యమునఁ దగిలి కాలముగడుపు రాజులు స్వబుద్ధితో విమర్శింపఁ జాలినంత పండితులగుట యరిది గావున నట్టివా రాచారముం బట్టి గుణ దోష నిర్ణయముఁ జేయుట నైజము. సూరన కాలమునఁ బ్రాచు ర్యమునకు వచ్చిన కవితారీతి ప్రబంధరచన. కావునఁ దానును బ్రబంధధోరణినే వ్రాయవలసినవాఁ డయ్యెను. ఐనను భావ గంభీరుఁడును వివేకవంతుఁడు నగుటఁ బట్టి పూర్తిగఁ బ్రబంధ కూపంబునఁ బడలేదు. రాజుల యిష్టమునకుఁ దన యిష్టము నకును నడుమ నిలిచి కవితాస్వర్గమునఁ ద్రిశంకుస్థితిం దాల్చి యున్నాఁడు. తనకు శరణ్యులైన ప్రభువుల చిత్తవృత్తి ననుస

రించువాఁ డనుటకుఁ గళాపూర్ణోదయమునుండియే యొక యుదాహరణముఁ జూపవచ్చును. చూడుఁడు :—కృతికర్త కైవుఁడు; ఇందు కితఁడు దారపుత్రాదిబాధలేని యౌవనకాలములో వ్రాసినదని యూహింపఁ దగిన రాఘవపాండవీయమున నితనిని చినవేంకటాద్రి "లలాటేక్షణ భక్తశీల" యని సంబోధించుటయేసాక్షి. ఇఁక కళాపూర్ణోదయ భర్తలైన నంద్యాలవారన్ననో వైష్ణవము కొంత ముదిరిన మహానీయులు అందును గృతిపతియగు కృష్ణమహీపాలుఁడు వైష్ణవమతశీలుఁడు. తిరుమల తాతాచార్యవంశీయుఁడగు శ్రీనివాసగురువు శిష్యుఁడు. కావుటం బట్టియే రాఘవపాండవీయ ప్రభావతీప్రద్యుమ్నములలో శివస్తుతితోఁ గావ్యారంభముఁ జేసిన భక్తుఁడు కళాపూర్ణోదయమున విష్ణువునకు నగ్రార్చనం జేసెను. తుదకు వైష్ణవమత ప్రధానతత్త్వమును బోధించు 'లక్ష్మీనారాయణ సంవాదము'చేఁ బ్రబంధమును ముగించెను! పాపము! దారిద్ర్యముచేఁ గుందింపఁబడనివాఁ డెవఁడు? ఇట్లు యౌవనమున స్వాతంత్ర్య మవలంబించి యున్నను మధ్యకాలమున దారపుత్రాది పోషణమునకు వీలులేక చాలకాలము పారతంత్ర్యప్రవృత్తుఁడై యుండి విసివినవాఁడవుటఁ గాఁబోలు వార్ధకమునందుఁ బ్రభావతీప్రద్యుమ్నమునందు స్వాతంత్ర్య మవలంబించుటయ కాదు, గంభీరముగ నిట్లు వాక్రుచ్చుటయు :—

"మ. జనముల్మెచ్చగ మున్రచించితి నుదంచద్వైఖరిం గారుడం
బును, శ్రీ రాఘవపాండవీయముఁ గళాపూర్ణోదయంబున్ మఱిన్
దెనుఁగుం గబ్బము లెన్నియేనియును మత్పిత్రాది వంశాభివ
ర్ణన లేమిం బరితుష్టి నా కవి యొనర్పం జాలవత్యంతమున్."

ఈ పద్యముఁ జదువునపుడు కవి యాదిని బడినపాట్లకు దుఃఖమును, తుదకు నిరంకుశక్రీడకుఁ జొచ్చెఁగదా యని సంత సమును బొందకమానము. ఈధైర్యమహిమచే నితఁడు సర్వ జనశ్లాఘనీయుఁడు.

కళాపూర్ణోదయ మాంధ్రమున నద్వితీయమైనగ్రంథము. భారత మనుచరిత్రాది గ్రంథములవలెఁ బరివర్తనము గాని, ప్రాచీనకథామూలకము గాని కాదు; కవియొక్క స్వసృష్టి. ప్రబంధకవు లెవ్వరియందును గనఁబడని ప్రతిభయు, భావనాశక్తియు, సందర్భశుద్ధియుఁ, బాత్రోచిత పద్యరచనయు నిందు సుప్రసిద్ధములు ఐనను గాలదోషముతప్పించుకొనరానిదగుటచేఁ బ్రబంధకవులయందలి స్ఖాలిత్యము లిందును బెక్కులు గలవు; కాని దోషములకంటె గుణము లెన్నియో మడుంగు లెక్కువ. సూరన రచించినగ్రంథములలోనెల్ల నిది యుత్తమోత్తమము. ఐనను రాఘవపాండవీయమును బ్రశంసించినంత సూరన దీనిని బ్రశంసింపకపోవుటచేఁ గళాపూర్ణోదయముకంటె రాఘవపాండవీయమే ప్రశస్తమని తలఁచెనేమోయని సందేహింప వలసి యున్నది. కాని రాఘవపాండవీయ రచనానంతరము శ్లేష నంతగా వాడక చాలించుటం జూడ దానియం దితనికి శక్తి యున్నంత రక్తిలేదని మన మూహించుట యుక్తము.

ఈ కావ్యము యొక్క గుణదోషములు రెండింటికి నాస్పదమైనది, సూరనార్యుఁడు ప్రారంభమునఁ జేసికొన్న ప్రతిజ్ఞయ. చూడుఁడు :- "సకల లక్షణ లక్షితంబైన మహా ప్రబంధంబు కీర్తికారణం"బని తలఁచి "అపూర్వకథా సంవి

ధానవై చిత్రీ మహనీయంబును, శృంగార రసప్రాయంబును, బుణ్యావసు వర్ణనాకర్ణనంబును నగు కళాపూర్ణోదయంబను మహాకావ్యంబు" రచింపఁ గడంగెను. కవియొక్క యుద్దేశమే యీ గ్రంథ మిన్నిలక్షణములు గల్గియుండ వలెనని. కవి తన యభిమతము నెఱవేర్చి కొన్నాఁడు గాని, యిట్టిపంతముఁ బట్టి వ్రాసినందున నిష్కళంకమైన కృతి యేర్పడినదా యనుట సందేహము. కథయుఁ బ్రకృతియందలి వస్తువులవలెఁ దనంతఁ దనయందలి సత్త్వముం బట్టి పుట్టి పెరుగు గుణము గలది. దానిని సాజముగఁ బెరుగనిచ్చి యప్పుడప్పుడు సవరించుచు సంస్కరించుచు దోహదము చేయుచు వచ్చిన మేలా? మొదటి నుండియే యీ యీ రసములు తప్పక యీఁగల దానిని గల్పించెదనని సంకల్పించుకొని పిమ్మట దానియుత్పత్తిఁ జేయ జూచుట మేలా? యోజింపుఁడు.

సూరనార్యున కీయుద్యమముచేగలిగిన మేలుగీడులెవ్వి యన: అపూర్వ కథాసంవిధానముం బూనుటచే నుపజ్ఞకును భావనాశక్తికిని మంచిప్రవేశము దొరకినది.కళాపూర్ణోదయము సామాన్య ప్రబంధములకంటె నెక్కువ రసవంతముగానుండుట కిది.యొక కారణము. మఱి భారతమంతసరసముగానిదగుటకు మూల మేదనగాఁ సర్వలక్షణములును బలాత్కారముననైనఁ దెచ్చి రాశి వేయవలయునని సమయముఁ జేసికొన్నవాఁడగు టచేఁ గథను సహజముగఁ బక్వతకు రానియ్యక యచ్చటచ్చట నూదర వేసియుండుట. అయిననొక్కటి, ప్రబంధములలోఁగథ కంటికిఁగానరానంత క్షీణత్వముఁ జెందియుండును. ఈ లోప

మును జాలమట్టుకుఁ బూరించి యీ కావ్యములోని కథను బుష్టికిఁ దెచ్చిన తంత్రములలో సకల లక్షణసంపన్నతా సమయము ప్రముఖము. ప్రబంధములలో శృంగార మనఁబడు నొక రసము తక్కఁ దక్కినరసములు సామాన్యముగ మృగ్యములు. మన సూరన కవి కళాపూర్ణోదయమున నన్ని రసములకును స్థాన మేర్పఱచుకోరికగల వాఁడగుటచే వానికన్నింటికిని జోటుదొర కునంత విశాలమగు కథను గల్పింపవలసినవాఁడయ్యె. కావున నిందు కథ తుచ్ఛము గాదు; మఱి మిక్కిలి ప్రబలము; అయిన నొకదురదృష్టము. ఒకే కథలో నన్నిరసములు నిముడ్పవలయు నన్న నా కథను దాఱుమాఱుగ నీడ్వనిది గాదు. అనఁగా నసంగతములైన యంగములఁ దెచ్చిపెట్టి సారస్యము నక్క డక్కడఁ జెడఁగొట్టి కథకు వికారము గల్పించినాఁడని నా మనవి. అయినను ఈ సంకల్పము లేకున్నఁ గళాపూర్ణోదయము సామాన్య ప్రబంధములలోఁ జేరిన గ్రంథముగా నుండియుండు నేమో ? కావున నాదుర్గతికిఁ దప్పించినమంత్రము నింద్య మనరాదు.

కల్పనాసామర్థ్యమీకవికిఁబలె నాంధ్రులలో మఱెవ్వరికిఁ గానము. తిక్కనాదుల కుండవచ్చునేమో ? సూరనయందుఁ బ్రబంధ కవులకుం గల వర్ణనాశక్తితోడ వారికి లేని కథాకల్పనా శక్తియు, వివిధములైనసందర్భములను సంధానమునకుం దెచ్చు ప్రతిభయు, సహవాసములు; మఱియు భావనాశక్తికిఁ దోడు భాషాసక్తియు నీతనికి గలదు. కవితా స్వరూపమును బ్రభావ మును వర్ణించుచు వ్రాసిన యీ పద్య మిందులకు నిదర్శనము.

లయవిభాతి :—

చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము
గలిగినను సౌరభము చలువయుఁ దలిర్పం
బొలుపెసఁగు కప్పురపుఁ బలుకులకుఁ గోమలత
నెలకొనిన సౌరభముఁ జలువపసయుం గో
మలతయును గలిగి జగముల మిగులఁ బెంపెసఁగు
మలయ పవనంపుఁ గొదమలకు మధురత్వం
బలవడిన నీడుమఱి కలదనఁగ వచ్చుఁగడు
వెలయఁగల యీ సుకవి పలుకులకు నెంచన్.

(ఆ. ౧. ప. ౮౩

భావము శైలినిమించినదా ? శైలి భావమును మించి నదాయని వెఱఁగొనరించు నగ్రగణ్య పద్యములలో నిది యొకటి! మఱియు సూరన, తనసమకాలికుఁడైన షేక్స్పి యరువలె, నందందు శైలింగూర్చిన విచారములను దనకును గథకును భంగము రానిమాడ్కిఁ బాత్రముల చాటునఁ జేసి యున్నాఁడు. బయటఁ బడక యు తన కృతిని దానే విమర్శించి యున్నాఁడనుట. దృష్టాంతము మణికంధరుఁడు చేసిన దండక రూపమగు కృష్ణస్తవముం గూర్చి కలభాషిణి ప్రశంసించిన తెఱంగు .—

సీ. పొసఁగ ముత్తెపుసరుల్ పోహళించినలీలఁ
దమలోన దొరయు శబ్దములఁ గూరి
యర్థంబు వాచ్యలక్ష్య వ్యంగ్య భేదంబు
లెఱిఁగి నిర్దోషత నెసఁగ జేసి

రసభావములకు నర్హంబుగ వైదర్భి
మొదలైన రీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు
ప్రాణంబు లిమ్ముగాఁ బాదుకొల్పి
తే. యమర నుపమాదులును యమకాదులు నగు
నట్టి యర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చు సత్కవివరునకు
వాంఛితార్థంబు లొసఁగనివారు గలరె?

(ఆ. ౧. ప. ౮౧)

ప్రభావతీ ప్రద్యుమ్నము నందును ఇట్టి దొకటి గలదు. కాని కథలో నీపద్యమున కున్నంత కలయిక దానికి లేదు. ఇంద్రుఁడు శుచిముఖిని గొనియాడుచు నాడిన పద్యము:—

"సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగ నీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదల
దలఁపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తిదోషంబుపొంతఁ బోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖాచంక్రమక్రియఁ గడవ జనక
ప్రకృతార్థ భావంబు పాదుకొనదుకుచు
నుపపత్తి యెందు నత్యూర్జితముగ
తే. నొకటఁ బూర్వోత్తరవిరోధ మొందకుండఁ
దత్తదవయవ వాక్యతాత్పర్యభేద
ములు మహావాక్యతాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చుట బహుతపఃఫలముగాదె."

(ప్రభా. ఆ. ౨. ప. ౩)

ఈ రెండుపద్యములం బోల్చి చూచితిమేని, రెండవ పద్యము రచించులోపలఁ గవి కొంతమట్టుకు శైలిం గూర్చిన యభిప్రాయము మార్చికొనిననాఁ డనియుఁ జెప్పుట కవకాశ మయ్యెడి. కళాపూర్ణోదయ పద్యముం బట్టి చూచినఁ గవి యర్థాలంకారములు మాత్రమే కాక శబ్దాలంకారములును అవశ్యానుష్ఠేయములని భావించినట్లు కనఁబడియెడి. రెండవ పద్యములోనే యలంకారములను ధ్యానింపలేదు. భావములు, అర్థములు, అవయవసంయోగము మొదలగు తలఁపులతోఁ జేరిన గుణముల మీఁద నేకాగ్రమగు దృష్టిని నిలుపుట యుత్తమమని యెంచెనేమో! కావుననే ప్రభావతీప్రద్యుమ్నమునఁ జిత్రకవిత్వమించుమించు శూన్యము. కళాపూర్ణోదయమునఁ గొంత యధికమే. ప్రభావతీప్రద్యుమ్నము రచనా విషయమునఁ గళాపూర్ణోదయముకంటె మిన్న కాని, భావనాశక్తి కొఱవడినది. కవి వయసు ముదిరినవాఁడై నందున రాగములు కృశించెఁగాబోలు. కళాపూర్ణోదయమునందుఁ గల నూతనకల్పన లిందులేవు. విషయముఁ బట్టి చూచినఁ గళాపూర్ణోదయము సాటిలేనిది ; కాని శైలి ప్రబంధసంబంధి. శ్లేషము, అంత్యప్రాసము, యమకము, భాషాద్వయానులోమ విలోమశ్లేషచిత్రములు మొదలగునవి కళాపూర్ణోదయమునఁ దఱచు ప్రయోగింపఁ బడినవి. రగడలును దండకములును లేకపోలేదు.

కథను వివరించు పద్ధతులు రెండు :- విషయముల జరిగినట్టి కాలక్రమానుసారముగాఁ జెప్పుట, కాలక్రమమునువదలి సరసమగు నే సందర్భముననైనఁ బ్రారంభించి పిదప వెనుక

ముందుగాఁ గథను బెంచి పూర్తిచేయుటయు; మొదటిది కాల క్రమమనియు, రెండవది కార్యకారణక్రమమనియుఁ బేర్కొన బడవచ్చును. వస్తుతత్త్వ పరిశీలక శాస్త్రములలోఁ గాలక్రమము నకుఁ బ్రసిద్ధి యెక్కువ. కావ్యములందు రసము ప్రధానముగాన మొత్తముమీఁదగాలక్రమమునువిసర్జించిన బాగు. కార్యకారణ క్రమముగఁ గథను వర్ధిలఁ జేసినవారు, ఆంధ్రకవులలో నాకుఁ దెలిసి సూరన్న తప్ప నింకెవరును లేరు. ఈ మార్గసంచారము నకును మొదలిడినవాఁ డితఁడే యేమో! స్వతంత్రముగ నవీన భంగుల రచించుట మహాకవి యొక్క ప్రతిభకు ఫలమును సాటి యును.

కాలక్రమముంబట్టి చూచిన నీ కథకు నాదిమ భాగము పంచమాశ్వాసములోని సరస్వతీ చతుర్ముఖుల లీలా కేళి. అనఁగా సామాన్యకవులు వ్రాసియుండినఁ బంచమాశ్వాసము ప్రథమా శ్వాసమై యుండును. చూచితిరా! ఈకవి యొక్క కూర్పులోఁ గథాప్రారంభమునకుఁ గావ్యప్రారంభమునకును నెంతదవ్వో! ఇట్లు దూరస్థములయ్యు నల్లిక చెదరక బిగిబిగిగా నున్నందున నియ్యవి గాఢాశ్లేషముం గాంచియున్నవి. కథ పూర్తిగాఁ దెలి యుటకు నైదాశ్వాసములు చదివి తీఱవలయు. ఇఁకఁ గథ నెఱుంగవలెనన్న కుతూహల మన్ననో ప్రథమాశ్వాసములోనే యంకురితము! రంభా నలకూబరులవలనఁ గడపట వినఁబడిన వాక్యం బొక్కటిఁ దలంచికొని కృతాంజలియై కలభాషిణి నారదునితోఁ దా విన్నప్రకారంబు నీరీతి విన్నవించుచున్నది:

ఏను వృథాభ్రాంతి నింతనంతను దాని
వెంబడిఁ జని పల్కఁ వింటి నొకటి
వినుఁ డది యర్ధేశతనయుఁ డో యబల: యి
న్నారదుమాటల నడుమ వేఱ
తే. పొడమె నేమయ్యె నల కళాపూర్ణుసుద్ది
కడమ చెపుమన్న రంభ యప్పుడ తెలుపనె
నీకు మఱి చెప్పరాకుంట నీ కథయును
నీకు నాతోడు సు మ్మబ్బనీకు మనియె.
(కళా. ఆ. ౧. ప. ౮౬

ఇదియే కళాపూర్ణునిం గూర్చిన తొలుతటి ప్రస్తావన. ఔత్సుక్యముఁ బ్రేరేపించు విధములు చూడుఁడు. రంభ తన ప్రియునికై నఁజెప్పరానికథ యెట్టిది? ఏ కారణముచేత నామె మౌనధారిణి యాయెె? అను మొదలగు ప్రశ్నలు తమంతట నావిర్భవించి, సమాధానము దెలియువఱకుఁ గథనుండి మనల గన్నెత్తనీయకుండఁ జేయును. కావ్యములలోని యేకీభావ మనఁబడు గుణమదియ. అనగా నొకపట్టున, నొక గ్రుక్కగా సర్వముఁ గ్రోలమేనిఁ దనివి నీయమి. భాగభాగములుగాఁ జదువఁబోయినఁ దృప్తి లేదు. ఏలన, సమాప్తి వఱకు నేభాగ మును అఖండముగాఁ దెలియఁ బడమిచే.

తే. ఏనెఱుఁగ వేడ్కపడుచున్నదాన నో, త
పోధనోత్తమ, యాకళాపూర్ణుఁ డనఁగ
నెవ్వఁ డాతనిసుద్ది మున్నేమి చెప్పె
నెద్ది చెప్పరాదనియె నా యిగురుఁబోఁడి.
(కళా. ఆ. ౧. ప. ౮౩)

అని పలికిన కలభాషిణిపలుకు లాయమ వేకాదు, మనవి యును. మండుకొలవి నెగఁద్రోసినట్లు నారదుఁడు "ఇది యంతయు నపూర్వంబు నాకునుం జెప్పరాదు" అని యాన తిచ్చు తఱికి మన యుద్రేక మాఁపరాదని దయ్యెడు. నారదుఁ డీకథ యత్యపూర్వమనుటయును, గవి పాత్రములమూలమునఁ దనకృతిని దానే యటనట విమర్శించుట కింకొక ప్రమాణము రంభానలకూబరులకు నీయపూర్వవృత్తాంతముంగూర్చినప్రసంగ సమయమున వివరించుచు నారదుఁడు కలభాషిణితోఁ దన ప్రియునకైనఁ దాఁదెల్పమికి నాయప్సరస చెప్పిన విధంబు వినుమని యిట్లనియె :—

సీ. ...ఓపౌరుషాభరణ తత్కథలు వ
 చ్చిననేమి యంటేని వినుము తెలియ
నాకథ లిఁక జెప్పిన నట్టివారును విని
 నట్టివారును ధాత్రియందుఁ బుత్త్ర
పౌత్త్రప్రపౌత్త్రాది బహుసంతతియుఁ దన
 ర్పుచుఁ జిరకాలంబున ప్రచురసంప
దభివృద్ధిశోభితశుభసౌఖ్యములు గాంతు
 రనుమాట యున్నది యాదియంద
తే. యేను నీకదిచెప్పిన దీనికొఱకు
 నవనిఁ బుట్టంగవలయునో యని వెఱచెదఁ
 బ్రాణవల్లభ ! యవి తావకాంగసంగ
 సౌఖ్యమునఁ బేర్చు నాకు నిష్టంబులగునె.
తే. అదియు వింటివిగద యని యనియె దేని
 యేను వినినట్టిపిమ్మట నిట్టిమాటఁ

బలికె నొక్క యమోఘ వాగ్విలసనుండు
గావున వచింప విన నిఁకఁ గాదు నాకు.

(కళా. ఆ ౧. ప. ౯౬-౯౭)

ఈ మాటలతో మనయుత్కంఠ గొంతునకు మీఁదుగాఁ బోవును! ఉత్కంఠకుఁ దోడదద్భుతమును వచ్చిచేరును. ఎట్లన: కేవల నిరర్థక వ్యాఖ్యానమైన ఫలశ్రుతిఁ గూడఁ గథలో ముఖ్యాంగముగఁ జేర్చినాఁడేయను విస్మయ మొక్కటి. మఱి, ఈ ఫలములు దేవతలకు శుభము లగుటచే దేవత లీ కథను వక్కాణింపరు. మనకు శుభములు గావున వినవలయునను సంభ్రమ మింకను నుద్గాఢమగును. ఒక పక్షము వారికి మేలు గను, మఱియొక పక్షము వారికిఁ గీడుగను నవతరించిన యీ చరిత్ర మే రీతి భూలోకములో వ్యాపింపఁగలదని యాశ్చర్య పడమా! కథ దేవలోకములోఁ బుట్టియుండుట యీవఱకే స్పష్టము. ఇఁక దేవతలు దెల్పనిది మనకుఁ దెలియు టెట్లగును! కథ యేమో తెలిసియే యున్నది. లేకున్న నీ కావ్య మెక్కడిది? నారదుఁడును,

"తే. అతివ విను రంభకును గల యట్టి భయము
నాకుఁ గల్గుటఁ దత్కథ నీకుఁ జెప్పఁ
గూడ దట్లయ్యు మిక్కిలి కువలయమున
వెలయఁగల దది వెలయ త్రోవలును గలుగు."

(కళా. ఆ. ౧. ప. ౯౯)

అని చెప్పుచున్నాఁడు. అతనివాక్య మమోఘము. అట్లగుట నెవ్వరికి నపాయంబునాపాదింపని యే మంత్రముచేఁ గవి

యీ క్రియ సమర్థించునో యని యబ్బురపాటును దొట్రు పాటును జదువరులకుఁ దలమున్క లగునుగదా! మనలనేకాగ్ర వధానులం బరాకృష్టచిత్తులం జేయుటకంటె శిల్పసౌభాగ్య మెయ్యది ? కల్పనయనఁగా నిట్లుండునదే కల్పన. ఊపిరియాడ కుండునంత యుద్వేగముం గల్గించునది.

షష్ఠాశ్వాసములోని 189 వ పద్యము వఱకు నుండు నంత ప్రౌఢముగఁ దరువాతి భాగములు లేవు. ఈ గ్రంథమంత టితో సమాప్తిఁ జేసియున్న సమ్యాన్యతరమై యుండును. పదవ, యెనిమిదవ యాశ్వాసములలో భావనాశక్తి, ప్రతిభ మొదలగు కవిత్వ మూల శక్తులు బలహీనములు. తుదకు మధురలాలసా పరిణయాదులు వర్ణింపఁబడకున్నను తత్పూర్వ కథచే నూహ్యములు కావున వానిని బొందించి యుంట పున రుక్తిఁ బోలినది. ప్రధానాఖ్యానముతో నైక్యము వీని కత్య ల్పము. అట్లయ్యును ఈ నిరర్థక ప్రస్తావనకుఁ గవి యేల ప్రవర్తించినాఁ డనుట చింతనీయము.

కథాంగము లేక భావముం దాల్చి యొక శరీరముగా నేర్పడియున్నఁ గళకు ప్రాశస్త్యము. అట్టి గాఢసంయోగము నకు షష్ఠాశ్వాసములోని పూర్వోదిత పద్యమునకుఁ దరువాతి భాగములన్నియు విచ్ఛేదహేతువులు. ఇది యెఱింగి ప్రతిక్రియ చేయనెంచినవాఁడై కాఁబోలుఁ, గథయొక్క యాదినుండి యంతమువఱకుఁ బూసలలో దారమిడి యుండునట్లు మణి హార వృత్తాంతముం గూర్చియున్నాఁడు. ఈ హార వృత్తాం తముం దిలకింపుడు :—

## ష్మణిహార వృత్తాంతము

దీనికి నాదిమ ప్రభువు విష్ణువు. అతనిని దపస్సుచే మెప్పించి దానిని బడసినవాఁడు సుగ్రహుఁడు. పిమ్మట బ్రాహ్మణ శాపమున నతండు దన తొల్లిటి యెఱుకయంతయు హతంబు కాఁగా, నూతనావతారమెత్తిన వానియట్లు సత్వదాత్ముఁడను పేరఁ బరఁగి రాజుగాఁగొంతకాలముండి పిమ్మటఁ గళాపూర్ణునికి మంత్రిగాఁ గుదిరె. సుగ్రహుడు మున్ను దేవతాలయములోఁ బెట్టి మఱచిన యా మణిహారమును మధురాపురపు బ్రాహ్మణుఁ డొకడు తీసికొనిపోయి తన యింట బహు వర్షములు పూజసేయుచు నుంచికొని ద్వారక కరిగి శ్రీకృష్ణునకు సమర్పించెను. శ్రీకృష్ణుఁడును "దండకాకృతి సముజ్జ్వల సంస్తవలీల కెంతయున్, ఘనముగ మెచ్చి యిచ్చి మణికంధర నామునకున్." మణికంధరుఁ డలఘువ్రతునకు, నతఁడు కళాపూర్ణునకును, నాతడు శిశుప్రాయ యగు మధురలాలసకుం గ్రమముగ నొసంగిరి. అట్లగుట నీ హారమును సరస్వతీ చతుర్ముఖ విలాస క్రీడయుం బోలెఁ గథ నేకీభూతముం జేయు కల్పనలలో నొక్కటి. పూర్వోత్తర భాగంబు లన్నిటికి నీ హారము సామాన్యము. కథ నెల్లఁ బ్రాఁకియుండు తీగవంటిది.

ఈరీతి నీ కల్పన మహోత్తరమైనదయ్యు నిష్కళంకము గాదు. ఎట్లన : ఆ హారము యొక్క నాయకమణి యెవ్వరి హృదయస్థలంబున నెంతవఱకు సోఁకియుండునో, యంతతడవును వారికి సర్వజ్ఞత్వము, వాక్పటుత్వమును సిద్ధించునని విష్ణువు వరము. దాని సత్యము ననుభవమునకుఁ దెచ్చుకొనులోపల

సుగ్రహముండు శాపహతుఁడాయె. మథురాపురి బ్రాహ్మణుం డన్నానో దానిని గంఠములో ధరింపక పూజసేయుచు బహు వర్షము లుండినాఁడఁట! వాని భార్యయొక్క చిత్తస్థైర్య మెంతదృఢమో! ఆవెగూడ దొంగతనముగానైన దానిని వేసి కొనలేదు. శ్రీకృష్ణుఁడు మణికంధరుని మెడలో వేసినాఁడు గాన, యది "బాలతఁ గనుపట్టు విష్ణుని కలాపము గావునఁ దద్భుజాంతరస్థితికిఁ జాలకొప్పి గళసీమన యెంతయుగుప్తమై" యుండెనఁట! "బాలతఁ గనుపట్టు" అను విశేషణము సమంజ సమా? పూజారి బ్రాహ్మణుఁ డిచ్చినది బాలకృష్ణునకా?షోడశ సహస్రమహిషీయుతునకా? పిమ్మట శిశువుగానున్న మధుర లాలసకుఁ గళాపూర్ణుఁడు వేయఁగా నాయకరత్న మాపె హృదయంబు సోఁకునట్లు పడినది. సమయముఁజూచి పడవల సినచోటఁ బడినదిగదా! ఎంత తెలివిగలపతకము!"అట్లుసర్వజ్ఞ యైన యబ్బాలికామణి యనేకుల పూర్వవృత్తాంతముం దెల్పి సత్వదాత్ముని చరిత్రమునకు వచ్చునప్పటి కాపె "యటునిటుఁ గదలఁగఁ దన్మణి హృదయస్థలముఁ బాసి కడకేఁగుటఁ దెలివి యుడిగెను" ఇట్లువ్రాయుట కామరూపధారణముకంటె నసం భావ్యము. ఏలన: సత్యముగా నుండునా యను శంకఁ గలుగఁ జేసి కథయందు నమ్మికను భ్రమను బోఁగొట్టుఁ గావున. ఇఁక ముందటి వృత్తాంత మింకను బ్రాయోభావమునకు దూరము.

"వ. నాఁడట్లు బోధోదయం బగుటయు నుడుగుటయు నేత న్మాలంబులని యెవ్వరు నెఱుంగకుండుటను నిది సామాన్య హారంబ యనుతలంపున మావారు దాఁచి మఱచుటం జేసి

నాఁటనుండి నేఁటిదాక నిద్దివ్యహారం బెన్నఁడును ధరియింపఁ జుటయు లేదు. నేఁ డాభరణభరణసమయంబునఁ బ్రసంగవశంబునఁ దలంచికొని చెలులు తత్ప్రాప్తి ప్రకారం బెఱింగింప నిది సుముహూర్తలబ్ధంబైన ప్రథమభూషణంబనియు శివద్ధత్తంబనియు నత్యాదరంబునఁ దెప్పించి హృదయభాగస్పర్శినాయకరత్నంబుగా నిపుడుధరియించియున్న దాన."

(కళా. ఆ. ౧. వ. ౧౮౯)

ఇందలి యసంభావ్యములు రెండు : కన్యగా నుండునపు డారాజు గాలియైన సోఁకునా దేవుఁడా! యని వ్యథఁ గూర్చుచున్న విరహవేదనా కాలమునను బెండ్లినాఁడును ఎన్నఁడును రాని ప్రసంగవశ మిప్పుడేల పైఁబడవలయును? రెండవది: 'హృదయభాగస్పర్శినాయకరత్నంబుగా' ధరింప బుద్ధి నిష్కారణముగా నేల పొడమవలయును ? లోకములో నదృష్టములును, నిర్హేతుకములు నైన యాకస్మికములు లేకపోలేదు. గాని,పదే పదే వలసినచోట్ల నెల్లఁ గాకతాళీయన్యాయముల నాశ్రయించుట కల్పనకుమిక్కిలి కొఱంత. కామరూపములు, దివ్యదృష్టి, ఇత్యాదులు, అన్ని కష్టములకు ననుకూలించు సాధనములు గానఁ బ్రశస్తములు గావు. సర్వసందర్భములలోఁ జేరఁజాలినవి యీకథలోఁ దప్పక చేర్పఁదగిన యంశములని చెప్ప వీలులేదు గనుక, నిట్టి వేసందర్భములను జేర్పకుండుట మేలు. కథ కెల్ల సూత్రమువలెనుండు నీ హార మిన్నివక్రముల కాస్పదమగుట చింతావహము.

నాటకరీతిని సంభాషణాదులచేవృత్తములం బ్రకటించుట యందు నీ గ్రంథ మసదృశము.

కథాప్రారంభమున నే యెంతవడిగా నెన్ని పాత్రములం బ్రవేశింపఁ జేసినాఁడో తలపోసి యానందాశ్చర్యముల భరిం పుఁడు. ఉద్యానవనములోఁ గలభాషిణి చెలికత్తెలతోఁగూడి డోలావిహారంబు సల్పుచుండఁగా, నారదునితో నాకాశమార్గం బునఁ బోవుచుండు మణికంధరుఁడు,

"మ. తమిఁ బూఁదీఁగలఁ దూఁగుటుయ్యెలలఁ బంతాలాడుచుందూఁగు నా
కొమరుం బ్రాయపుగబ్బిగుబ్బెతల యంఘ్రుల్ పక్కగాఁ జాఁగి మిం
టిమొగంబై చనుదెంచు తీవిఁ గనుఁగొంటే దివ్యమౌనీంద్ర! నా
కమృగీ నేత్రలమీఁదఁ గయ్యమునకుం గాల్చాఁచు లాగొప్పెడిన్"

(కళా. ఆ. ౧. ప. ౪౩)

అని ప్రశంసించిన ప్రకారము సరిగాదని నారదుఁడు,

"మ. భళిరా సత్కవివాదు నిక్కమ తగం భావించి నీవన్న యా
యెలప్రాయంపు మిటారికత్తెల బెడంగే నెందునుంగాన, వా
రల డోలాచలనోచ్చలచ్చరణముల్ త్రైవిష్టపస్త్రీల యా
దలఁ దన్నం జనునట్లు మించె ననినన్ దప్పేమి యొప్పెయగున్."

(కళా. ఆ. ౧. ప. ౪౪)

"క. అని పలుకునప్పుడు నికటం
బున నలకూబరుఁడు దాను మొగిలు మఱుఁగునన్
ఘనమగు దివ్యవిమానం
బునఁ జనుచున్ రంభ విశదముగ నది వినియెన్."

(కళా. ఆ. ౧. ప. ౪౫)

ఆదినే యీరీతి నైదుగుర నెదుర నిల్పుటయ కాదు, మాటమాటకును గథ పెరుగునట్లు చేయు మాహాత్మ్యమున సూరన నిస్తులుడు. ప్రథమాశ్వాసము ముగియునరికిఁ గథా మధ్యమున మునిఁగినవారమై, యెట్లు వచ్చితిమి, యాది యెయ్యది, యంత్య మేదిక్కున నుండునని విస్మయానందముల నోలలాడుచుందుము. మణికంధరునిస్తుతి వ్యర్థచేష్ట గాదు. ఆకాశమునఁ జేయఁబడి యుండినందునఁ గలభాషిణి విని యుండదు. అటువినమి యావశ్యకము. లేనిచో నలకూబరుని పైని వలపుచేసైన దైన్యముతో నారదు నాశ్రయించి యుండదు. మఱియు నాపొగడిక రంభకు నసూయాకారణము. ఆ యసూయచేఁగదా యామె నారదునితో మాటలాడుటకై వచ్చి నలకూబరుఁడు "నరభామల పోఁడుములకు బ్రమయక యున్నే" యని దరహాసముచేయుట! నారదుండును బ్రతి హాసముఁ జేయఁబూని,

"క. నినుఁబోలు వనిత నీకును
వనజముఖీ! యితనిఁ బోలువాఁ డితనికి నెం
దునుగల్గి కలఁచునో యి
ట్టి నిగాఢపు మదము సొంపు తీవులు చనునే?"

(క॥. ఆ. ౧. ప. ౬౦)

అను పల్కు తటికిఁ గథయొక్క యస్తిభారములో సగము సంపూర్ణమయ్యెను. పిమ్మట లెక్కకు వచ్చునో రాదో యనునట్టి చిల్లరవిషయముంబోని,

"వ. అంత నమ్మహామునీంద్రుని యాజ్ఞానుసారంబునం దద్వి మానంబు కలభాషిణి విహరించుచున్న యెలదోఁటలోనికిం దిగియె నట్టియెడ రంభానలకూబరులును వినయపూర్వకం బుగా నతనిచేత ననిపించుకొని యప్పు డెదుటఁ గాన్పించు వాసుదేవుని ప్రాసాదరాజంబునకుం జేయెత్తి మ్రొక్కి తమ విమానంబుతోడ నిజేచ్ఛం జనిరి".

(కళా. ఆ ౧. ప. ౬౨)

అను వాక్యముతోఁ గలభాషిణి నలకూబరుని వలచు టకును గళాపూర్ణునిసుద్ది వినుటకును సహజమైన సమయముఁ గల్పించి తక్కిన సగము ననాయాసముగ ముగించిన యీ కవి యొక్క ప్రతిభ యనిర్వచనీయము గదా! ప్రథమాశ్వాసము కథకు నాలవాలము. సమస్తములైన కార్యములయుఁ గారణ బీజంబు లిందుఁ జల్లఁబడియున్నవి.

ఐక్యమను లక్షణము

సామాన్య కవులతోఁ బోల్చి చూచిన సూరన కళా కౌశల మింకను వైశద్యముతో వెలుఁగును. మన ప్రబంధములు తఱుచుకథానాయకుఁడగు "రాజు" అను నొక్కపాత్రముతోఁ బ్రారబ్ధములు. ఆయన గూర్చిన యప్రస్తుత వర్ణనము ముగియు టకుఁ బట్టునది యొక గంట పిమ్మట నర్మసఖుఁడో ఎవఁడో యొకఁడు వచ్చుట. అటు తర్వాత వేట వెడలుదురేమో! అక్కడ నొక సఖీజన పరివేష్టిత యగు కోమలాంగిని జూచి రాజును విదూషకుఁడును (నర్మసచివులుపిడు ఃషకుఃలు గనఁ ండుఃట

యును,విదూషకులు నర్మసచివులుగ నుండుట హిందూరాజ ధర్మముకదా!) రెండుగంట లొకరితో నొకరు శ్లేషలు, అతి శయోక్తులు, ఉత్ప్రేక్షలుఁ జెల్చునప్పటికి నిది దయ్యాలతో నిండిన కావ్యమని దూరముగఁ బాఱవైతుము! కళాపూర్ణో దయముతో నుపమింపఁ దగినది, మూలము స్కంధము సామా న్యములయయ్యు, వివిధ గతుల దెసలను వ్యాపించు శాఖోప శాఖలు గలిగి కనుపండువుగ నుండు మహావృక్షము.సామాన్య ప్రబంధములు. కొలుకు లొకదానివెంట నొకటి యతికించుటచే నేర్పడిన గొలుసులవంటివి. ఐక్యము వీనిలో లేదు. యెన్ని కొలుకులైనఁ జేర్పవచ్చును; ఎన్నియైనఁ దీసివేయవచ్చును. వైపుల్యముదక్క నింకెద్దానికిని లాభనష్టము లుండవు. ఆకృతి మాఱదు. వృక్షములు మొదలగు సజీవములవలె నుండు కావ్య ముల నే యంగమునైన ఛేదించుటకుఁ గాదు. నూతనాంగ ములఁ జేర్చుటకుఁగాదు. ఎట్లు చేసినను పరిమాణభేద మేకాదు, ఆకారమును వికృత మగును. ఐక్యమను కథా లక్షణమును బరీక్షించు పద్ధతి యేమనగా:—ఉన్న భాగముల వేసి దీసివేయ వచ్చునా, క్రొత్తవి యేవైనఁ జేర్పవచ్చునా యని విమర్శిం చుట. ఈ కార్యములు పొసఁగనివైన నైక్యము స్ఫుటము. సాధ్యములైన నైక్యభావ మపక్వము.

"మానవప్రకృతిని అద్దమువలెఁ జూపుశక్తి గలవాఁడు, సంభాషణలఁ దీర్చుటలోఁ దిక్కనకు సరివచ్చువాఁడును" అని సూరనార్యుని బ్రశంసింపఁగలందులకుఁ దార్కాణమైనముఖ్య భాగములలోఁ గొన్ని యేవనఁగా, నిరువురు రంభలును నల

కూబరులును బ్రవేశించి చిత్రవిచిత్రగతులఁ బొరపాటుతో సంచరించియు నేయనుచితములకును అనీప్సితములకును బాల్పడక కృతార్థులగు తృతీయ చతుర్థాశ్వాసములలోని ఘట్టములు.

సూరన్నయు షేక్స్పియరును నొకరి పేరొకరెఱుంగనైన జాలనియంత దవ్వులనున్న సమకాలీనులు. జాతిమతవేషభాషాదుల వ్యత్యస్థులు. అట్లుండియు నీవింత నేమిచెప్ప ? షేక్స్పియరు వ్రాసిన "కామెడి ఆఫ్ ఎరర్స్" (తబ్బిబ్బుల ప్రహసనము) అను నాటకమునకు, రంభానలకూబరద్వయ విలాసముకును జెక్కు పోలికలున్నవి. రెంటియందును భేదము లేని రూపముగల నాయకు లిరువురు నాయిక లిరువురు. అన్యోన్యపాత్రములనిరూపించుటకునసాధ్యమైన భ్రమ తటస్థించి, నాయికానాయకులు తమవలచినవారని యొండొరులతోఁ జేరియుండువేళ, 'అయ్యో ! పాపము ? అన్యునిచే నీ తరుణి చెఱుపఁబడెనా" యను సంశయము దోఁచి మనసు కలత పొందించును కాని, కథ యామూలాగ్రముగ విశదీకరింపఁబడు సరికిఁ దమతమ యభిమతముల కనుకూలములైన విధంబుల దాంపత్యము లేర్పడినవని చూపి, మనకుదిగ్భ్రమము వాయుట తోడన పట్టరాని నవ్వును సంతోషమును గలిగించును! ఇట్టికథా సందర్భ మెంతో యపురూపము.అట్టిదానిని హిందూదేశములో సూరన్నయు, నాంగ్లద్వీపమ్మున షేక్స్పియరును నెట్టిసంబంధములును లేని వారయ్యు నేక కాలమునఁదలపోయుటఁ దలంచితిమేని, యిదికాలయోగప్రభావమో! ఆకస్మిక విచిత్రమో!యని విస్మయభరితాంతఃకరణుల మగుదుము.

కళాపూర్ణోదయమున నైదిటికిఁ దక్కువ కాని విధముల శృంగారము ప్రదర్శింపఁబడియున్నది. ఇందు జావళీలకుఁ జేరు నది యొకటిమాత్రము. అయ్యది యప్రశస్త మనఁదగిన భాగములో నుండుటచే దాని ప్రస్తావన నిప్పుడు చేయను. తక్కిన వానిలో నొకదానివలె నొకటి యుండదు. అన్నియు రమణీయముల. స్వశక్తియే గురువుగ నూతనమార్గములఁ ద్రొక్కి సూరనార్యుఁ డందుఁ బ్రకటించిన యీ యసాధారణ శృంగారములకు ముఖ్యనిదర్శనములు:- శల్యాసురవిషయము సుగాత్రీ శాలీనుల వృత్తాంతము,సరస్వతీచతుర్ముఖవిలాసము, కలభాషిణీ చరిత్రమును.

## ౧. శల్యాసుర చరిత్రము

మృగేంద్రవాహనాశక్తి, తనబంధువగు మహిషాసురుని జంపిన సూఁడు మనంబునఁ బాయమిచే శల్యాసురుఁడు పగదీర్పు నుపాయ మన్వేషించు చుండఁగా నభినవకౌముది యను నప్సరస యెదురైనఁ, జూచినమాత్రాన హృదయమును, ఆ హృదయముతోడ నిన్నాళ్లుచాఁ బట్టినపట్టును గోలుపోయినవాఁడై, నన్నేలుకొమ్మా యని కాంతను వేడికొనఁగా, నామెయుఁ జలంబు దాల్చినదై.

క. .........................

...............నిన్ను మడియించినవా
నినిదక్క నే వరింపను,
విను మిది నాప్రతిన దీని విడ వికఁ దనియెన్.

చ. అనుఁడు దదుక్తి క్రూరతకు నద్దనుజుండు ఘనంబుగా
గినిసియుఁ బోవనిచ్చె నొకకీడును జేయక యవ్విలాసినిన్
(ఆ. ౬. ప. ౩౯. ౪౦.)

ఎంత బలవంతులైన నేమి? కామినీకటాక్షపాశబద్ధులేమి చేయగలరు? మరల మృగేంద్రవాహనాశక్తి యిచ్చిన యమోఘంబైన కత్తిందాల్చి మణికంధరుని నరయుటకై పోవు నభినవకౌముదిం గాంచిఁ దన్నే చంపుటకు వచ్చుచున్నదో, యట్లైనఁ జంపువారు చత్తురన నన్మాహాశక్తి వర మున్నదిగదా! అట్లగుట నాపె నాశ మొందునో యని తనపాటు మఱచి ప్రియురాలి శుభాశుభములం దలపోయుచు నా సాధువు.

"చ. మతిగలఁగంగ నిట్లనియె, నాపయి వచ్చిన నీకు నిష్టదై
వతముల యాన సుమ్ము! వరవర్ణిని! యెందుఁ దలంక నేను దు
ర్మతివయి నీవు నాకుఁ దెగి ప్రమగ్గెదవో యని తల్లడిల్లెదన్".
(ఆ. ౬. ప. ౬౨)

అభినవకౌముది యతనిమంచిమాటల మోసగించి వెంటఁ గొనుచుఁ జన్నది. నమ్మినవాఁడు కవుడులేని మానిసి! వానిని మోసగించుట యేమి కష్టము? ఇట్లు తన్నలయించుచుం బోవు చుండఁ దన ప్రతాప మాపె కెఱుకపఱుచువాఁడై యాపెను దాఁకకుండునట్లు శిలల ప్రయోగముఁ జేసి జంతుజాలంబుల సంహరించియిట్లనియె. "నన్ను వరింపుము. లేనిచో నీవు చనెడు చోటులెల్ల నాబలముచే నాశము చేయుదును. దాన నీకు నప కీర్తి. కాన నన్నుఁగూర్చి కరుణలేకున్నను భూతకోటులరక్షింప వలయు నను దయచేనైన నాకు పత్ని వగుము "అయ్యో

వారి యార్తి యెట్టిది. కాఠిన్యము, మార్దవము రెండును వాని యందున్నవి కదా! మోహమాహాత్మ్య మట్టిది! వెన్న ఱా యగును; ఱాయి వెన్న యగును. అతనిని మణికంధరునిచేత నభినవకౌముది చంపించినది. వానిది వ్యసనకరమును వ్యర్థమును నైన శుష్కజీవితము! నిష్కళంక ప్రీతిచే విశోభితము!

## ౨. సుగాత్రీ శాలీనుల విచిత్ర కథ

సుగాత్రి శారదపూజారియైన యొక బ్రాహ్మణుని కూఁతురు. దాని వరుఁడు శాలీనుఁడు. ఇల్లటపుటల్లుఁడు అలంకారములు, డంబములు, అట్టహాసములును వీనికి సరిపడవు. పట్టణవాసుల కుర్చీలు, మేజాలు, నిలువుటద్దములనుజూచి పల్లెటూరివాఁడు వెఱఁగు వెఱపు నందిపోవుమాడ్కి, నేయలంకారములు లేక యుండువారినే కాని, తళతళలు, పళపళలు, ఘలఘలలు, ఘుమఘుమలు, మెఱయవచ్చెడు స్త్రీలఁ దిలకింపఁడు. సర్వశృంగార సన్నాహములతో భార్య పడకటింటికి రాఁగా నిదేమి కొఱవిదయ్యమో, గజ్జెలపిశాచమోయని కన్నెత్తియైనఁ జూడకుండెను! ఆ భార్య కాపురుషుని తిక్క తెలియదు.

అత్తగారింకను శ్రద్ధతో సొగసులు దిద్దిదిద్ది కూఁతును రెండుమూఁడునాళ్లట్ల యనిపెను. వృథాప్రయాస! "వట్టి రాక పోకలొనర్చె వానిసతియు." పెండ్లికూఁతు రూరకయుండినను జెలికత్తె లూరకుందురా? జీతములకుఁ బ్రతిఫలముగా బోధనలు చేయనిచోఁ గృతఘ్నత యని యేమో! ఆ లజ్జావతికి నేకాంతంబున నిట్లనిరి :

"ఆ. పొలతి ! యాలిమగని పోఁడుము లేమియుఁ
గలిగినట్టి చొప్పు గానరాదు
మీ తెఱంగు చూడ మేల్మేలు దంపతు
లిరువురును వివేకు లేమి చెప్ప !

(కళా. ఆ. ౪. ప. ౬౫)

క. కాంతుఁ డుచితజ్ఞుఁడైనను
గాంతకు సిగ్గువడఁ జెల్లుఁగాక కటకటా !
కాంతుఁడు సిబ్బితికాఁడై
కాంతయు నట్టైన నెట్లు కాఁపురమింకన్.

(కళా. ఆ. ౪. ప. ౬౬)

క. గారామునఁ దోడ్తోడన
రారమ్మనఁ డనుచు మగిడి రానేటికిఁ గ
ర్పూరంబుతోడి బాగా
లీరాదో యాకుమడిచి యీరాదో చెలీ!

(కళా. ఆ. ౪. ప. ౬౯)

క. అన విని యా పెడమాటల
నను నేటికిఁ జంపెదరు విసన్ సైఁపవు నా
కని సిగ్గునఁ బలుకుచు నాఁ
డొనరిచి చూచెను దదీయయుక్తుల తెఱఁగున్."

(కళా. ఆ. ౪. ప. ౭౦)

ఈ సంభాషణ యతిమధురము. అశ్లీలవాక్యములు లేవు. జాతీయములు, లోకోక్తులు, వీనిచే సువాసితము. చెలికత్తెలిట్లు గరువముగాఁ బలుకుట కావ్యములలో నరిది. కడపటి పద్య

మత్యద్భుతము. ముగుదకన్నె యొక్క బయటిసిగ్గును లోని యాశను సొగసుగఁ జూపు చున్నయది.

ఈ నూతన చికిత్సలు ఫల మీయక పోయెను. పాపము సుగాత్రి యేమి చేయును? రాజకుమారిగానుండినచోఁ జందనాదులఁ బట్టించుకొని చిగురుటాకుఁ బాన్పుపై హాయిగా మూర్ఛపోయియుండును! పూజారిబిడ్డ శాస్త్రప్రకారముశృంగారమను పథ్యమును సేవించి ప్రకటింపవలయునన్న నుద్యానవనముండవలయును, శీతలోపచారములకు సేవకురాం డ్రుండవలయును; మఱియు పచ్చకర్పూరము, పునుఁగు, జవాది, యరఁటిబొందెలు, చందనము మొదలగు సంబారములు లేవని శాస్త్రోక్తముగాఁ గామము నావాహన చేయనగునా! అట్టినీటు ధనికులకే కాని సామాన్యులకుఁ జెల్లదు. ప్రబంధములలోని మోహముమాత్రము నిక్కమైన యెడల, రాజుల యిండ్లలోనే కాని యింకెక్కడను రతిమన్మథులు నివాసము చేయరని చెప్పవచ్చును! సుగాత్రికీ దిగఁదీపు లెవ్వియుఁ బట్టలేదు! "నాకును మంగళసూత్రం బీపాటి శుభస్థితి నుంటదు యే పదివే లనుచు నెంచుకొనియు వేఱొకలాగున నుండక యతనికి నాయురభివృద్ధికరంబులని వివిధాలంకారముల నెప్పుడు నేమఱకయ తాల్చుచుఁ దనతల్లి యేమియు నతని నిట్టిట్టాడకుండం బ్రార్థించుచుండె."

భర్తకు నొక పిచ్చియైన భార్యకు నొక పిచ్చి. తన యలంకారము లాయనకు నాయురభివృద్ధికరము లనుట పిచ్చియైనను మేలుచేయు మంత్రములలో నొకటిగాన ననింద్యము. ఈ యోర్పును, వినయమును, సుఖపరిత్యాగ

బుద్ధియు, సంతుష్టియు శృంగారభావములు గావా? పతిపైఁ గల ప్రీతిని సూచింపవా? అత్తగారి కీ మాత్రమున శాంతము గుదురదాయె! మనుమఁడు గలుగకున్నఁ దనకు మోక్షము గలుగదని యేమో! ఈ దౌర్భాగ్యపుటల్లుఁడు తోఁటలోనైనఁ గృషిచేసి ప్రయోజకుఁడుగానీ యని, యాతనిని బూఁదోఁటలో మాలిపనికి నియోగించెను! శాలీనుఁడు సత్త్వగుణుఁడు.చెప్పిన దంతయుఁ జేసి రచ్చలేక యుందమనెడివాఁడు. మఱియు నిల్ల టపుటల్లుఁడు. అట్టి యల్లురకు మర్యాద లెక్కువ యుండునా? ఒక్కఖేదమును జెందక నిత్యముఁ దోఁటపనులఁ జేయుచుం డెను. అప్పుడు సుగాత్రి,

తే. తల్లిమాటలచే నిట్లు తనవిభుండు
దనువు బడలంగఁ బూఁదోఁటపనులు సేయఁ
జూడ నోర్వక తాను నచ్చోటి కరిగి,
తోడుపడియెదనని చూచు, వ్రీడ నుడుగు.

(ఆ. ౪. ప. ౮౪)

పిమ్మటఁ గొన్నాళ్ళకు లజ్జఁబాయఁద్రోచి పురుషునకు సహాయముగఁ దానును దోఁటపనులను జేయ,

... ... ఎప్పటియట్ల యలంకృతాంగియై
యెంతయు నింపుతోడఁ జనియెన్ బ్రియుఁడున్నవనంబు లోనికిన్,

(ప. ౯౪)

కం. చని యాతఁడు దాఁ జలిపెడు
పనులకు వీయకొనకున్నఁ బలిమిఁ గడంగెన్
దనసొమ్ము లెల్ల నొకమఱుఁ
గున నిడి పిరిసుట్టు సుట్టికొనిన వలువతోన్.

సీ. తోరంపుఁజమదోయి త్రుళ్ళింతల నిడంగఁ
దగుచోట్ల గుద్దఁటఁ ద్రవ్వి త్రవ్వి
వ్రేఁగైనపిఱుదు బల్విడిఁ జలింపంగను
వడి నిట్టునట్టును నడిచి నడిచి
యడుసు తుంపురు చెక్కుటద్దంబులను బర్వ
మళ్ళకు మడవలు మార్చి మార్చి
నడుము లేఁదీవియ నకనక ల్గుడువ నిం
పునఁ దగుమోఁపులు మోసి మోసి

తే. చిఱుచెమటఁ జేర్చు వింత క్రొమ్మెఱుఁగుతోడఁ
గొమరు మేనొప్ప సారెకుఁ గొప్పు వదల
నేమిటికి నైనఁ దామున్న యేగి యేగి
మెలపనుల నొనర్చె నింపెసక మెసఁగ.

(ప. ౯౬)

ఇన్నాళ్లుఁ గరఁగని యాతని మన శ్రీ నవ్యమోహన మూర్తిచే జయింపఁబడెను.

వ. ..................................అంతనా
బడలిక చూడలే కిడుమపాట్లకుఁ జొచ్చి నలంగి తంబు నె
క్కుడు తమకంబుతోడఁ దలఁగ్రుచ్చికవుంగిటఁ గూర్చె నత్తఱిన్."

(ప. ౯౯.)

పశుప్రాయమగు శృంగారమునకంటె నిదియెంత మేలు! చూచి చూడక మునుపే కామినులఁ గవయ నుంకించుట లోల

త్వము, నీచము ఇక్కడ, భార్యయెడఁ గూరిమి, ఆమె తన సహాయమునకై స్వయముగా వచ్చినందుకు మెప్పు, బడలినం దులకుఁ గనికరము, గొప్పబుద్ధిఁ జూపినందులకు నుదారవర్తన యను గౌరవము—ఇట్లు స్నేహము, మర్యాద, వీని కనుకూలములైన భావములతోఁ గలసిన శృంగారము చూపఁబడి యున్నది. ఇది శ్రేష్ఠము; మానసికము; శాశ్వతము. పెఱయవి యంగరాగములు, తుచ్ఛములు, చంచలములు. మనసుతోఁ గలసినట్టు కామేచ్ఛ వర్ణించుట మనలో నంతగా లేదుగాన చరిత్రము నవ్యలీలాలలితంబు.

### ౩. సరస్వతీ చతుర్ముఖ విలాస ఘట్టము

ఒక విషయముంబట్టి చూచిన సరస్వతీచతుర్ముఖ విలాస ఘట్టము వంటిది యాంధ్రంబున నెక్కడను లేదు. ఏ విషయ మనఁ, బ్రకృతిని జాత్రముల జీవితముతోఁగలిసినట్లు వర్ణించుట.

రంగము సరోవరము. శారదాదేవి ప్రణయకోపమున నవ్వలి మొగంబుగాఁ బొరలినందున, నా మెను ముఖచంద్రమండల మాకాసారములోని మణిస్తంభమునఁ బ్రతిబింబిత మగుడు, బ్రహ్మయు దానినిం జూచుచునైన నానందింతమని కొంతసే పట్లేయుండి, యెంతకను బ్రియురాలి కోపము దీఱనందున, సమీపవృక్షశాఖాధిష్ఠితమగు రాచిల్కతో "ఓ చిలుక చెలువ! యుబుసుపోదు, కథ యొక్కటి చెప్పవుగా" యనుటయు, "నో దేవ! మీరుచెప్పెద రేని విని యెద"నని యాశుకంబు విన్న వింప, వినుమని యాతండు నప్పుడు జరిగినశృంగారలీలలనేదో

కథఁ జెప్పినట్లు శ్లేష చేసి వివరింపదొడంగెను. ఎట్లన: "కాసార పురములో నొక రాజు. అతనిపేరు కళాపూర్ణుఁడు. (ముఖ చంద్రుఁడు) అతఁడు స్వభావునిచే (స్వభావముచే)నొక యెఱ్ఱని మణిశిలాకను (మోవిని) విల్లును (కనుబొమలును) బాణము లును (చూపులు)బడసి సరిరాజులనెల్ల జయించెను." ఈరీతిగాఁ దాను మన్మథావేశముచే నామెం గదియుట మొదలైన రాగంపుఁ జెయ్వులెల్లఁ బ్రకటించుడు, భాషాయోషయుఁ గృత్రిమకోపంబును నిజమైన యుల్లాసంబునుగాఁ జిట్లింపఁబడిన కనుబొమలతోను వెలివిరిసివచ్చు చిఱునవ్వులతోను, ఆచిలుకం జూచి "యాకళాపూర్ణుఁడు మఱి యేమియయ్యె, నతనితలి దండ్రు లెవ్వరు, అడుగుము" అనవుడుఁ, జిలుకయు నట్లడుగ బ్రహ్మదేవుం డింకను జమత్కారముగా నేమనుచున్నాఁడు! "అతనికిఁ దండ్రి సుముఖాసత్తి, తల్లి మణిస్తంభుఁడు" (స్తంభ శబ్దము పుంలింగము గనుక నందు ప్రతిబింబితం బనుట) అట్లను సరికి :

సీ.

...వాణి హాసమ్ముతో, గ్రక్కునఁ గ్రమ్మఱి కౌఁగిలించి

........................................

యింతలోననయారః యెన్ని తబ్బిబ్బులుదద్దరిల్లకుఁడంచుధవునివీఁపు

తే. చఱచి యెట్టెటు లా రాజుజనని మగది
యును జనకుఁ డాఁడువాఁడునా యనుచు మఱియు
మిగుల నవ్వుచుఁ జెప్పుఁడా మీఁదు ప్రాణ
రమణ! మఱి యేమి యయ్యె నా రాజసుటయు.

(కళా. ఆ. ౫ ప. ౨౪).

పొలయలుక సగము విరిసినది. పిమ్మట మఱికొన్ని స్నేహక్రీడలు నడవఁగా, "నిదేమి, యూరకుండ" రని కోప గించుకొన్న సరస్వతీ దేవికి హృదయప్రమోదంబుగా, నీ క్రొత్త సంగతులను జేర్చి శతానందుఁడు కథ పెంచి చెప్పిన, శారదాదేవియుఁ గపటరోషంబుతోఁ "జాలుఁజాలు మీకథ. ఇప్పటిమనవృత్తమంతయుఁ జెప్పుచున్నారు.ఇంకెంతదూరము చెప్పెదరోయని యూరకుంటిఁగాని, తొలినుండి నాకుఁదెలియ దనుకున్నారా?" యని యాకథయందలి ప్రస్తుత వర్తమాన మును మృదుమధుర వచనముల వ్యాఖ్యానముఁ జేసి చూపు చున్నది. ఐదవ యాశ్వాసములోని యీ వచన మెల్లరుఁ జదువఁదగినది. వచన రచనలకుఁ దండ్రి యట్టివాఁడు నన్నయ్య భట్టు అతని ప్రౌఢిమ యన్యులకు లేదు. ఒక్క చిన్నయసూరి మాత్ర మింకొక విధమైన వచనశైలిని బక్కమునకుఁదెచ్చి నన్నయతో సమానుఁడై యున్న వాఁడు. ఈ యిరువురి దాని కంటెఁ దక్కువ యని చెప్పఁదగినదయ్యును,సూరన్న వచనము సామాన్యము గాదు. వాణీ దేవి వ్యాఖ్యానము చక్కెర లొలుకునది.

సరస్వతీ చతుర్ముఖుల సంభాషణలు, చర్యలు, పొగడ్తకు మీఱినవి. అతఁడు దనసతి నెన్నో విధముల కేళీహేళనములఁ దేల్పఁగ, నా మెయునవ్వున డంపఁజాలకున్న నుగినుకనటించుచు వలదు వలదని ప్రార్థించు పద్యములు మనలఁ బరవశులఁ జేయునవి.

## ४. కలభాషిణియొక్క మనోహర చరిత్రము

ఈ కథయందలి పాత్రములపైకి నాకుఁ బ్రియతమ కలభాషిణి నిక్కువమైన శృంగార భావములకుఁ బ్రకాశకురాలు. శాస్త్రకారుల శృంగారమను దయ్య మంతగా సోఁకనిది. జన్మమున వారకాంత. గుణములఁ బ్రబంధనాయికలగు కులస్త్రీలకంటె మేలైనది. ఏకకాలంబున నిరువురి యెడ మనసుదగిలిన దానిఁగా వర్ణించుట కాధారముగాఁ, గవి యీపెను గణికఁ జేసినఁ దప్పులేదని యిట్టిపుట్టుక నారోపించినాఁడో? పరిశీలింపుఁడు. ఎట్లును నీపె నీచపాత్రము గాదు. మఱి మహోదార చరిత్ర. సర్వజన స్తవనీయ. కృష్ణుని కొలువునకు నప్పుడప్పుడు నారదుఁడు వచ్చుచుండ నతనితోడన వచ్చు శిష్యుఁడగు మణికంధరుని సాహిత్య పటిమకు గుణసంపదలకును మెచ్చి వాని యెడ బద్ధానురాగయై యుండియు జాతిదోషంబుచేఁ గాఁబోలు నలకూబరుని రూపలావణ్యాది సౌభాగ్యంబులకు మెచ్చి, తదాలోకనంబునఁ దనియక, వానివిమానంబుతోఁ గొంతదవ్వరిగి, యంత మగిడి, యాతని తెఱం గెఱుంగం గోరి, నారదుం జేరి ప్రార్థింపుడు, నమ్మునియు రంభకు వైరిని నొక్కర్తు నిల్పనెంచినవాఁడు గావున,

"కం. సవతియన నింక నొకతెన్
భువిలోపల వేఱ వెదకఁ బోవలయునె? యో
ధవళాక్షి! నీవ కానే
రవె దైవనియుక్తిఁ గొంత ప్రాప్తి గలిగినన్."

(ఆ. ౧. ప. ౭౩)

అని పల్కుచున్నాఁడు. వినయము, అధైర్యము, దైన్యము మొదలగుభావములతో హృదయపూర్ణమైన వలపుఁ గలసి యుండును. విఱ్ఱవీఁగదు అభీష్టసిద్ధి నిశ్చయమని యుదాసీనతయు గర్వముఁ గాంచదు. దీనికి దృష్టాంతముగఁ గల భాషిణి యిచ్చిన ప్రత్యుత్తరముఁ జూడుఁడు :—

"కం. ... అంతటి రూప
శ్రీవైభవ సతికిఁ గాక సిద్ధించునె యా
దైవనియుక్తియు మాబోం
ట్లే విధమునఁ బాల్పడిన నిద్ధవివేకా!"

(ఆ. ౧. ప. ౭౪)

నారదుఁడు సర్వజ్ఞుఁడు. మణికంధరునికి నాపెపైఁ గోరిక యుండుట నెఱిఁగినవాఁడు గావున, నీ నూతన రాగజ్వాలలో నాప్రాఁత వలపెక్కడ భస్మమగునో యని దానికిఁ బ్రతిక్రియ చేయుటకోయన, "నా శిష్యుఁడు చేసినదండకము చదువు మమ్మా! విందము" అని యామెచేఁ జెప్పించుచున్నాఁడు. అది యట్లుండె. ఈ తరుణియు నారదుని మూలముగ వాంఛితంబు సఫలంబౌనను నుద్దేశముచే, నాతనికి శిష్యురాలుగా నేర్పడి, యతనితో గానవిద్య నభ్యసించెను. నారదుండును గానశిక్షానంతరంబున నిజకళాపాండిత్యముంగూర్చి కృష్ణునికాంతలు మఱుఁగున నేమనుకొనుచున్నారోవినిరమ్మని యాజ్ఞాపించిన, నలకూబరుని గైవసము చేసికొను మంత్రమున కిదియ యవసరమని కలభాషిణియుఁ దనగుట్టు దోఁపనీక,

"తే. నేను మీదాన నగుట మీ గానకథలు
వడిన నవ్వేళఁ గొదవలు దడవ రేమొ!
"సీ. నాకపేక్షితమైన నాతి రూపు దరింప, సామర్థ్యమబ్బిననామగువల
సఖుల రూపముఁ దాల్చి సముచితంబగువేళఁ జని వారి హృద
యంబుఁ గనఁగ వచ్చు."
(ఆ. ౨ ప. ౪౩-౪౪)

అనగా నారదుండును దాను రంభ కిచ్చిన శాపమునకు నిది యనుకూలమని యా వరము నిచ్చెను. నలకూబర దర్శనము మొదలిదివఱకుఁ గడచిన కాలము నాలుగేండ్లు.

పిమ్మట నలకూబరచింతతోఁ బరితపించుచు నొక్కనాఁడు కాలయాపనార్థము వీణియఁ గొని యుద్యానవనములో వాయించుకొనుచుండఁగా, మణిస్తంభుఁడుగానాకర్ణనవ్యాజంబున వచ్చుడు, నతనిసహాయమునఁ గృతార్థతనొందనెంచినదై విన్నవించినది :—

"తే.. ... ... ... మహాత్మ నిన్ను నాపాలి భాగ్య
దేవతగ నమ్మియుంటి నా జీవితంబు
నేమిగాఁ జేసిపోయెద వెఱుఁగఁ జెపుమ!
(ఆ. ౩. ప. ౫౩.)

కం. ఈవేళన యాతనికడ
కే విధమునఁ జేర్చుటింతియ తక్కం
ద్రోవ మఱిలేదు నన్నుం
గావన్ క్షణభంగురములు గొంతల తాల్మల్."
(ఆ. ౩ ప. ౫౫.)

క్షణభంగురము లనుచున్నది, యిన్నాళ్ళు గాచియుం డియు! ఇదియు సహజము. గొప్పవారు తమ గొప్పతనమును దామంతగ నరయరు. అల్పమని యందురు. మఱి దైన్యము హెచ్చుచుఁబోయినఁ బిఱికి పట్టువంటి సాహసము పొడమును. ప్రాణకంటకమగు సంకటము. ఇంకను సిగ్గును, అభిమానమును, మర్యాదను బాటింపనౌనా? కావున నన్యములం దనాదరమై యేమనుచున్నది ?

"సీ. ఓ సిద్ధపురుష ! మీ రే సరణిని గొని
చన్న నేమగుఁ దక్క శంక గలదె
నీమహత్త్వముఁ గానని జడాత్మ లేమన్న
నేమి, కన్నమహాత్మ లించుకయును
వేఱొక్క గతిగ భావింపరు, మముబోంట్ల
సంస్పర్శమాత్రంబు సమ్మతింప
నుచితంబు గాదంటి, రుచితంబె మఱి నాదు
ప్రాణహానికి నోర్చు టరసి చూడఁ
తే. బలుపలుకు లేల యింక నా చెలులు గిలులు
నేగుదెంచి విఘ్న మొనర్తు రితమెఱుఁగక
కావునం గొనిపొమ్ము శీఘ్రంబ నీదు
వెనుక నిడికొని నన్ను మద్విభుని కడకు."

(ఆ. ౩. ప. ౬౧)

వీఁడు కపటసిద్ధుఁడు. ఈ చెలువంపురాశిని మృగేంద్ర వాహనాశక్తికి బలియియ్య నెంచినవాఁడు. "శుద్ధముగాఁగ నీ మనసుశోకము సర్వముఁ బుచ్చివైచెద"నని మిథ్యాప్రత్య యముఁ బలికి, యాపెం బిలిచికొనిపోయి, యమ్మవారి గుడి

యెుద్ద నిలిపి పూజాద్రవ్యములు దేఁబోయెను. అప్పుడుసుము ఖాసక్తి, మిక్కిలియు ముసలిది. వచ్చి సిద్ధుని చరిత్రం బెఱింగి నది గానఁ, బ్రియమును దయయునుదోఁపఁ గలభాషిణింజూచి యిట్లనియె :

"క. ...లతాంగి యెచటనుండి చేరితి వకటా!
కలుషపు బావురుఁ బిల్లిని
జిలుకయుఁ బలె నిద్దురాత్మ సిద్ధుని ననుచున్.

(ఆ. ౩. ప. ౧౪)

క. ఆ కలుషాత్ముఁడు క్రమ్మఱి
రాకమునుపె తొలఁగిపోవ రాదా యెటకే
నోకూన! యీ మనోజ్ఞత
రాకృతి యేఁ జూడఁజాల నసి పాల్గాఁగన్.

(ఆ. ౩. ప. ౧౬)

స్త్రీ సహజమగు రహస్యజ్ఞానవాంఛను నడఁచిపెట్టుట, సుముఖాసక్తియెుక్క వాత్సల్యఘనతను సూచించెడిని. నలకూబరుని సంగమంబుం గాంక్షించి వచ్చిన యాబాలకు నీవృత్తాంత మెంత చింతావహంబుగా నుండదు! తాను ద్వారకాపురిలో ననుభవించిన వైభవమును, దుదకుఁ దనకిట్లు ప్రాప్తించిన పఱు మరణమును దలపోసిదుఃఖితమానసయైతదనంతరంబు డెందంబు డిందుపఱిచికొని, యా వృద్ధురాలితో గద్గదకంఠముగా—

శా. అమ్మా! నీ పలుకెల్ల నెంతయు నిజంబై యిప్డు గాన్పించె, నే
నిమ్మాయావి ప్రకార మిట్లగుట నూహింపంగ లేకొక్క య

ర్థమ్మున్ వీని కృపన్ గడింతునని యత్యంతాశ ప్రేరేపఁగా
నిమ్మాడ్కిన్ దెగివచ్చితిన్ దెరువులే దీపాటుఁ దప్పింపఁగన్. .

(ఆ. ౩ ప. ౯౨)

అని యెట్టకేని నిరాశవలని ధైర్యముం దాల్చినదై.

సీ.

మీఁదట రాఁగలమేలుకీళ్ళెరికిఁదప్పింపరామియెంతయు ధ్రువంబు.

ఆ. ఇంక వాఁడు వచ్చి యేమేమి సేయునో
చచ్చుటెట్లొ యను విచారమునను
బెగడుచుండ నేల జగదంబ యాశక్తి
సేయవలసినట్లు సేయుఁగాక ;

(ప. ౧౦౨)

అనిపల్కుచుండ సిద్దుఁడు క్రమ్మఱి యాపెం డాసి "యిఁక శక్తిం బూజించి పోవుదము రా" యని పిల్వఁగా, నయ్యో పాపము! మరణ మట్లు ప్రత్యక్షభీకరముగా నిల్చిన నెవరికుండి యలు నీరుగావు? గడ్డిపరకనై నశరణ్యమని యూఁతగాఁగొనఁ జూడమా? అట్లగుట నీ బాలభీరువు, దారుణంబుల నెన్నఁడు జూచియైన నెఱుంగనిది, ధృతి నీరైపోఁగా నా వృద్ధాంగనఁ జూచి,

క. "ఏనొంటిఁ బోవ వెఱతున్
లోనికి నోయమ్మ! నీవునున్ రాఁగదె నా
తో" నన "నెవ్వరు నేటికి
నేనుండఁగ" ననుచు సిదుఁ డింతింబలికెన్.

(ఆ. ౩. ప. ౧౧౬)

పలికి, దాని భయచేష్ట భావించి, యింకఁ దడసిన విఘ్నంబగు నని లోనికి బల్మి నీడ్చికొని పోవుట కాక, కన్నెను గొప్పవట్టి యీడ్వఁగా, నప్పుడఁతి,

తే. ......ప్రాణభయమునఁ గలఁగి యో యవ్వ ! నీకు
బిడ్డనే, కావవే నాకు నడ్డపడవె ! యనుచు నావృద్ధనారి మాటు
నకు నొదిఁగె.

సుముఖాసక్తియుఁ దన మెడఁ గత్తి కడ్డము చేసి యామెను గాపాడినది. మృగేంద్రవాహనయుఁ గలభాషిణి శిరోజములు దృఢముష్టిం బట్టి మఱియుఁ బైకి గత్తి నెత్తిన యాసిద్ధు ననతిదూరంబునఁ బడవైచెను. వాఁడు కత్తినిగాని కలభాషిణినిగాని విడువక యఱ్ఱెచని, మాయానలకూబరుఁడు రంభయుఁ ంచుచుండిన భూసామీప్యమున మెత్తని క్రొత్త విరిపాన్పు మీఁదఁ బడెను

తలిరులను దాకినఁ, గాఁక రాకమానునా? సిద్ధత్వ మెటఁ బోయెనో! కామవికార మాదేశమయ్యెను. పాండవ మహిమిం గూర్చి కీచకుఁడు కంపితమానసుఁడైన ఘట్టంబునఁ దిక్కన పాంచాలియొక్క సౌందర్యమునువర్ణించిన యనిర్వాచ్య మాధురీధురీణంబులగు సీసపద్యములం బోనివి యొకటి రెండీసందర్భమునఁ గన్పట్టెడు. రసికులుపోల్చి పరికింతురుగాక!

సీ. అమృతంబు దొలఁకున ట్లమరంగ వెల్వెలఁ
బాఱు ముఖేందు బింబంబుతోడ
బాల కర్ణద్వయీకూలంకషంబులై
తల్లడంబందు నేత్రముల తోడఁ

గడుఁ జెమర్చినయట్టి కలికి లేఁజెక్కుల
సంబెడు విగళత్కచాళితోడ
వలిగుబ్బపాలిండ్లు నిలువ కిట్టట్టు సం
క్షోభించు పయ్యెద కొంగుతోడ

తే. వెఱపు నొకయొజ్జయై వింతవిలసనములఁ
గఱపఁ జూపట్టు సౌందర్య గరిమతోడ
సరభసాకర్షణ క్షోభచకితయైన
మదను జయలక్ష్మి రీతి నమ్మగువ దనర.

(ఆ. ౩. ప. ౧౪౬)

సిద్ధుఁడు చూచినాఁడు. చూచినదే రెండవ మాటలేక పరిరంభణమునకు మొదలిడినాఁడు. ఋషుల రసికత యీ మాత్రమే కదా! సౌమనస్యమున ఋషులకును, బాళియ గాండ్రకును, మృగములకును భేదము శూన్యము. ఆబాలయు నది సైరింపక, రక్షణార్థము పేరెలుంగున నాక్రోశించిన, మాయానలకూబరుండగు మణికంధరుఁడు వచ్చి; తన సింహ నాదము విని పాఱిపోయెడు సిద్ధుని వెంబడించిపట్టుకొని,తిరిగి వచ్చులోపలఁ, గలభాషిణి మునుపు నారదుఁ డిచ్చిన వరప్రభా వంబునం జేసి రంభా రూపంబుదాల్చి, యతని కెదురుగాఁ జను దెంచెను. ఆ శీవిఁ బరికింపుఁడు—— .

సీ. తిరముగా ముడువమి విరియఁబాఱెడు కొప్పు
తోడ్తోడ నొక గేలఁ దుఱిమికొనుచు,
వల్లెవాటుగఁ గొంత వలువ చన్గవ నిల్పి
పెఱచేత నీవి గల్పించి కొనుచు

నుదుటిపై కొక్కిఁ౦త చెదరిన ముంగురుల్
పాపటకును బొందుపఱుచు కొనుచు
సారెకు జారెడు శ్రవణ కల్హారంబు
లందంద మూఁపున నానుకొనుచుఁ

తే. జెమటనంటిన పానుపుఁ జివురుఁ దునుక
లెడనెడ నఖక్షతాశంకఁ దడవికొనుచు
రంభ యేతెంచె మిగుల సంరంభ మమరఁ
దొలుతఁ బ్రియుఁ దేగుదెంచిన త్రోవఁ బట్టి.

(అ. ౩ ప. ౧౫౬)

ఏతెంచి "కేలంగైదువు గీదువేమియును లేకే యిమ్మో యన్ వత్తురే, చాలుంజాలుఁ గరంబు మెచ్చఁదగు నీచందంబు ప్రాణేశ్వరా!"యని ప్రేమయుఁ బతుపాతంబును దోఁపఁ బల్కు భార్యాచందంబునఁ బల్కి, "నీవు నిర్బంధించిన స్త్రీ యెక్కడ? చూపు"మని దట్టించి యాసిద్ధునడుగుచున్న నలకూబరాకారుని దియ్యని మాటలఁ దేర్చి, సిద్ధుని బోవిడుచునట్లు చేసి, యిఁక నిజమైన రంభ వచ్చి యెక్కడఁ గార్యభంగ మొనర్చునో యని శంకించి, యతఁడు బయలువెడలి వచ్చినచోటికి దూరముగాఁ దీసికొని పో నుంకించినదై, యే శంకకు నవకాశమియ్యని యుక్తిగాఁ "దాని మన మింక వెదకుద" మని తాను నతఁడు, సిద్ధుఁడు తొల్త బరుగెత్తిన తెరవునఁ గడుదవ్వుగాఁ జనియె. ఇట్లు కష్టముల నెల్లఁ దరించి యభిమతకేళిం దేలి నాయక సంయోగమహానందయై,

"...లోలత్వంబున నుండ నచ్చటికి నాలోఁ దత్పదశ్రేణిఁ జూ
ప్పాలోకించుచు రంభ వేతొకతె డాయన్ వచ్చెఁ జిత్రంబుగన్."

ఈపెయ యప్సరసయయిన రంభ. "నలకూబర విడు విడురా?" యన్నమాటకు మనస్సు చివుక్కురుమని మణి కంధరుఁడు, తన్నుఁబట్టిన శనివలె వెడలిపోఁగా, హృదయ కాంతుఁడగు నలకూబరుఁ గదిసియుందమని పయనమౌతఱికి, నా మణికంధరుఁడు తనివితీఱని వాఁడగుటఁ జేసి తన తపశ్శక్తి వినియోగించి నలకూబరాకారుఁడై, తనుఁ గలసికొనఁగా గుబేరనందనుఁడేయని భ్రమించి త్రికరణసుఖములననుభవించుచు నీవఱకు నుండినయది. అట్లు నలకూబరుఁ డార్త స్త్రీ ప్రలా పంబు విని తద్రక్షణకై వెళ్ళి, కొంచెమున రాక, చాలకాలము మసలఁగాఁదమిఁబట్టలేక, తామసమునోర్వక, యతని రోయుచు వచ్చి యతనిఁ గన్నులారఁ జూచుటయే కాదు అతనియొద్దఁ దనప్రతిబింబ మనఁదగు నింకొక రంభను గన్నులుబుకునట్లు పొడగన్నది. నలకూబరుఁడును నీ యిరువురం గని విభ్రాంతుఁ డయ్యెను. అయ్యో! కలభాషిణికి వచ్చిన కష్టము! లేక లేక క్లేశపడి సంపాదించిన యర్థము క్షణభంగురమయ్యెడు తెఱం గైన నాదైన్యము చెప్పఁ దీఱునా? ఇఁకపై నీ యిద్దఱు సవతుల కొట్లాట వర్ణింపఁబడియుండు తెఱఁగు వర్ణింపనాతరము గాదు! ఇది యద్భుతావహము! స్త్రీ ప్రకృతికి దర్పణము! ఎన్ని సామెతలు! తిట్లు! తలత్రిప్పులు! తుట్టతుదకుఁ గన్నీ ళ్ళును! కడపట సత్యరంభ, తమ "తథ్యమిథ్యా భావం బేర్ప ఱుప" "రా! దేవసభకుఁ బోవుదము" అని పిలచినది. పాపము! కలభాషిణికి నారదువరమునఁ గామరూపము కలదేకాని, కామ గమనశక్తి లేదాయె. కావున రంభచేతిలోఁ జక్కఁగఁ జిక్కి

నదై చిన్నతనము రాకుండునట్లు, బింకములైనఁ బలికి, త్రోవఁ జూచికొందమను స్త్రీ సహజమైన గరువతనంబు మెఱయ నేమనుచున్నది, చూడుఁడు : —

సీ. అప్సర స్త్రీలలో నగ్రగణ్యత్వంబు
జగదుపశ్లోకితంబుగ వహించి
యూర్వశీ మేనకాద్యుత్తమ స్త్రీలు రా
వమ్మ పోవమ్మ నా నతిశయిల్లి
యెన్నండు నెచ్చోట నెవ్వారిచే వ్రేలఁ
జూపించుకొనక ప్రస్తుతికి నెక్కి
నలకూబరుండు ధన్యతముండు నా, గరు
వతనంబుచే నీకు వన్నెఁదెచ్చి
తే. యొప్పునే యింకఁ గడపట నిప్పుడాచి
నాకు సరిచేసికొని దేవలోకసభకు
నీవు నూ నీవునుమ్మని యే విధమునఁ
గలహ మాడెద నిది నీవె తలఁచి చూడు !

ఆ. ౩. ప. ౨౩౨.)

క. ఈ కలహ మపుడు వినఁబడు
నాకంబున సురల యాననము లేగతి నా
లోకింతుఁ దెగినఁ దెగనీ
నాకు మరుఁడు నిన్ను నిలుమనన్ రాకునికిన్.

(ఆ. ౩ ప. ౨౩౩).

ఇప్పుడేకాదు, ఇఁక ముందును "నీయాన ధరణి విడిచి దివికి నడుగటు పెట్ట" ననుచున్నది. మనుష్యాంగన, పోఁజాలదు. ఈలోపముఁ గప్పిపుచ్చుటకై నేమియుక్తి! సరి;

నలకూబరుఁడు సంశయాత్ముఁడై యాపెను మెడవట్టి ప్రాయం ద్రోసెను. నిర్నిద్ర మోఘఫలమా యిది ? సత్యరంభయు నాయ మను "గత్తిచేతఁ గాయము వాయము" అని శపించెను ఉదార చిత్తులకుఁ గష్టములేకదా ప్రాప్తి !

మనోరథ మొకరీతి ఫలించెనే కాని పరిపక్వమయ్యెననుట నిర్వివాదము గాదు. అయిననేమి ? ఈపె ప్రబంధముల రాచ కన్నెగాదు గావునఁ గొంచెముతోఁ దృప్తి నొందగల కోమల హృదయ ! ఆ కొంచెమునకు మాఱుభేరముగ మరణశాపము వచ్చి పడినను, "ఎట్లును గాంక్షితంబు సిద్ధించె. ఇఁకఁ జావు కలిగిన నేమి ? శక్తి గుడియొద్ద దేహత్యాగం బొనర్చెద" నని యచటికి వచ్చి, యా స్థానంబునఁ దనవలెనే శాపగ్రస్తుఁడైన మణికంధరుఁడును, దేవీ కటాక్షమున ముదిమివీడి కుమారీ రూపంబున విరాజిల్లు సుముఖాసత్తియు, మణిస్తంభుఁడును గుమిఁగూడ, వారు వారు చెప్పిన వృత్తాంతములంబట్టి తన్నుఁ గలసిన యతఁడు కుబేరనందనుండుగామి శోకభరాలస యగుడు, నాపెంజూచి మణికంధరుం డిట్లనియె :

"క. ............తరుణి, యట్లపురూపం
బున నున్న వాఁడ నేఁజుమ్మ......

(ఆ. ౪. ప. ౧౦)

అని పలికి :—

చ. జలజదళాక్షి! యేను ముని శాపభయంబున నెందు నేరికిం
దెలివి పడంగనీక మది ధీరతఁ ద్రిప్పుదుఁగాని నీ పయిం
గలదు సుమీ తలంపు మన గానకళావ్యసనంబు వేళలన్
ఫలమిటు లొందె దానికిని భాగ్యవిశేషవశంబునన్ ముదన్.

(ఆ. ౪. ప. ౧౬)

చ. అనుడుఁ గృతార్థనై తిఁ గుటిలాత్మకుఁ డెవ్వఁడు నన్ను నట్లు వం
చనమునఁ గూడెనో యను విచారము వాసెను నీదుపొందు నా
కు నభిమతంబె, నీకుఁ దగనన్న తలంపున నీ తలంపునేఁ
గనమిని ద్రిప్పుదున్ హృదయకాంక్ష నినున్ గనుఁగొన్న వేళలన్."

(ఆ. ౪ ప. ౧౭

అని చెప్పి, యిక్కడకు "నీకుఁ దగనన్న తలంపు నలకూబరుని యందుంబలెఁ గలదు"—అని తనమాట నమ్మెదురో మొగమోటములని వాపోవుదురో యను శంకంజేసి, గరువము నభిమానముఁ గల కోమలమానస యగుటచే శపథంబులు ప్రమాణంబులు ననుచితంబులని భావించి :—

"ఆ సుద్దుల్ హృదయైక సాక్షికము లేమన్నన్ వృథా యుత్తరిన్."

అని వచించి, నలకూబరునిపై మనసుపోవుటకు గారణ మొండు చూపునదియై ,—

ఉ. ... ... ...సమంచిత తావక రూప రేఖ చూ
ప్పే నొకకొంత గల్గఁ గని యిచ్చఁ గుబేరతనూజఁ గోరితిన్.

(ఆ. ౪. ప. ౨౦)

క. శాపభయంబున నెఱయఁగ
నీపైఁ గోరిక మఱల్చి నిధిపతిసుతు నే
పాపపువేళను జూచితి
నో పయిసొబగేను మఱి గనుంగొన గుఱిగాన్.

(ఆ. ౪. ప. ౨౧)

క. ఆ యక్షతనయుఁడని ని
న్నే యేఁబొందితిఁ దుదన్ పనిన్ మనభాగ్య

శ్రీ యేమని చెప్పుదుఁ బడఁ
బోయినఁ బూఁబొన్నవఁ వడుపోలిక యయ్యెన్.

(ఆ. ౪. ప. ౨౨)

ఉ. శ్రీయుతమైన దివ్యమణి చేతికి నబ్బఁగఁ బాఱవైచి త
చ్ఛాయ యొకింత యున్కిఁగని చాలఁ గృశించితి గాజుపూసకై
నా యవివేక మేమనుకొనం, దుదకమ్మణి యబ్బెనన్న న
త్యాయత తత్సమాగమ సుఖాప్తికి నోఁచమి నెంచి కుందెదన్.

(ఆ. ౪. ప. ౨౩)

ఆ. ఇట్టిమాట లిప్పుడే నాడుకొనుటయు
ననుచితంబ, వారవనిత పలుకు
లిచ్ఛకంబు లనక యెవ్వరు నమ్మెద
రదియుఁగాక దృష్ట మన్యవాంఛ.

(ఆ. ౪. ప. ౨౪)

అని లజ్జాశోకంబు లడర నవనతముఖియైయున్న కలభాషిణికి సమాధానముఁ జెప్పి నిదర్శనముగా సుగాత్రీశాలీనుల చరిత్రంబు వక్కాణించి మణికంధరుం డావెకుందును బోఁగొట్టెను. ఈనిదర్శన మెద్దానికనగా, నొకరిపై ప్రేమయుండినను వా రేదో నొక క్రొత్తరీతి నుండినంగాని మతి సమ్మతింపదను శృంగార న్యాయమునకు! ఇది శృంగార విశేషములకుం జేరిన భావ ప్రకృతి. భార్యయందైనఁగాని, సర్వకాలముల, సర్వావస్థల నేకరీతియగు మక్కువందాల్చిన వారుండరు. ఏదేనొక విలాసము వహించి యొప్పారిరేని తమి తనంతట రేఁగును. మనుష్యులును బలుమూర్తులు గలవారు. అందు హృదయ వికాసముం

గలిగించునవి కొన్ని మాత్రము. మఱియు నొకరి కొక మూర్తిపైఁ బ్రీతి. రేఖలు, లీలలు, విలాసములు, తత్తద్హృదయ సారముల ప్రకారము సుఖదుఃఖావహములగుట వింతగాదు.

అయిన నొక్కటి. పైఁజెప్పిన న్యాయ మేకపురుషు లందును వివిధ కాలముల స్త్రీలకు రాగము మారుచుండుటకు హేతుభూతము. ఒకనియందలి ప్రీతి, వానిమూర్తి ననుసరించి హెచ్చుట, తగ్గుట, తెలిసెను; కాని కలభాషిణివృత్తము వేఱు. ఏకకాలమునందే యిరువురి యెడఁ జిత్తము హత్తినట్లున్నది. ఇది భావ్యమా? మనసు, ఒకేకాలమున సిద్ధఅపై సమముగఁ బాఱునా? అనేకులపై మోహముండుట నిజమా? ఇది కష్టతరమైన ప్రశ్న. మణికంధరునివలచినది. నలకూబరునివలచినది. ఈరీతి నిరువురిమీఁద దుర్భరమోహముంబూనియుండిన యొక స్త్రీని జరిత్రముం జదువుటచే నెఱుంగుదును. ఆపె యెవ్వరన, సుమారు నూఱు సంవత్సరముల క్రింద ఫ్రాన్సుదేశములో గణ్యయు విద్యాగంభీరయుఁగానుండి వెలసిన 'లెస్ వినాస్' అను నామె. కాఁబట్టి యిట్టి వర్తన మస్వాభావిక మనరాదు. అపురూపమనవచ్చును. అపురూప శృంగారముల సూచించిన సూరన్నయే "రవిగాననిచోఁ గాంచెదు కవి."

కలభాషిణియొక్క తదనంతర వృత్తాంత మింకను గౌరవార్హము. తన శాపంబు దలఁచికొని త్వరలో జీవంబు విడుచుటయ కర్తవ్యమని యెంచి సిద్ధునిం జూచి "యింక జాగేల? నీ ఖడ్గ మకుంఠితోద్యోగము, రంభాశాపమును దానికి సహాయకారి. కాన త్వరలోఁగార్యంబుముగించి తత్ఫలంబగుసామ్రాజ్య

సుఖంబు ననుభవింపుమా యని ధృతిమైఁ బలికిన, సిద్ధుఁడు ప్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు. "నా భార్య నిన్ను ప్రేయఁ గూడదని కాళికాదేవిపై నాన పెట్టియుండుటచే మునుపే నలుకఁబోయి యన్నిపాట్లఁ బడితిని. ఇంక నా మాట వలదు. ఈ కత్తిని మణికంధరున కిచ్చెదను. అతఁడు దానిని నీపైఁ బ్రయోగించి రాజ్యలక్ష్మీమహనీయుం డగుఁగాక!" అట్లని మణికంధరుని నతిప్రయాసమైయాక్రూరకర్మమునకు ననుమతుం జేసినఁ గలభాషిణియుఁ గోరికోరి కామించినవరుఁడు విధి ప్రేరణంబునఁ దనకు యముఁడుగాఁగా గాలవైపరీత్యంబునకుఁ జోద్యంబును నప్రమేయశాంతియుం జెంది ధీరభావయై ....

......మణిస్తంభునకుఁ దదంగనకుం బ్రణామంబు సేసి కన్నీళ్లు గ్రుక్కికొనుచు "నీ కలంకపాటు తక్కిన భయమునకుఁ గాదు సుండు మిమ్ము నెప్పుడు గురుభావంబున నారాధింపుచుండ లేమికింగాని" యనుటయును సుముఖాసత్తియు "నో యమ్మ మన నెమ్మనంబుల కూర్మి యింతటన పోయెనే. మీఁదటనైన నీ పతియు నీవుఁ గోరినట్లు మమ్ముగురుభావంబున నడుపుకొన్ని యెద" రనినఁ గలభాషిణి పునఃపునః ప్రణామంబు లాచరించి ముకుళితకరకమల యగుచు నిట్లనియె. (ఆ. ౪. ప. ౧౭౭)

శా. పూతంబైన మదీయ పుణ్యముగమో పుణ్యంపు టిల్లాల నీ
పాతివ్రత్యము చందమున్ విన మదిన్ భావింపగా నెట్టిదు
ర్నీతి ప్రక్రియవారికైనఁ గృపతో నీ విచ్చినం గల్గుఁ దత్
పాతివ్రత్యము నాకు మీఁదనయినం బ్రాపింప దీపింపవే!

(ఆ. ౪. ప. ౧౭౮)

క. నావుడుఁ బరమపతివ్రత
వై వెలయుము రాజ్యవై భవానుభవం బెం
తే వర్తిల్లఁగ నలరుచుఁ
బోవుఁడు మముబోంట్ల నీ విభుండును నీవున్.

(ఆ. ४. ప. ౧౭౯)

ఉ. అట్టిటు సంచలింపకు దృఢాత్మత నుండుమటంచు నిప్పుడే
మిట్టివి నీకుఁ దెల్పునవి యెయ్యవి, పెండ్లికిఁ బోవునట్లు గ
న్పట్టుచు నున్నదాన వతి భవ్యవికాసము నుబ్బుఁజూడ నిన్
గట్టిగ నెన్న దేవతవుగాని నరాంగనవే మృగేక్షణా!

(ఆ. ४. ప ౧౮౦)

చ. అని తనుఁ బల్కు నజ్జలరుహాక్షిని వీడ్కొని సిద్ధవక్త్రమున్
గనుఁగొని నన్ను నంపితిరె ఖడ్గము నిచ్చెదరే యటంచు నా
తని బలుకత్తిఁ బుచ్చుకొని తా మణికంధరు చేతికిచ్చి యో
గ్య నియమ గంధమాల్యవతియై కలభాషిణి నిర్విశంకతోన్.

(ఆ. ४. ప. ౧౮౧)

శక్తికి నభిముఖయై కూర్చుండెను. స్వహస్తముతోఁ గత్తి నిచ్చుటేల? ప్రియునకు మనస్సంకోచము వాయుట కొఱకు. సత్యమైన వలపునకు లక్షణ మిదియ. తమ కెన్ని వచ్చిన నేమి? ప్రియులు సుఖంబున్నఁ జాలు. ఖడ్గప్రదానా నంతర మతని మనసు గట్టిపడునట్లుగా

క. సమరంబున నెదిరించిన
సమదాహిత వీరవరులఁ జక్కడఁచుట, నై
జము మీకు నెట్టియెడలన్
భ్రమయక చేమఱవకునికి పటుశౌర్యమునన్.

(ఆ. ४. ప. ౧౮४)

అని తెలిపి కలభాషిణీదేవియతనిచేతనిర స్తజీవయాయె!

ఈ పాత్రముఁగూర్చి యింత విపులముగ వ్రాసినందుకు క్షమాపణార్థమై కారణములఁ జూపవలయు సూరనార్యుని వాఙ్మయ సృష్టినెల్ల నియ్యది నిస్సంశయముగ నగ్రగణ్యము. దీనికిం దీటగు చరిత్ర మింకెయ్యదియు లేదు. శృంగారవర్ణనముం జేయుటలోఁ బ్రబంధముల వెఱ్ఱిలేవియు వేయలేదు. నలకూబరునికై నాలుగేండ్లకంటె నెక్కువగఁగాచియుండెఁగదా! ఇష్టముండినఁ, జెలికత్తెలతో మొఱలిడుట, ఉద్యానవనములోఁబడి పొరలుట, చంద్రాది దూషణము—ఇట్టి వికార చేష్టలన్నియుఁ జేసినట్లు చెప్పియుండవచ్చును. కాని, కవియీవిషయములఁ దలఁపనైన లేదని తోఁచుచున్నది. భావనాశక్తిమై వ్రాయువారలకు మనసు పాత్రములయంద లీనముగనుండుఁ గావున సహజరాగములు దప్ప నితరములు దట్టవు. మఱియు నీ శాస్త్రీయ ఘోషలకు మధురలాలసా చరిత్రములోఁ బ్రవేశమున్నది గాన నిట ననవసరములని కవి వానిని విడిచిపెట్టెనేమో! కారణము లేయేటనైనఁ బోనిండు, మనకు లభించినదన్నినో మనసు వశముగాక పోవునంత రమణీయమైన కథ. కవికిఁ గృతజ్ఞతమై నమస్కారము, రసికులకు స్వాగతమును.

ఇంత మంచి సుందరమగు పాత్రవర్ణనము శోకాంతముగాఁ జెప్పుట కిష్టము లేమిచేతనో, మఱి, మన కవులకుఁ బట్టిన దౌర్భాగ్యమతంబుకతంబుననో మణికంధరఖండితమస్తకయగు నా లలనా శిరోమణి కాళికాదేవి కరుణాప్రసాదంబున "పునస్సహిత మస్తకయు నిజపురీవర్తినియునై తన బంధు

మిత్రాదుల నలరించుచు" సుమారు రెండు సంవత్సరము లుండి పిమ్మటఁ గాలప్రాప్తమరణయాయెనని కరుణరస ప్రధానమగు నీ భాగముయొక్క సొంపును గవి వికలం బొనర్చియుండుట భాషాదుర్దశ గదా ? రసములలో శోకము నొక్కటి. ఇది మాత్రము నిషేధ్య మననేల ? శోక ప్రధానముగా వ్రాసినఁ గవిత్వము మొక్కపోవునా ? మొత్తము మీఁద భారతమే శోకాంతమంట ! దానికి రాని తక్కువ పెఱవానికి వచ్చునా?

ఇట్టి యుద్గ్రంథమునఁ గల్పనాభంగము లుండుట చింతనీయము ! కృష్ణుని భార్యలయొద్ద కలభాషిణీ నారదులు గానవిద్య నేర్చుకొనుటకై కడపిన కాలము నాలుగేండ్లు. మణికంధరుఁ డంతఃపురములోనికి బోఁగూడదని యేమో వానికీప్రయాస మావంతయు లేకయ "పుండరీకాక్షునియనుగ్రహ విశేషంబున సకల రహస్య సంగీత విద్యా సంపన్నత చేత నారద కలభాషిణుల యట్ల యత్యధికుండగు" భాగ్యము లభించినది ఈ యనుగ్రహ విశేషముఁ బ్రయోగించి, వారికిని సద్యః కాల విద్యామహనీయత ఘటించి కలభాషిణీ విరహకాలమును మట్టు చేసి యుండరాదా? కృష్ణకాంతల శిక్షయనావశ్యకమాయె దానితోఁ గల్పనయు న్యూనమాయె.

ఇట్లే మధురలాలసా చరిత్రము మొదలు తక్కిన భాగములలోఁ గల్పనా లోపములు పెక్కులు గలవు. ఇందుఁ గవి శృంగారమునకు దిగి పాడు ప్రబంధధోరణికిం జెందిన ముఱికినంతయు సుగంధమని దట్టముగఁ బట్టించుచున్నాఁడు. గతానుగతికముగా వ్రాయుచున్నాఁడే కాని స్వబుద్ధిపొంతఁ బోవు

నట్లు కానము. భావములు రమ్యములు గావు; రుచిరములు గావు. పాట ప్రాంత; మాట రోంత. మధురలాలస చిన్న నాఁటినుండికళాపూర్ణునిపై మోహోద్రేకముఁగొనియుండుట, ఆకస్మికముగా నిరువురకుఁ బరస్పర దర్శనము లభించుట, ఉద్యానవనగమనము, జలక్రీడాదులు, శైత్యోపచారములు, చంద్రాదిదూషణము, వివాహము, సాంగోపాంగరతివర్ణనము మొదలగునవన్నియు ఉణానుసారముగాఁ బొందింపఁబడినవి. నిష్కారణముగా సూర్య చంద్రోదయవర్ణనములు, కళాపూర్ణుని దిగ్విజయము, యుద్ధ, దౌత్యము మొదలగువానిని గూడ వర్ణించి కవి సకల లక్షణసంపన్నతా ప్రతిజ్ఞను జెల్లించుకొను చున్నాఁడు. ఆ ప్రతిజ్ఞ దుష్ప్రకృతి యిటఁదేటతెల్లము. సంభాషణమూలమునఁ గథకు నభ్యుదయము గల్పించుట మొదలగు కవితాశక్తులన్నియు నీఘట్టమునకు వచ్చుసరికి సూరన్నలో నుండక లేచిపోయినట్లున్నది. ప్రతిభలేని పాడుకొంప లీ భాగములు. నిరర్థక పద్యపూరితములు! అలంకారాది శాస్త్రముల యందలి మూఢభక్తి పటుతమము!

భావనాశక్తిచే ననర్ఘళముగఁ బ్రభవిల్లుభాగములయొక్క చక్కఁదనము పాండిత్యబలంబుమై నేర్పడినవానికి రాదనుట యీ భాగ విమర్శనముచే విదితంబు. సూరనార్యుఁడు రెంటి యందును బ్రగల్భుఁడు. రెంటినిఁ జూపింప నిశ్చయించినవాఁ డగుట నాంధ్రంబున నసదృశంబగు కావ్యంబు కళాపూర్ణోద యంబు సృజింపఁబడియె. ఇది నిర్దోషంబు గాకపోయినను అనన్యసాధారణ గుణగణవిభాసితంబగుటఁ గావ్యోత్తమంబనఁ

జెల్లునది. ఇందు నవరసములున్నవి. అష్టాదశ వర్ణనము లున్నవి ఏకరసంబుగాకునికి మేల. అయినను సర్వరసముల వర్ణనలఁ జేర్చి యొక కథ వ్రాయఁజూచుట యసాధ్యము గాకపోయినను సామాన్య సాధ్యంబుగాదు. భారత రామాయణములట్టివిస్తారేతి హాసములం దప్ప నన్యంబులసర్వసౌభాగ్యములకు నాస్పదంబుం డదు. అపార పారావారంబుంబోని మహాచరిత్రముఁ గల్పించి నఁగాని, రస సంచయములెల్ల నందు యుక్తిగతిని నిలుపఁ జాలవు. అట్లగుట నీ గ్రంథమున నసంగత ప్రశంసల వేయవల సెను. అపర భాగము ప్రబంధములకుఁ జేరినది. పరిమిత ప్రాశ స్త్యము. పూర్వభాగ మప్రమేయ ప్రభావము. దానిని గూర్చి యెంత నుతించిన నత్యుక్తి గలుగదు. అందలి కల్పనలు, సంద ర్భములు మహేంద్రజాలముల ట్లాచార్యకరములు. శైలిప్రాపీ ణ్యమన్ననో వాచాతీతము ! మోనముగఁ గ్రోలి హృదయము పరవశముగా నానందింపవలయునే కాని, మాటల దమి యాఱదు. పాత్రముల వచనములు మధుర సుధాధారలు ! ..

అట్లగుట శ్రీ పింగళి సూరనార్యుని యెడఁగృతజ్ఞతయు భక్తియుఁ జూపనెంచిన వారును, సహజముగఁ దమకుంగల రసతృష్ణను దృప్తినొందింపఁ దలంచువారును నైన రసికులెల్లరు నీకవికులోత్తంసుని కృతులఁ బలుమాఱు పఠించి కృతార్థు లగుదురు గాక !

# సర్వేపల్లి రాధాకృష్ణ పండితుఁడు

—శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

## 1

### రాధాకృష్ణుఁడు కళోపాసకుఁడు

గగనచుంబి తుషారాద్రిని తిలకించినపుడు హృదయము గురు గంభీర భావ పూరితమగును. నక్షత్రఖచిత వియత్తలమును విలోకించినపుడు ఆత్మ ఆనందించును. ఉత్తాలతరంగసంకుల సింధువును కాంచినపుడు తలపుకరళ్ళు మనస్సునం దువ్వెత్తుగ నుప్పొంగును. ఆత్మ హృదినుండి హృదీశ్వరియట్లు అనురాగ సౌరభమును వెలార్చు కుసుమమును కన్గొనినపుడు "హాయి హాయి!" యనుచు మానస ముఘ్యూతలూగును. తీపితుంపరలు కురిపించు గీతిక చెవిఁ బడినపుడు పరితోషవీచికలందు అంత రంగము మున్కలేయును. కన్నెదుట కళ నిలిచినపుడు పిడు గులు మీఁద దుళ్లిపడుచున్నను, పరమహంసలట్లు నృత్యము సలుపుదుము. బృందావనవిహారి మధురమంజుల వంశీరవమట్లు సుధాబంధుర భావధారను వెడలించు రాధాకృష్ణునిసమక్షమున నిలుచునపుడు ఆత్మ విస్మృతులమై సచ్చిదానందములం దోల లాడుదుము.

కళ ఆత్మనుండి వెడలును. ఆత్మయందలి బ్రహ్మానందము కళనుండిజాలువారును. కళయందలిమహత్త్వమును గుర్తించు

వారు, కళయందలి సౌందర్య మాధుర్యములను జుర్రిఁగలుగు వారు రాధాకృష్ణుని హృదయమందలి బృందావన శోభను కనులారఁ గాంచెదరు. స్వర్గమర్త్యములను, జీవాత్మపరమాత్మలను కలుపునది కళయనియు, మనుష్య దృష్టియందలి పరమాశయముల నరచేత నిడునది కళయనియు అధునాతనవసుంధరకు తెలుపఁగలిగినమహావ్యక్తులిర్వురే! వీరిలో రాధాకృష్ణుఁడొకఁడు. రెండవయాతఁ డీతని యంతరంగమిత్రుఁడు పృథుకవీంద్రుఁడు రవీంద్రుఁడు.

దివ్యపృథ్వియం దేకడనుండియో తరలి యుగయుగములందు ఒక్కొక్క మానవహృదయమున కళ తన చిత్ర కుంజమును నిర్మించుకొనును. దీని జన్మస్థలమును చూపుభూగోళము మనుష్యమేధస్సునందు లేదని మనీషు లెఱుగుదురు. సూనగర్భమున నడగి, సమీరస్పర్శవలన గుప్పున సుమ్వాంగునెత్తావియట్లు, గాయకుని వ్రేలితాకుడున వీణాతంత్రినుండి అల్లన శిరమెత్తు స్వాదుశబ్దము క్రైవడి, తరణికిరణచుంబనమున కమలహృదిగల హాసనమట్లై ఆననమున తళ్కొత్తులీల, విశ్వపతిసంశ్లేషమున రాగ సందీప్త హృదయమును విదల్చు సంధ్యాసీమంతినిపగిది, ఆత్మనందనమున పచ్చని చిగుళ్లయం దెందో పవ్వళించియున్న దివ్యభావము కళోపాసకుని స్మృతి స్పర్శయందు గిలిగింతనంది, స్మిత హృదయయై, ఆతనిదనిపి, వానివాగ్వల్లీదోలికయం దూఁగాడి, ఆతని రచన తల్పమున జేరుకొనును. ఈ భావము గంధర్వాంగన బోలునది. ఇది భారత హాద్ర్యయోద్యానమ్ముందే వెలయును. బహురూపముల నిది గోచరింపఁ

జాలును. నేఁడిది శమంతకమట్లు రవీంద్రుని యెడందయందు వెలుగొందినది. కౌస్తుభమణికరణి రాధాకృష్ణుని హృదయ మందును వెలుగొందుచున్నది.

భావసుందరిఅమరవిభూతిని కనినపాశ్చాత్యులు మిగుల నరుదుగ నున్నారు. వీరు ప్రాచీవిజ్ఞానకల్హారమునగ్రుంకులిడిన మానసౌకములు. వీరొకప్పుడు మనియుండిరి. సైన్స్‌మయమై యున్న నేఁటి ప్రతీచీఖండమున వీరు లేరు. యశస్తికులైన పాశ్చాత్య రచయితలు నేఁ డెందఱో ఉండుట నిక్కమే! కాని వీరి కాధ్యాత్మికదృష్టి లేదు. కేవలము యోజనపై వీ రాధారపడెదరు. పరిమితిగల ప్రత్యక్ష ప్రపంచానుభవమే వీరి భావఖని. ఆత్మప్రదీపకళిక వీరికి ప్రత్యక్షము కాలేదు కావున సమ్యగ్ జ్ఞానము వీరికి దూరస్థమై, దురూహ్యమై యుండును. సాహితీ సామ్రాజ్యమున నిలిచి, దివ్యైశ్వర్యమును నేఁడు పృథ్వీజనుల దోసిళ్ళఁబోసిన ప్రతిభావంతులు రవీంద్ర రాధాకృష్ణులే! రవీంద్రుఁడు తాత్త్వికదృష్టిగల కవి; రాధాకృష్ణుఁడు కవితా దృష్టిగల తాత్త్వికుఁడు. కావున నీతని ప్లేటోతో పోల్చవచ్చును. వీరిహృదయము లొక్కండే! వీరు దివ్యదృష్టిగల కళోపాసకులు. ప్రాచీప్రతీచీఖండముల నేలు విజ్ఞాన చక్రవర్తులై, జగద్గురువులై వసుమతీశాంతిపై రవి రాధాకృష్ణులు మనసులు నిలిపిరి.

సహజశక్తికి సముచితపఠనము దోహదమైనపుడే అది కల్పద్రుమమట్లు పెరిగి, అనంతకాలమున శాఖోపశాఖలను వ్యాపింపజేయును. గభీరపఠనమును, అంతరంగిక శక్తియు

లేని రచయితలు కుండలములను దాల్చినను, శాల్వలను గప్పి కొనినను, వీరి శరీరములను బూడెదచేయు వేఁడినిప్పులు శరీరములపై వ్రేలాడు నీసరుకునుకూడ బూడిదచేసి వదలును. మనుష్య శక్తియందలి సత్యాసత్యములను నిర్దిష్ట మొనరించునది కాలము. దీనికి మోమోటము లేదు. నిష్ఠురత లేదు. ఇది కనుపొరలను చించును. చీఁకటిని చీల్చును. అసత్యమును చెండాడి సత్యమును నిలుపును. ప్రతిభాశాలి కిది అమృతముతో అభ్యంగ మొనరించి ఆతనికి చరణాశ్రితదాసియై యుండును. ప్రకృతికి ఆయువు వోసి, ప్రకృతిని కళాప్రదీప్తముచేయు ఆలోకహిల్లోలములట్లు ఆధ్యాత్మిక భావములు మనుష్యశక్తిని సోఁకినపుడే అది చిరంజీవియై చిరప్రభాకలితమై వెలుగొందును. ఇది కల్పమువంటి దంటినికదా! కల్పకశాఖల నుండి శీతలవాతూలము వెడలదా? అది తేజఃపూరిత స్వర్గమృత్తికయందు,— సారవంతమైన హృదయకేదారమందు బుట్టినదగుడు కడుంగడు రమ్యమై మధురఫలవిలసితమై యొప్పును. సహజశక్తి సమన్వితమైన రాధాకృష్ణుని హృదయము రవికవి హృదయమట్లు రమ్యమై చక్కనై, శాంతిమయమైనది కాదా? ఈతని హృదయస్థ దివ్యధరాజమున జనించిన స్వాదుఫలములగుడు, ఈతని భావములు జగతికి దివ్యాహారము నొసగునవియై యున్నవి. ఈ ఫలములందలి రసమున మనసుంచి, చందురుని చూచినంతన చివాలున చదలునకెగయు చకోరము చందమున, మేఘసందర్శనమున వేయికన్నుల పింఛమెత్తి నాట్యమాడు నెమలిలీల రసహృదయులు లావేశభరితులై, దానిని క్రోల్చి, భావపక్షవిత్తే

పము స నీతని రచనావిహాయసమున నెగసి అపూర్వాద్భుత దృశ్యము లెన్నిటినో కాంచి కులుకుచుందురు.

రవీంద్ర రాధాకృష్ణులను కొంతదనుక నేను జోడించుటకు కారణము లేకపోలేదని చదువరు లూహించియుందురు. కవి సృష్టిశక్తిగలవాఁడు. వట్టితాత్త్వికుఁడు భాష్యకారుఁడే! ఇతఁడు మానవుఁడే; అతఁడు బ్రహ్మ! రాధాకృష్ణుఁడు వట్టి తాత్త్వికుఁడుకాక, సాధారణమానవుఁడుకాక కవివగిది సృష్టికర్తయని తెలుపుట నా యాశయము. ఇట్లని ఋజువుచేయుట నా తొలుతటి కర్తవ్యము.

సహజశక్తియందే సృష్టిశక్తియుండును; దీని కెంతేని స్వాతంత్ర్యము కలదు. ఇది గల వ్యక్తి ఒక మాతృక చేఁబట్టి ముక్కుదారములకు లొంగి, అది చెప్పినట్లు ప్రవర్తింపఁడు. రాధాకృష్ణుని గభీరపఠనము ఆతని హృదయమం దడగిన సహజశక్తిని విజృంభింపఁ జేసినది. ఆలోక వాతూలములను క్రోలు పూవు వికాసమున నొప్పారును. ఈ వికసన మెరువుసొమ్ము కాదు. ప్రాచీప్రతీచీవిజ్ఞానములను దిగమ్రింగిన రాధాకృష్ణుఁడు తన వాక్కులందు వ్యక్తపఱచిన నవనవోన్మేష భావములు ఎరువు సొమ్ములు కావు. ఈతని వాక్కులు ఈతని ఆత్మనుండి వెడలును. కావున నివి గభీర భావవిలసితములై, సౌందర్యసందీప్తములై యీతని సహజ సామర్థ్యమును వ్యక్తీకరించును.

కవిభావములు మనశ్చక్షుస్సమక్షమున చక్కనైన రూపులు నిలుపును. పఠితమనసు నాలోకముచే, నాశచే నింపును. ఆతనికి నవజీవన మొసఁగును. చెప్ప నేల? పునర్జన్మ

నిచ్చును. అసాధారణ కవితా సంపదగల రాధాకృష్ణుఁడు తన సాహితీజీవితమున తొలుత చక్కని.నవల వ్రాసినాఁడు. నాఁడీతనికి తత్త్వశాస్త్రమును ప్రబోధింపవలసిన అధ్యాపకపదవి లభింపకున్న యెడల, నిరుద్యోగియై కొంతదనుక నిలిచి కేవల సాహిత్యోపాసనమునకు దివ్యదృష్టిగల తన కలమును నియోగించి, నేఁడు నోబుల్ ప్రైజ్ నందియుండును .తాను ప్రబోధించు విషయమందే ఈతఁడు తన సర్వశక్తులను పదంపడి కేంద్రీకరించినాఁడు.తన నవలను ప్రచురింపక. ఒక మనశ్శాస్త్ర గ్రంథము వ్రాసినాడు. ఈతని తొలుతటి యత్నమున నుద్భవించినధగుడు. అది సభ్యపృథ్వీదృష్టి నాకర్షించినది కాదు. షేక్స్పియరు మహాకవిప్రజ్ఞ Comedy of Errors మున్నగు ముందటిగ్రంథములం దచ్చటచ్చట మేఘముల మఱుఁగునుండి వెడలు రవిరశ్మి కై వడి కాంతిలినలీల, రాధాకృష్ణుని ప్రథమ గ్రంథమున భాస్వన్మరీచిక లందందు తళ్కొత్తినవి. ఈతని యంతరంగమున బ్రహ్మాండ మిమిడియున్నదని ఈతని గనిన, ఈతఁడు తొలుత సేవించిన, విశ్వవిద్యాలయము గుర్తింపలేదు. ఈతని హృదయమున నఖండజ్యోతి వెలుగుచున్నదని రవీంద్రుఁడు తొలుత గుర్తించినాఁడు. ఈ జ్యోతిని కాంచి ఆఘుతోషు అనురాగతైలధారచే దీనినిమఱింతజ్వలింపజేసినాఁడు. ప్రజ్ఞాప్రతిభలు కనులెదుటఁదోచుతఱి నతమస్తకులగుటకు సంశయింపని ప్రతీచీవాసు లీజ్యోతి మ్రోల సాగిలబడిరి. "ఓహో! మనవాఁడని" మనతెల్గులు కొందఱు ఒకమాఱు చప్పట్లు చఱచిరి. ఈతఁడు మహాద్భుత శక్తిగల కళోపాసకుఁడని నేఁడు కూడ వీరు గుర్తింపలేదేమో!

రాధాకృష్ణుని రచనములను పుంఖానుపుంఖముగ పరికించితిమేని, అవి తాత్త్వికార్థము గల కవితాలేఖనములని గ్రహింపఁగలము. విచిత్ర రూపురేఖావిలసితములైన విశ్వ దృశ్యము లన్నింటిని కొలఁది మాటలచే పరిత మానసయవనికపై తళ్కొత్తించుశక్తి రాధాకృష్ణునకు కలదు. ఈతని రచనము ఒక్కొకపుడు కిరణశాబకముల కాటపందిరైన పొదుపుఁ గొండ యనిపించును. ఇంకొకపుడు శారదశర్వరివిడియు దివ్య కుంజ మనిపించును. వేఱొకప్పుడు విద్యుల్లతాంగులఖేలనాంగణ మనిపించును. సాధారణ సంభాషణమందుఁ గూడ నీతఁడు వాడువాక్కులు వజ్రపుదున్కల ట్లుండును.

బండరాళ్ళయందుఁ గూడ బోధామృతమును, సుందర భావమును కనుగొనుట కవి పని. ఈ పనియందు వర్డ్సువర్త్ కవి మిగుల నాటితేటినాఁడు. తత్త్వశాస్త్రములోని బండతలఁపులకు దివ్యసౌందర్య మొసఁగు కవి రాధాకృష్ణుఁడు. తాత్త్వికోపన్యాసములనుండి పదియామడలు పర్వెత్తు పాశ్చాత్యులే ఈతని పల్కులు వినుటకై ఉవ్విళ్లూరుటకు కారణమని జగన్మోహినియట్లు "దరహాసచంద్రికలఁ జిలికించు"న వగుటయే! జగన్మోహినియైన భావము యెట్టి యద్భుతములను పుట్టింపదు! సౌందర్య మెట్టి గురుగంభీరకార్యములను చేయింపదు! ఎదుట నొక సుందరాననమును చూచి, ఆవేశ పూరిత హృదయులై యోధు లెన్నె నియద్భుతములను నెఱపెడివారని ప్రాచీప్రతీచీ సారస్వతములు తెలుపుచుంటలేదా? తన స్వర్ణ మయూఖములనుండి సౌందర్యరాశిని కుమ్మరించియేకదా ప్రభాకరుఁడు

నూతనజీవమును సృష్టించును! సౌందర్య మండిత దృశ్యములను విలోకించియేకదా భావోద్వేగ పూరితహృదయుఁడై కవి, ఒక్కొక అక్కరమం దొక్కొకభువనమును జేర్చును! సౌందర్య ప్రదీప్తమైన రాధాకృష్ణుని రచనము ప్రాచీన భారతరమణి యట్లు ఉత్తమాశయనిధానమై వెలుగొందుచుండును. యోచ నానుభవ సంకల్పములు (Thinking, Feeling and Willing) మూఁడింటినికూడ తనిపి, సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడును.

సృష్టికర్త మనుష్యవాక్కులను నిమిత్త మాత్రములు కావించుకొని తన భావములను వ్యక్తీకరించును. ఈవాక్కులు మహాకవివి కావచ్చును; మహాభక్తునివి కావచ్చును; మహర్షివి కావచ్చును. దివ్యభావనావేశముగల వ్యక్తి ముఖమునుండియే యివి వెల్వడును. సృష్టికర్త కళోపాసకుఁడని రాధాకృష్ణుఁడే పలికినాఁడు.

కళోపాసకుని హృద్వీణను మీటి మధురరవము లేపు వాఁడు సృష్టికర్త. పద్యమనుడు, గద్యమనుడు హృదయసము ద్భూతము; మంజులభావ సమన్వితము; మహిమోపేతము. రాధాకృష్ణునిఉపన్యాసములు వినునపుడును, రచనలనుచదువు నపుడును మగయాత్మలు పరమహంసలట్లు నృత్యముచేయును. నృత్యగతి ఆత్మనుండియే వెడలును. ఆధ్యాత్మికశక్తిసోకినపుడే విహంగమట్లు ఆత్మ లేచును. ప్రతికూల రవములు లేపుచు హృదయమందిరమున కొండొక దుర్భావము ప్రవేశించెనేని, కన్నెదుట గల దాని కదృశ్యమై యుండును. శ్రోతల యాత్మలను, పతితల యాత్మలను ఉద్ఘాతలూపు వాక్కు

అద్భుతమైన యాత్మశక్తినుండి వెడలుననుట నిస్సంశయము. జడపదార్థములచే గంతులు వేయించుశక్తి రాధాకృష్ణునకు కలదు! మానవకోటిని మంత్రముగ్ధ మొనరింపగల శక్తి రాధాకృష్ణునకు కలదు!! విషాక్త వాతూలమును తటిమి మధుమయ మలయ హిల్లోలమును లేపు మహితభావశక్తి రాధాకృష్ణునకు కలదు!!! నిష్ఠుర హృదయములనుకూడ పులకితాత్ముల గావించి రసమగ్నుల జేయగలశక్తి రాధాకృష్ణునకు కలదు!!!! రాధాకృష్ణుని శక్తి ఈతని హృదయ బృందావన మందలి రాధాకృష్ణునిది కాదా ?

పూవును తావియునువలె కళయును తాత్త్వికభావమును అవినాభావ సంబంధము గలవని బహుయుగములకు మున్నె భారతీయులు గుర్తించిరి. పాశ్చాత్య తాత్త్వికులు కొందఱు వ్యతిరేక భావమును వ్యక్తీకరించినను, ఆంగ్ల సాహితియందలి ఆదర్శ రచయితలు పెక్కుమంది భారత సంప్రదాయమందలి మహత్త్వమును, సత్యమును గుర్తింప గలిగిరి.

తలపోతకందని అద్భుతమైన ఆంతరంగికశక్తి యొకటి కళకును, తాత్త్విక మతభావములకును పుట్టినిల్లు. సత్యమునకును, సౌందర్యమునకును ఈ శక్తి కేంద్రస్థానము. అమృతాంశువునుండి వెడలు చల్లందనమునకును, ఆలోకమునకునుం గల కలయికవలె నాంతరంగిక శక్తి సముద్భవ కళావిభూతికిని తాత్త్విక విభవమునకును,ఇందునుఅందును, వెలయు సౌందర్య సత్యములకును చక్కని పొందు కలదు. కవలపూలకు తల్లియైన

కొమ్మయట్లు ఈ యుత్తమాశయములకు మాతయైన అధ్యాత్మాంతరంగికశక్తినే ప్రేరణ (Intuition) అనికళోపాసకులును, తాత్త్వికులును ఉల్లేఖింతురు.

తాను తెలిసికొనవలసినది, చేయవలసినది, ఆశింపవలసినది ఎద్దియని తాత్త్వికుఁడు ప్రశ్నించుకొనవలెనని ఒక సుప్రసిద్ధ పాశ్చాత్య తత్త్వవేత్త పలికినాఁడు. కాని ప్రతీచీతాత్త్వికులు సాధారణముగా తొలుతటి ప్రశ్నకే తమదృష్టి నప్పగింతురు. గతభావవృద్ధిని హృదయంగమ మొనరించుకొందురు. వీరిదృష్టి విహంగమట్లు భావనభమున రివ్వురివ్వున నెగయదు. రాధాకృష్ణుఁడు ఈవర్గపు తాత్త్వికులందుచేరఁడు కవిదృష్టివలె ప్రవక్త దృష్టివలె ఈతనిచూడ్కి ఆశాలోక సందీప్తమై నూతన సృష్టిని, ఆదర్శ స్థితిని సోఁకుచుండును. వివిధ మహాసభలందీతఁడు పల్కిన వాక్కు లిందులకు తార్కాణములు. తాత్త్వికుఁడు వెన్కకేకాక ముంగలకుకూడ చూడవలెనని అంతర్జాతీయ తాత్త్విక మహాసభయం దీతఁడు తేటతెల్లముగఁ దెలిపెను. మనుష్య హృదయమున ఉత్సాహమును, ఆశనుబుట్టింపనెంచు రాధాకృష్ణుఁడు విశ్వమంతయు అనురాగ ప్లావితమై యున్నదని పలుకుచుండును. అద్వైత సిద్ధాంతమందును, జగదీశుని యందును ఈతని కెంతేని విశ్వాస మున్నది.

కవిపంచాస్యునివలె రాధాకృష్ణుఁడు భూతల స్వర్గమును కాంక్షించినాఁడు. మానవులందు ప్రస్తుతము తలసూపిన చెడుగులను చూపి, వసుంధరదృష్టి నుండవలయు. శాంతిసహకారాది ఉత్తమాశయములను గుఱించి ఈతఁడును, రవీంద్రుఁ

డును వాకొనిన నుడువులం దెంతో పోలిక కలదు. ప్రపంచ హృదయమును రాబందులట్లు పొడుచుకొని తినుచున్న దుర్భావములు కడ తేఱినగాని వసుంధరయందు శాంతి నెల కొన జాలదని కొందఱు బుద్ధిమంతులు గ్రహించిరి. ఈ దుర్భావములను తఱుము సద్భావములును, సదాశయములును తాత్త్వికుల హృదయములనుండియు, కవులమనసులనుండియు, భక్తుల యెడందలనుండియు వెడలునని వీ రెఱుంగుదురు. ఈ యంశమునుదృష్టియందిడికొని యే "ప్రపంచశాంతిని కాంక్షించు అంతర్జాతీయ మహాసభయందు పల్వురు భౌతిక శాస్త్రజ్ఞు లున్నారు. ఇపుడు మీవంటి తాత్త్వికుఁడా సభయందు ప్రవేశ మందుట మా యాశయ" మని ఆనాఁటిమనపాలకులు రాధా కృష్ణుని జినీవాకు పుత్తెంచినారు.

## రాధాకృష్ణుఁడు మహావిజ్ఞాని

హృదయశక్తి మేధాశక్తులు రెండును సరిసమముగ నెవ్వనియందోగాని విజృంభింపవు. ఇట్టి సమత్వశక్తి నేఁటి తాత్త్వక వసుంధరయందు ఒక్క రాధాకృష్ణునకే కలదు. ఈ ప్రత్యేకాధిక్యము ఈతని విజ్ఞానజీవితమున చిత్ర విచిత్రములను పుట్టించుచున్నది.

అద్వితీయపాండితి నీతని కిచ్చినది ఈతని మెదడు. దీని కందని విషయ మెద్దియు లేదు. ఇట్టి మేధాశక్తి గల రెండవ మనుష్యుఁడును ఆంధ్రుఁడే!—అతఁడు విశ్వేశ్వరయ్య! రాధా

కృష్ణుఁడు గుట్టలకొలఁది గ్రంథములనుదిగమ్రింగినాఁడు. కాని యాతఁడు కండబెంచుకొనిన భోక్త కాఁడు. ఈతఁడు నమలి మ్రింగిన గ్రంథములు ఈతని ఒంటబట్టి ఈతని బుద్ధిని నిశితమొన రించినవి. రాధాకృష్ణుని గ్రహణశక్తి అత్యద్భుతము. పల్వు రేండ్లను పూండ్లను కడపి, మనసున కెక్కించుకొను విషయము లను వేగవంతమైన ఒక్కచూడ్కియం దీతఁడు గ్రహింపగలఁడు. భావగ్రహణమందలి వేగము వ్యక్తీకరణమందుఁగూడ నీతనికిఁ గలదు. నిభృతపఠనమందిరమున బహువర్షములు తపించి నిహిత మానసికశక్తిని రేకెత్తించి, తాను తలఁపని, తానెఱుఁగని ప్రజ్ఞను తనయందే యావేశభరముహూర్తమందో గుర్తించి, ఇతఁడు ముందంజ వేయఁ గడంగినాఁడు. కనులుమూసి ఒక్కపరి ఆత్మపరిశీలన మొనరించుకొని, బహుజన్మసంచితకృషి ఫలితముల నందుండి లేవందిసి, చేఁబట్టి అగ్రేసరుఁ డగువాఁడే మనుష్యు లందు మనుష్యుఁడై కాలక్రమమున పూర్ణత్వము నందిపుచ్చు కొనఁగలఁడు.

వట్టి పాండితిగలవానిని మహాపురుషుఁడనుటకు నే నం గీకరింపను. పండితుఁడు ప్రశంసనీయుఁడే కాని పూజనీయుఁడు కాఁడు. పూజకుతగినవాఁడును, జగదీశుఁడును, ఆతనికి నైదోఁ డైన కళోపాసకుఁడును. వట్టి మెదడున సృష్టి సున్న కావున పండితుఁడు సృష్టికర్త కాఁడు. తాను నమలి మ్రింగినదే మో ఈతఁడు క్రక్కివేయును. హృదయముతో యోజింపగల శక్తి గల వ్యక్తికావునరాధాకృష్ణుఁడు తాను పడసినదానిని జీర్ణించు కొనుటయేకాక, దానికతన నూతనసృష్టిని కావించుచుండును.

మట్టిచిప్పయందుఁ బడిన నీటిబొట్టులు ఏ మార్పును జెందవు. ముత్తెపుచిప్పయందుఁ బడిన జలబిందువులు కనులకు విందొనరించు మౌక్తికములు కావా? సహజశక్తి గల మానసమునకిట్టి యద్భుతసృష్టిశక్తి కలదు. తనయందుండి దారము వేనుచుంట సాలీని పనియట్లు, సహజశక్తిగల మనుజుఁడు ఏదో భావము నల్లుచుండును. అంతరంగమందలి శక్తి రెండురీతుల విజృంభించునని నా యభిప్రాయము. మానసదిగ్వలయమునకు దిగువగల అదృశ్యభావవితానము ఏ ముహూర్తమందో ఒక్కటొక్కటిగ నా దిగ్వలయమున తళ్కొత్తును! ఏ జన్మయందో భావైశ్వర్యము నంతరంగమునఁ గూడఁబెట్టుకొనినవాని కిట్టి యనుభవములు సాధారణములై యుండును. తామసగుణ సంపన్నుఁడు నిద్దురయందో, విలాసములందో సమయమును వ్యర్థ మొనరించుచుండ, వెఱ్ఱివానివలె నే మూలయందో యడఁగియో, కల్లోలమందు నిలిచినను, మానసమును గభీరయోచనయందు ముంచియో సహజశక్తి సంపన్నుఁడు, ఏ యపూర్వ దృశ్యమునో తనయెదుటి కాహ్వాన మొనరించుకొనుచుండును. మహావిజ్ఞానుల భావముల నీతఁడు గ్రహించినంతనే, అవి వాఁడిగల త్రవ్వుగోలలట్లు ఈతని యంతరంగమును దొలిచి అందుండి రంగారుబంగారును వెలువఱచును. పఠనమువలన చేకుఱు మేళ్లు రెండువిధములు. ఇతర సామగ్రి నిది మనసునఁ జేరవేయుటే కాక, పఠితయంతరంగమున నడఁగియున్న సొత్తును బయటఁ బెట్టుటకు నిమిత్తమాత్రమగును. రాధాకృష్ణుఁడు విజ్ఞానుల కుటుంబమందుఁ బుట్టకున్నను, శైశవమునమనసున భాసమాన

స్వప్నములను లేపంజాలు దివ్యదృశ్యము లెవ్వియు నీతని కను లెదుట గోచరింపకున్నను, ఈతఁడు తన యంతరంగమున నిట్టి సొత్తును చేర వేసికొనియుండుటచే నిది ఈతని విజ్ఞానజీవితమున బయటఁబడినది. కావున రాధాకృష్ణుఁడు వట్టి పండితుఁడై నిలువక, నిత్యజీవియైన మహావిజ్ఞాని కాఁగలిగినాఁడు. భువిఁబోలు మెదడు, దివిఁబోలు ఎడదయుఁ జేరి ఈతనికి పండితులందును, కళోపాసకులందును, అమరులైనమానవులందును తావొసగినది.

వేదయుగము మొదలు నేఁటివఱకు పూర్వపశ్చిమ భూఖండములందు తలయెత్తినఉద్గ్రంథములను రాధాకృష్ణుఁడు తన మనసునఁ జేర వేసికొనినాఁడు. శంకరుఁ డనుఁడు, ప్లేటో యనుఁడు, రామానుజుఁడనుఁడు, అరిస్టోటిల్ అనుఁడు, యాజ్ఞవల్క్యుఁ డనుఁడు, స్పినోజా యనుఁడు, వ్యాసుఁ డనుఁడు, సోక్రటీస్ అనుఁడు, ప్రాచీప్రతీచీ మహావిజ్ఞానుల నెందఱినేని పేర్కొనుఁడు, వీరు రాధాకృష్ణుని అంతరంగమిత్రులై, ఆతని హృదయమున చిరస్థానమునందినారు. అగస్త్యుఁ డొక్క సముద్రమునే మ్రింగినాఁడు; కాని రాధాకృష్ణుఁ డనేకమహార్ణవములను క్రోలినాఁడు. ప్రాచీప్రతీచీ తత్త్వశాస్త్రములనుశంఖచక్రముల నట్లు దాల్చిన ప్రజ్ఞానిధి రాధాకృష్ణుడు! ప్రాచీప్రతీచీ సాహిత్యములను మణికుండలములట్లు దాల్చిన ప్రతిభాశాలి రాధాకృష్ణుడు!!! ప్రాచీప్రతీచీఖండములందు నేఁడువిజ్ఞానచ్ఛటలను సారించు అద్భుతతేజస్వి రాధాకృష్ణుడు!!! ప్రాచీప్రతీచీ సభ్యతలందలిమహత్తరాంశములనుకనదురుకంఠమాలగావించుకొనిన సౌందర్యమూర్తి రాధాకృష్ణుఁడు!!!! విజ్ఞానముల మేళ

వింపు పూర్వాపర్ధ పశ్చిమార్ధగోళముల కీతని నారాధ్యదేవత గావించినది. పూర్వపశ్చిమనాగరకతలందలి చెడుగులను చూపుట కీతఁడు ఇంక లేదు. రెండింటియందలి మేళ్ల నుగ్గడించుటకు సంశ యింపలేదు. ఇట్లని నిరూపించుట కీతని గ్రంథములనుండి ఎన్నో దృష్టాంతములను పేర్కొనఁగలను.

రాధాకృష్ణునందు హృదయ మేధస్సులు సరిసమముగ నుండుటచే, ఈతని హృదయము వెలార్చు ఆవేశపూరమున కీతని మేధ కట్ట తేర్చుచుచుండును. ఆవేగసంవరణము లీతని యందు చక్కని సమన్వయ మందినవి. కనులు మూసికొని "వహా వ్వా!" యని ఈతఁడు గంతులు వేయఁడు తపసియే కాని కనులుమూసికొని ఈతఁ డేమియు పలుకఁడు. ఈ యంశమును మనసునందు నిలుపగలిగితిమేని ఈతని రచనావిధాన మెట్టిదో, ఈతని చరిత్ర యెట్టిదో గ్రహింపఁజాలుదుము.

ముందంజవేయు మహనీయులలో పల్వురు గతమును పూడ్చిపెట్టు మనువారు కలరు. ప్రాచీభావామృతమును తని వారఁ గ్రోలిన రవీంద్రుఁడే ఒకప్పు డుత్సాహపరవశుఁడై గత మును గుఱించి ఒడుదొడుకు అభిప్రాయమును వ్యక్తీకరించి నాఁడు. అంధానుకరణము "ఛీస్సీ!" యని త్రోసివేయు రాధా కృష్ణుఁడు, యుగయుగములనుండికొట్టుకొనివచ్చు తెట్టని నెట్టి వేయు రాధాకృష్ణుడు, భారత ప్రాచీనమహత్త్వమును పున రుద్ధరింపదలంచుమహాత్ములందొక్కరుండనియు, ఈపునరుద్ధరణ మునకు నూతనసృష్టి తోడుపడవలెనని కాంక్షించు విజ్ఞానపిపా సువు రాధాకృష్ణుఁడనియు నొక్కి చెప్పఁగలను.

అన్యదేశీయులేకాక, పాశ్చాత్యనాగరకతయందుమునుఁగుచు తేలుచునుండు భారతీయులుకూడ హిందూమతమును చేరుపట్ల దివిటీలనుకాక కొరకంచులను చేతఁబట్టుచుండిరి! సంస్కృతాక్షరము తెలుగని పుల్లయ్యలు సనాతన మతముపై తూటాలు వదలుచున్నారు. సనాతన విజ్ఞాన మహత్త్వము నుగ్గడించు మహనీయుల పల్కు లాలింపక, అందలి తేనియ నించుకైన చవిచూడని దేవయ్యలు దానిపై నిప్పులు చెరిగిపోయుచున్నారు. రాజకీయ సాంఘిక రంగములందు గోచరించు 'ఆర్డినెన్సు'లకంటె భారతమతరంగమున తోఁచు 'ఆర్డినెన్సు'లు భయదమైయున్నవి. మన మత మహత్త్వమును మనము గుర్తింపక, మన నాగరకతకు మనము చిచ్చంటించుచుండ నొరులు మనపై పన్నీరు వాన కురిపింతురా? హిందూమతమును హిందువులు గౌరవించినంతకాలము, విదేశీయులు సయితము ఆ మత విజ్ఞానమును దోసిళ్లఁగ్రోలిరి. తమ మతము నెడల హిందువులకు గల విశ్వాసము సన్నగిలినదాది అది యొరుల వెక్కిరింతలకు గుఱియైనది. హిందువులు దయ్యముల నారాధించువారని పల్వురు పాశ్చాత్యులు అపోహపడిరి. ఈ దురంత విప్లవమును వివేకానందస్వామి ఛేదింప గమకించినాఁడు. రామకృష్ణుని సహజ గంభీర భావముల నాతఁడు పాశ్చాత్యజగతిపై వెదచల్లినాఁడు. వివేకానందస్వామి వెనుక హిందూమత మహత్త్వమును ప్రతీచీసీమలందు ఉగ్గడింపఁగలిగిన మహాపురుషుఁడు రాధాకృష్ణుఁడే! వివేకానందుఁడు సన్యాసి, వంగీయుఁడు, విశేషావేశము గలవాఁడు. వంగప్రకృతికి సహజ

మైన ఆవేశమునకు మతావేశము తోడుపడినది. ఆవేశపూరిత హృదయుఁడై యితఁడు హైందవాచారములను గుఱించిన దురభిప్రాయములను తుత్తునియలు చేసినాఁడు. పాశ్చాత్య విద్యాధికులు కొందఱు హిందూ విజ్ఞానముదెస దృష్టి సారించిరి. జోన్స్, కోల్ బ్రూక్, మేక్స్‌ముల్లర్ ప్రభృతులు సంస్కృతమును చక్కఁగ పఠించిరి. వివేకానందునివలెనే రాధాకృష్ణుఁడు భారతీయులందు భారతీయుఁడు. అందును ఇతఁడు ఆంధ్రుఁడు. వంగీయునకుఁ గల ఆవేశము ఆంధ్రునకుకూడఁ గలదు. ఈతనికి తమిళునకుఁ గల మేధాశక్తికూడఁ గలదు. ఈ శక్తి యావేశమును పొంగనీయదు. తన యావేశమును తన హృదయమందు చిక్కఁబట్టఁగల రాధాకృష్ణుఁడు కడుంగడు గడసరియై, కేవల మతోపదేశమునకు పూనుకొనక పాశ్చాత్యప్రకృతిని తట్టగల అద్భుత తార్కిక తాత్త్వికశక్తులను పురస్కరించుకొని, భారతవిజ్ఞానమందలి గొప్పందనమును రెండవ మానవమాత్రునకు సాధ్యముకాని వచఃకౌశలమున ప్రతీచీ విద్వాంసులమ్రోల వ్యక్తీకరించినాఁడు. స్వామిజీ ఉద్బోధనమునకు చెవియొగ్గి, ఆతని చరణములొత్తిన పాశ్చాత్యులు, ఆతఁడు ధారవోసిన మతావేశము తమయందు పొంగి నిలిచినంతకాలము, ఆతని పవిత్ర స్మృతిని దలఁచి ఆతని యడుగుజాడలనుబట్టి నడచిరి. పదపడి తమతొంటిపుంతయందు తాము ప్రవేశించిరి. రాధాకృష్ణుని వాక్కులు హృదయమునే కాక మెదడునుకూడ తట్టినవి. ఈతని వాక్కులు కేవలము పూలవానయట్లు కురిసి, స్మృతిపథమున సౌరభవాహిని ప్రవహింపఁ

జేసి యూరకొనవు. ఈతని భావములు ఎదుటి వ్యక్తి మనసున చిరస్థానము నందఁ జాలునవి. హేతునిరూపణము గావింపక ఈతఁ డొక్క మాట నుచర్పింపఁడు. "కవితాధారలు వాదమునకు పనికివచ్చు పరికరములు కావు." తార్కికుని వాక్కులు విషయగ్రహణమునకును, ఎదుటివాని వాదములను తునియలు చేయుటకును పనికివచ్చును. కాని చెమ్మట బొట్టులను రాలజేయును; ఉస్సురస్సు రనిపించును. "అబ్బా!" యని ఒకఁడు గ్రహించిన అంశములు హృదయమున నిలుకడ గనజాలవు. తర్కమునకు కవిత్వము తోడుపడి వ్యక్తపఱచిన నుడువు హృదయంగమ మగును. ఇట్టి నుడువులు రాధాకృష్ణుని సొమ్ములు. మతావేశమునకు తాత్త్విక పరిజ్ఞానము తోడగుటచే భావగమనిక క్రమమైయుండును. రాధాకృష్ణుని భావగమనిక వేగవంతమైనదయ్యు, నొడుదొడుకు లెఱుంగదు. హిందూమతమును గుఱించిన ఈతని అద్భుతోపన్యాసములు ప్రతీచీమహావిద్వాంసుల హృదయములను కదలించి వేసినవి. పశ్చిమ ఖండమందలి ఈతని తొలుతటి ఉపన్యాసమును వినిన కేంబ్రిడ్జియూనివర్సిటీవైస్ ఛాన్సలర్, తాను హిందువయినట్లు మురిసిపోయినాఁడు. లండన్ విశ్వవిద్యాలయోపాధ్యాయుఁడు "ప్రాచ్యాచార్యుఁడైన రాధాకృష్ణుని చరణోపాంతమున గూరుచుండి" అతని గంభీర వాక్కులు వినుతరుణము తనకు చేకుఱుట తనయదృష్టమనిపలికి పరమానందభరితుఁడైనాఁడు. ఆనాఁడు స్వాతంత్ర్యములేని భారతీయులను, నిరుపేదలైన భారతీయులను చూచి, వారి నీసడించు ఆంగ్లేయులే రాధా

కృష్ణునిపై పూలవాన గురిపించిరి. విజ్ఞానుల మనసుల పై క్షుద్రభావము లెట్లు వ్రాలును? పద్మాకరముపై వ్రాలునవి రాజహంసలు గాని రాబందులా? "పురుషరూపము దాల్చిన పలుకు వెలఁది"వలె రాధాకృష్ణుఁడు విజ్ఞానపూరమును హృదంతరాళమునుండి కడువడిగ వెడలించుచుండ "ఈతని శక్తి యెట్టిదో?" యని ఆంగ్లమహా విద్వాంసు లెందఱో అక్కజంపడిరి. "ఈతని శిరమున విడిసిన మేధ యెట్టిదై యుండునో!" అని పాశ్చాత్యమహామేధావు లచ్చెరు వొందిరి. ఈతఁ డుపన్యసించుచుండఁ గట్టెదుట నాసీనులై యున్న పండిత ప్రకాండులు మిగుల ముగ్ధులై, నిముసమున కొక్కొటి చొప్పున నీతనిపై విరిబంతులు విసరిరి. కట్టల తలలుదాఁటి పొంగిపొరలు మహాశైవలినివలె వీరి ప్రశంస బహుళ సభాంగణములనుండి వెల్లివిరిసినది; అశేష పత్రికలందు పాయపాయలై ప్రవహించినది. ప్రిన్సిపల్, జాక్స్, గిల్బర్ట్ మర్రే, జోడ్, సర్ విలియమ్ యంగ్హజ్బెండ్ ప్రభృతులు గుణసంకీర్తన మొనరించుచు నీ భారత మహావిజ్ఞానిచుట్టు భజనఁ జేసిరి. సంకీర్తనము భారతాంబకే యుద్దేశింపఁబడినదని రాధాకృష్ణుఁడు మురిసినాఁడు. పరిమితిలేని పరిజ్ఞానము నందుటొకటి, పరిజ్ఞానమును గుర్తించి ప్రశంసింపఁగల మహావిద్వాంసులను కట్టెదుట గాంచుటొకటి. విజ్ఞానుల సంఖ్య అల్పమే! ఈ యల్ప సంఖ్య నాడిపోయు నసంఖ్యాకులలో మధుర గుణకీర్తన మొనరించు మహనీయుల సంఖ్య కడుంగడు అల్పమైనది. జనతావిజృంభణమున ఖిలమింపని రవీంద్ర రాధాకృష్ణు లీ మంజుల సంకీర్తనమందలి విశాల భావమును మనసారఁ గ్రోలి యానందించుచుందురు.

రాధాకృష్ణుని గ్రంథము లన్నిటియందును హిందూ మతమును గుఱించిన అతని భావములు ఉత్తాలతరంగములట్లు పొంగుచుండును. హిందూమతసారము నీతఁడు తన "భారతీయ జీవిత పథము"లో తెలిపినాఁడు. శైలి సౌకుమార్యమునకును, భావసౌందర్యమునకును ఈతని గ్రంథములలో నిది మిన్నయని నా యభిప్రాయము. గ్రంథకర్తకుకూడ నిట్టి యభిప్రాయమే యుండును. కావుననే దీని నీతఁడు తన యర్ధాంగలక్ష్మి కంకితము చేసెనని నా తలంపు. ఇది యించుమించుగ నన్ని యైరోపియను భాషలలోనికి ననువదింపఁబడినది. వెనుకటి విజ్ఞానుల మాటలనే యితడు అంగ్లమందు విసరివేయలేదు.

హిందూతత్త్వ శాస్త్రముతో పాశ్చాత్యులకు కొంత పలుకుబడి కలిగించిన వంగదేశ పండితు లిద్దఱు కలరు. దాస్ గుప్త, హాల్డార్ లు చక్కని చరిత్రకారులట్లు మన భావవితానము నేకరువు పెట్టిరి. వీరికిని, రాధాకృష్ణునకును పోలికయే లేదు. ఐదుఖండముల మనసులను ఆకర్షింపఁ గలిగిన కవి పండితుఁడై, పండితకవియై ప్రాచీ ప్రతీచీ నాగరకతలకు మేలిపెండిలి సేయ దొరకొనినవాఁడు మన రాధాకృష్ణుఁడే!

తోఁటకాపరి ఉద్యానవనమందలి కలుపును, ముండ్లపొదలను ఊడబెఱికి, చక్కని తీవలను నిలిపి, క్రొత్తలతల నందు నాటును. ఉద్యాన మపుడు నవనవోన్మేషమైయుండును. అధునాతన పృథ్వీసభ్యత నొక యుద్యానమునట్లు విలోకించి, దీనికి ప్రస్తుత రూపొసఁగినమతములను పరిశీలించి, వానియందుఁ

దలయె త్తిన కంటకముల దెస ప్రవేలెత్తి రాధాకృష్ణుఁడు నవజీవన సముద్భాసితసభ్యత కనులపండు వొనరింపవలెనని యుద్దే శించుచున్నాఁడు.

ఇట్లుద్దేశించుపట్లు హిందువుల మతసాంఘిక జీవనముల నీతఁడు పరిశీలించి, వానియందలి విశిష్టతను ప్రతిపక్షు లెంద ఱెదుటఁ దోఁచినను, జంకునకు చోటీయక ఋజువుచేసినాఁడు. హిందూబౌద్ధమతము లుద్భోధించు కర్మసిద్ధాంత మెట్టిదో పాశ్చాత్యుల మాట యటుండ, బల్వురు భారతీయులే గుర్తింప రైరి. ఈ సిద్ధాంతము నెడల నవిశ్వాసము చూపినవారిలో కొందఱు మన సోదరులు బ్రహ్మసమాజికులు. వీరిలో సాంధ్ర బ్రహ్మ సమాజికులకు తలమానిక మనిపించుకొనిన పూజనీ యులు వీరేశలింగముగా రొకరని వీరి వాఖ్యానములను చదివి నపుడు గ్రహించి దుఃఖింతుము. హిందూమత సముద్భవమైన బ్రహ్మసమాజము ననుష్ఠించుమహనీయులలో పల్వురుహిందూ మతతత్త్వమును సమగ్రముగ గ్రహింపని వారగుటచే, అందలి మహత్తరాంశములలో కొన్నింటిని అనుచిత విమర్శనమునకు గుఱిచేసిరి. కావున వీరినిగాంచిన హిందూసోదరులు కొందఱు వీరు తమనుండి వేఱైనవారని అపోహపడిరి. నేఁటి విద్యార్థికు లనేకులు స్వీయసీమ విజ్ఞానమును అన్యదేశీయ సులోచనము లతో విలోకించి, అందలి బహుళాంశములను తీవ్రముగ తునియ లొనరింపఁ బూనుకొనిరి. అధునాతన విద్యార్థికులలో నొక్కండైనను, ప్రాచీన వైజ్ఞానిక గభీర సింధువును గంధగజేంద్రమై యీదిన రాధాకృష్ణుఁడు సాహసోపేతుఁడై వీరి కెదుటనిలిచి

'కర్మ' మున్నగు వాదములను గాంధిజీవలె సమర్థించి వాని యందలి నిగూఢమహత్త్వమును తేటతెల్లముగ వ్యక్తీకరించి వాఁడు.

## రాధాకృష్ణుని వ్రతనిష్ఠ

స్వప్రయత్నములను సోపానము లొనరించుకొనియే మహాపురుషులు మహోన్నతస్థానము నధిష్ఠింతురుగాని వీరు ప్రత్యేక జీవులై వసింపరు. తమ గోప్పందనమున కైదీలై యుండరు. ఒంటరిబ్రదుకున పూలను, పండ్లను ప్రోగుజేసికొని కులుకరు. తమ పొట్టలకు జేగంటలు కట్టి, తమ ధనరాసులకు దాసులై, తమ పేరుప్రతిష్ఠలచుట్టు భజనచేసి, తమ పాదములకు తామే ప్రణమిల్లరు. వీరందఱు తమ వెన్నెముకల నూడఁబెఱికి దేవతానీకమునకు దక్షిణ లీయంజాలరు; తమ మేనులందలి నంజుడుగోసి ఇంద్రాగ్నులకిచ్చి సంతుష్టి నందనేరరు; తమ తనువులను శిలువలకు సమర్పించి అపరాధులను మన్నింపుమని జగదీశుని వేఁడుకొనలేరు. యుగపురుషులైన మహాత్ము లందుఁగూడ నిట్టివారిని మిపుల నరుదుగ విలోకించి, వీరికతన తన సృష్టి మహత్తరమైనదని ఆనందించి, బహుభంగుల భగవంతుఁడు వీరిని కీర్తించును. వీరితో సజ్జీగా నిలువకున్నను, తక్కుంగలమహాపురుషులు వీరిపై దృష్టినిలిపి, నక్షత్రములు పోలు గొనములను పూవులనట్లు తమ జీవితముల కద్దికొని, అపూర్వ సౌందర్యమున తేజరిల్లెదరు. స్వార్థమును నేలఁగొట్టి పరార

జీవులై పరితోషమందెదరు. కావున వీరి ప్రాముఖ్యము విశ్వ విస్తృతమై, వీరి ప్రశస్తి ఆచంద్రతారార్కమై వెలయును.

పరార్థజీవితము పలుతెఱగులు కలది. ధనప్రాణములను నర్పించుటయే ఇందలి యంశములు కావు. మానవోద్ధరణమునకు అనివార్యమైనది మానసోద్ధరణము. హృదయదిగ్వలయమునుండి భావమయూఖములను ప్రసరింపఁజేయు మహావిజ్ఞాని మానవమానసము నాలోకిత మొనరించి, సముచితసముద్ధరణమును సుసాధ్యము గావించును. కావున నీతఁడును పరార్థజీవియేకదా!

లోకము నొకే కంటఁజూచు చంద్రార్క తారలచందమున పరార్థజీవులైనమహాపురుషులు మానవులనందఱి నేకైక దృష్టితో విలోకింతురు. వీరికతన సముద్భాసితజీవులగుచు ప్రజలు వీరపూజ గావించుచుందురు.

కాని దిగ్వలయ మెనిమిది దిక్కులు గలది. వీరపురుషుల జన్మస్థానములును వేర్వేఱు దిక్కులు కలవి. పొడుపుఁగొండను తనబొజ్జపై నిడికొనిన పూర్వదిక్కునకే ప్రజలు ప్రాంజలు లగునట్లు వీరప్రసవినియైనదిశకు మానవులు చేతులు మొగిచి గీతాంజలి నర్పింతురు. మయూఖములకునునికిపట్టయిన ఈ దిశ మహితభావమునకు పురిటిల్లై, పరిసరవాసులకు ప్రత్యేకమైన ప్రమోదముగూర్చును. తన తోఁటలో పూచిన పూవును తనచెట్టున ముగ్గినపండును వనమాలి విశేషానందముతోఁ జేగొను లీల, తాను కనినబిడ్డను తల్లి మఱింత మురిపెమున నక్కునఁ జేర్చి ముద్దిడుకొనుచొప్పున, తమ సీమలో పుట్టిన మహనీయుల

నవలోకించి పీ రమందహర్షమునసోలలాడెదరు. పూర్వదిశనుద యించిన మహాపురుషులని గాంధి రవీంద్రులను, రాధాకృష్ణ ప్రఫుల్లచంద్రులను, సర్ విలియమ్ యంగ్ హాజ్ బెండుపోలు ప్రతీచీమనీషులు ప్రస్తుతించుచుండఁ బ్రాచీవాసులువీరినివీక్షించి ఎంత యానందింపరు ?

పశ్చిమావనిపై చీఁకటిమూఁకలు దండెత్తుటచే పాశ్చాత్య విద్వాంసులు క్రొత్తవెలుంగునకై కొంతకాలమునుండి ప్రాగ్దిక్కు నకు తమ దృక్కులను ద్రిప్పఁదొడంగిరి. ప్రస్తుత ప్రాచ్యాచా ర్యులలో పెద్ద రాధాకృష్ణుఁడని విశ్వసించియే తమ ప్రధాన విద్యాపీఠస్థలి కతని నాహ్వానించిరి. ఎదుటి దృశ్యమును పరిశీ లించుచు, కొంతతడవు తడసినను, ప్రాచీవైజ్ఞానిక ప్రతినిధియై తాఁజేయవలయు కర్తవ్యము మహోత్కృష్టమైనదని గుఱు తించి రాధాకృష్ణుఁడు కదలిపోయినాఁడు.

ఈవార్త సభ్యజగతిపై వ్రాలినంతన భారతభూమి యందు జయదుందుభులు బోరుకలంగినవి. ఆసియా హృద యమున నుత్తాలభావతరంగము లుప్పొంగినవి. విజ్ఞానలోక మున భావబంధుర ప్రతిధ్వను లుదయించినవి. విజయ నిశాన ములు రాధాకృష్ణుని యుష్ణీషముపై నెగసినవి. స్థానస్థానము లందు సన్మానపరంపర లీ యాంధ్రమహాపురుషుని పదము లొత్తుటకై పందెములు వేసికొనినవి. విద్వాంసునిపై పూల వలె రాలుటకు చుక్కలు మిక్కిలి మక్కువపడుననిన, ప్రతిభా శాలి గుండియపై కౌస్తుభమై విడియుటకై పండితలోక మాతు రం పడుననిన, భావోపాసకుని హృదయ విభూతికై శతాబ్దులు

డింభకులట్లు దోసిళ్లొగ్గుననిన, ప్రజ్ఞాధురీణుని మౌళిపై మణిమకుటము నిలుపుటకై యుగము లువ్విళ్లూరుననిన, పండుముత్తై దువులై దృగ్గోచరమై యానంద వ్రతుని నొసటఁ గల్యాణతిలకము దిద్ది మణిద్యుతుల నాతనికి నివాళినీయ అష్టదిక్కులు ముచ్చటపడుననిన, బహుభావ కోశాగారమైన రాధాకృష్ణుని శిరముపై ముత్తెపు సేసలు చల్లుటకై, రసప్రవాహమైన రాధాకృష్ణుని హృదయముపై పూలచెండులు విసరుటకై, శ్రీపతి శయ్యాగార మందలి ప్రదీపమువలె రాధాకృష్ణుని మానసమున వెలుంగు విజ్ఞాన దీపకళికకు 'జయమంగళ' మని మధురగీతిక లాలపించుటకై, ఉదయాద్రిబోలు రాధాకృష్ణునిగుండియపైఁ గల శాస్త్వంతు నుద్దేశించి గాయత్రి జపించుటకై పెద్దపెద్ద యంజలువేయుచు ననేకులు నాఁడాతనిమ్రోల నతజానువులై నిలిచి, భక్తిసుమాంజలి సమర్పించుటం దక్కఁజ మేమున్నదీ?

మానస సరోవర వీచికలం దూగాడు రాజహంసవలె మత్సాహమున నుఱ్ఱూతలూగుచు రాధాకృష్ణుఁడు ఆక్స్ఫర్డ్ జేరుకొనినాఁడు. సాలభంజికలతో చెలువొందు స్వర్ణసింహాసనమున నాసీనుఁడైన రాజన్యునివలె, నిలింపు గుంపులందపరంజివేదిక నలంకరించిన పెండ్లికొమరునికైవడి అధునాతన వసుంధరలోని మహోన్నత విద్యా పీఠము నీతఁ డధిష్ఠించినాఁడు; ఆసియాఖండ ప్రథమ వైజ్ఞానిక మహాసభ కధ్యక్షుఁడైన మహామనీషియే ఆక్స్ఫర్డ్ విశ్వకళాపరిషత్తులోనిఆసియా శాఖయందు ప్రధానాచార్యుఁడైనాఁడు. (Spalding Professor of Eastern Religions and Ethics) ఈ యఖండ గౌర

సము నందిన తొలి యాసియావాసి రాధాకృష్ణుఁడేయని కల కత్తా విశ్వవిద్యాలయోపాధ్యాయుఁడు శ్యామప్రసాద ముఖో పాధ్యాయుఁడు తనగద్దెనుండి సగర్వమున కంఠమెత్తి వచించి నాఁడు. ఈశ్వర సంకల్పమున నెట్టిభావము లడఁగియున్నవో!

ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయము శతాబ్దులనుండి పెం పొందుచున్నది. నేఁటి సభ్య సుంధరలో తురాయిదాల్చిన విద్యాసంస్థలలో నిది తలమానికముకదా! ప్రతీచీ ఖండమున విజ్ఞాన వీధులందు తళ్కొత్తు వెలుఁగు రేకలు విశేషముగ ఆక్స్ ఫర్డ్ కేంబ్రిడ్జ్‌లనుండి ప్రసరించినవియే! కాని, ఈమహాసంస్థలలో చాలకాలము ప్రాచీవిజ్ఞానమునకు చోటులేకుండెను.

వివేకానందుని నాఁటినుండి భారత భావమహత్త్వ మును పల్వురు పాశ్చాత్య విద్వాంసులు హృదయంగమము గావించుకొనుచున్నారు. విజ్ఞానలహరి కెదుట జాతిమత భేద ములు గట్టులదొరలై నిలువలేవని గుర్తించిరి. ఒకప్పుడు భారత భూమిని కొద్దిచూపుతో చూచినను, అందు నుదయించినవిజ్ఞాన కిరణ రాజికి జోహారొనరింపగడంగిరి.

ప్రాక్పశ్చిమ విజ్ఞానములందు సాటిలేని ప్రజ్ఞ సంపాదిం చిన మహామేధావి రాధాకృష్ణుఁడని అసంఖ్యాకములైన ఈతని యుపన్యాసములకు వీనులొగ్గినపు డెఱింగిరియే, ప్రతీచీవాసుల మనసుల నవలీలగ చొరఁజాలని ప్రాచీభావ బ్రహ్మాండమును తేటమాటలందు, పరిచితప్రతీచీజాతీయమున వ్యక్తీకరింపఁజాలు తాత్త్వికాచార్యులలో రాధాకృష్ణుఁ డద్వితీయుఁడని ప్రత్యక్ష పరీక్షలందు గ్రహించియే విజ్ఞాన దృష్టిగల ఈ విద్వాంసులు-

విశాలదృష్టిగల ఈ మనీషులు తమ చరిత్రలో తొలిమాఱు వేదాంత విద్యా ప్రబోధమునకు తావొసఁగిరి.

అచిరములో రాధాకృష్ణుఁడు తన డిండిమమును మ్రోగింపఁ జాలినాఁడు. తొలుత నైదేండ్లకై నిర్దిష్టమైన ఉద్యోగపరిమితి పదునే నేండ్లవఱకు పొడిగింపఁబడినది. రాధాకృష్ణుని ప్రజ్ఞావిశేషములను మిగుల ప్రశంసించుచు నీతని తమ వైజ్ఞానిక ప్రతినిధి గావించి, అలహాబాదు విశ్వవిద్యాలయస్వర్ణోత్సవ సమయమున నీతనిద్వారా ఆక్స్ఫర్డు ప్రముఖులు భావబంధురమైన తమ సందేశమును భారతవిజ్ఞానుల కంపిరి. సాహితియం దీతనికిఁగల నిండుపాండితిని గుఱుతించియే ఈ మహోత్సవ సమయమున అలహాబాదు విశ్వవిద్యాలయాధికారులు 'డాక్టర్ ఆఫ్ లిటరేచర్' పట్టమొసఁగి రాధాకృష్ణుని సన్మానించి, తమ్ముఁదాము గౌరవించుకొనిరి. ఇంచుమించుగ నిదే సమయమున నాంధ్ర విశ్వకళా పరిషత్తు స్నాతకమహోత్సవమున కధ్యక్షుఁడైన ఎర్ సైక్సన్ ప్రభువు ఈ యాంధ్ర మహావిద్వాంసుని చిత్రపటమును బహిర్గత మొనరించుచు నీతని ప్రజ్ఞపై పూలుచల్లి సూక్తిసుధావర్షము గురిపించినాఁడు. శమంతకమణివలె కన్నెదుట ప్రతిభ ప్రభాకలితమై గోచరించుచుండఁ గన్నుగల విజ్ఞానులు మంగళగీతికలాలపించుచు కుసుమ కందుకములను దానికి సమర్పింపరా?

కలకత్తా విశ్వవిద్యాలయమందలి ప్రధాన తాత్త్వికపీఠమును (King George V Chair of Philosophy) కూడ నీతఁడు మరల నలంకరించినాఁడు. పశ్చిమార్ధగోళమున ఆక్స

ఫర్డ్ విశ్వవిద్యాలయ మెట్టిదో పూర్వార్ధగోళమున కలకత్తా విశ్వవిద్యాలయ మట్టిదే! రోడ్సు జలసంధిపై శతాబ్దులు నిలిచిన కలోస్సస్ వలె నీ సంస్థాగ్రములందు రాధాకృష్ణుఁడు నిలిచినాఁడు. విజ్ఞానజగతియంతయు నేఁ డీతనిదృష్టిలో వెలయుచున్నది. మంచుకొండ కొననుండి సురాపగను గొనివచ్చిన మహాతపస్వివలె ప్రాచీదిశనుండి ప్రతీచీదిక్కునకును, పశ్చిమదిక్కునుండి ప్రాగ్దిశకును ద్వివిధవైజ్ఞానికాఝరుల నీతఁడు స్రవింపఁజేయఁ గలఁడు. గంగాయమునలట్లే భావస్రవంతులు కలియుతటి రెండు భూఖండములకును చేకుఱుప్రయోజనము లెన్నో యుండును. ఇట్టి కలయిక నేఁడు మిగుల నక్కఱయైయున్నదికదా!

పాశ్చాత్యులు తమ దృష్టిని కేవలము భౌతికశాస్త్రమునకే అప్పగించిరి. జగతియంతయు హేతుసూత్రమున చుట్టఁబడెనని వారూహించుచున్నారు. ప్రత్యక్షప్రమాణమునకు లొంగని దే యంశమైనను వారిమనసులందు చోటునందకున్నది. ఋజువున కతీతమై, మనుష్యజీవితమున దివ్యకాంతుల నింపుశక్తి యొండుకలదని వీరు విశ్వసింపకున్నారు. కావున పరమాశయములపై కన్నునిలుపక, ఈశ్వరసామ్రాజ్యమునుండి దూరముగ తొలఁగి సామరికవిజృంభణమున వీరు బ్రదుకులను తలక్రిందులు చేయుచున్నారు. భౌతికశాస్త్రమును యథాస్థానమున నిలిపి, నక్షత్రములట్లనంతకాలము వెలుంగు ఉదాత్తాశయములకు వీరు తమ చూడ్కులను లగింపవలెను. భారతభావస్రోతము వీరి మానస కేదారములందు ప్రవహించినపుడే సంపూర్ణమైన అంత

రంగిక పరివర్తనమునంది, పవిత్రవర్తనులై, ఆత్మజీవితములందు పైడిపైరు కాంచి, స్వీయసముద్ధరణముతో వీరు తోడివారి పునరుద్ధరణమును కనులార విలోకింపఁగలరు.

భారతీయులలో నేఁడు పల్వురుమౌఢ్యపంకిలమున దిగఁబడియున్నారు. హేతుపరిశీలనము గావింపక, విషయవిమర్శన మెఱుఁగక, భావదాస్యమునకు గుఱియై, భయసంశయములను మనసున నిల్లుగట్టికొన నిచ్చి ప్రత్యక్ష జీవితమునుండి కట్టుత్రాళ్లను సడలింపఁ జాలకున్నారు. ఆంతరంగిక సామ్రాజ్యమును గోల్పోయి, అనేకారిష్టములందు వీరల్లాడుచుండుటచే భావస్వాతంత్ర్య మెద్దియో, ఈ స్వాతంత్ర్యము కను ఆనంద మెద్దియో వీ రెఱుంగ లేకున్నారు. తమ తలపులందును,తమ క్రియా ప్రణాళికలందును సైన్స్‌నకు వీరు వలసినంత తావొసగి తీఱవలెను. చలనయుతమై, భావప్రదీప్తమైన స్వీయసంప్రదాయమును జారవిడువక సముచిత హేతువిమర్శనమును వీరల వఱుచుకొనవలెను.

ఉభయ నాగరకతలు నేఁడు చేతులు కలుపుకొనవలెను. భౌతికశాస్త్రమునకును, మతమునకును నేఁడు పాణిగ్రహణ మహోత్సవము జరుగవలెను. తత్త్వశాస్త్రము తన పాణింధమమును మ్రోగింపవలెను. లక్షవత్తులతో తేజరిల్లు మహోన్నత పూజామందిరమువలె సాహిత్యము మహదాశయ మండితము కావలెను. నవనవోన్మేషములై లలితకళలు మనుష్య జీవితమందలి లావణ్యమును పునరుద్ధరింపవలెను. శాంతికాములైన ప్రాచీప్రతీచీవాసు లీ యంశములకికనైన నవగతులు కాఁగలరా?

నేఁటి మార్గదర్శకుఁడు వెనుకటి యుగములందువలెనే ప్రాచీదిశనుండి రావలెనని సర్వసీమలవారును అభిప్రాయ పడుచున్నారు. వీరి యాశయమును పూర్ణమొనరించుట కొక యాంధ్రునకు చక్కని తరుణము లభించినది.

తన దేశవాసులందే నిలిచి, రాజకీయాంగణమున తన వారు సలుపు ఉత్కృష్టయత్నములకు బుజములొడ్డి భారతాంబ కీతఁ డెంతేని సేవజేయఁజాలుట నిక్కమే! కాని ప్రత్యేకించి తనదేశ వాసులకేగాక ప్రపంచ వాసు లందఱికి చేయుసేవయే మహత్తరమైనదని యెఱిఁగియే జగదీశుఁ డీతని వైజ్ఞానిక పీఠస్థలి బ్రవేశపెట్టి యుండును.

జినీవాలో జరిగిన అంతర్జాతీయ మహాసభలందు శాంతి మంత్రము నుపదేశించుచు, వివిధ సభాంగణములనుండి ఘనతరాదర్శములను గుఱించి గంభీరోపన్యాసము లొసగుచు, సముచిత సందర్భములను సృష్టించుకొనుచు, స్వీయదేశమును గుఱించిన దురభిప్రాయములను, స్వీయవిజ్ఞానమునుగుఱించిన దురూహాలను తునియలుచేయుచు, జంకుగొంకులకు స్వస్తి చెప్పి రాధాకృష్ణుఁడు సర్వతోముఖ భారతసముద్ధరణఃమునకై ఉత్కృష్టమైన యత్నములను సలిపి యున్నాడు. గగన చుంబి దీపస్తంభమువలె నొక భారతమహావిజ్ఞాని తమోబద్ధమైన పశ్చిమార్థగోళమున నిలిచి తన గుండెనుండి బహుభావభాస్వన్మరీచికలను ప్రసరింపఁ జేయుట మంగళకరమే కదా!

ఫిరంగులు కర్ణపుటములను భేదించుచుండ, దురూహా పరంపరవలె కారుపొగలు వసుంధరను మూర్కొనుచుండ,సహా

కారమును చిత్తుచేసి, సుహృద్భావమును నేలఁగొట్టి, సమర పిశాచము జెబ్బగొట్టి విజృంభించుచుండ, శాంతిమంత్రము వెట్టి గుసగుసయని పండ్లికిలించు పల్వురు ప్రపంచ రంగస్థలములందు మోళీగట్టుచుండ, తాత్త్వికవనవిహారి మధుర మురళిని వినిన వారెవ్వరని కొందఱు ప్రశ్నింపవచ్చును. "పూజాగృహమేడ? ఐక్యరాజ్యసమితి యేడ?" "శాంతితారక పునశ్చరణ మేడ? సమీక సన్నాహమేడ?" అని యడుగువా రుందురు. విధ్వంసము విజయధ్వజ మెత్తఁజాలునని వీరు విశ్వసింపరాదు. అసంఖ్యాకములైన గ్రుడ్ల నొక్క బాంబు అరనిముసములో మాడ్చి, బూడె యొనరించి, తన పెద్దఱికమును ప్రకటించునని వీరూహింపరాదు. బాంబు బొబ్బ విజయడిండిమ మని వాకొను వారెవరు ? కుత్తుకయందు నిరయజ్వాల నిడికొను బాంబుకంటె జీవిత నియమమును గర్భమందిడికొనిన అండమే దొడ్డదియని ప్రత్యక్షసృష్టి ప్రమాణ మొనరించునట్లు, స్వర్గసామ్రాజ్యమునకు ప్రతినిధియైన మల్లెపూవు నరక దుర్గంధమును నిమిసములో నిర్జింపజాలులీల, కోటిచీఁకటుల నొక్క సూర్యకిరణము గిరి కందరములలోనికి తఱిమికొట్టునట్లు, తేనె పెరనుండి యురలు తియ్యనిచుక్కవలె, వీణాతంత్రినుండి రాలు తోడిరాగశకలము శ్రోతల హృదయములనుండి అశేష దుశ్చింతలను కడిగివేయు లీల సదాశయసందీప్త సద్వాక్కు కోటికోటి ఫిరంగుల నొక్క తృటిలో పెంటప్రోగులజేసి నవోత్పత్తి కెరువుచేయఁగలదు. మానవ హృదయమునకు, మనుష్యసంఘమునకు సహజమైనది. శాంతి కాని సమరకోలాహలము కాదు. మనుష్య హృదయ

మునుండి జగదీశుఁడు వెలికా లేదు. ఈశ్వర సామ్రాజ్యముపై దండెత్తి నెగ్గఁజాలిన పిశాచ మెద్దియును లేదు. దురాశకు పట్టముగట్టి, నెగ్గి సంఘమెద్దియు మానవ చరిత్రమున నెందును గోచరింపలేదు. తాత్కాలికముగ పరిస్థితులు ప్రతికూలముగ నున్న నేమి ? సృష్టి నిబంధనమున కివి తలవంపులు తేఁజాలవు. పూర్ణచంద్రునిపై దోమలు వ్రాలఁ గలవా ? సూర్యునకు చీమలు పట్టజాలునా ? నక్షత్రములను చెదపుర్వులు కబళింపఁ గలుగునా ? ఆకసమును వెక్కిరించు లోఁతుగోతులు గగనాగ్రమున చుంబించు గుడిగోపురములు కాఁజాలునా ? మహాదాశయములు ముక్కిపోయిన నూకలగునని వచించు వారెవ్వరు ? అవి యస్తమయ మెఱుఁగని దీపికళికలు కావా ? కాలవియత్తలమున 'ఉఫ్ !' అని వీని నార్పఁగల దుష్టశక్తి యేది ? ఒక వంక పూవును, వేఱొకవంక వెలుంగును, ఒకదిశ మంజులగీతికారవమును, మఱొకదెస గంధబంధుర హిల్లోలమును జగతి నేలునవి సౌందర్యమాధుర్యములని విశద మొనరించుట లేదా? పంకిలసంకులజీవితమునఁ గూడ నందనబదనికలను నాటజాలు శక్తియొండు సృష్టి హృదయమున విరాజిల్లుచున్నదని, ఈశ్వర మస్తకమునుండి ఒక్కటొక్కటిగ రాలు పూరేకులు మానవ మనస్సును మార్కొను పిశాచగణముపై విచ్చుకత్తులై పడి దుర్భావ విధ్వంసముతో ఆ చిత్తాంగణములందు సద్భావ సామ్రాజ్యమును గనుచుండునని, అమవసనిశిని ప్రదర్శించు కట్టిడిగుండియలో తారావళిని స్థగిత మొనరించి నిస్తబ్దగీతికావళి నచ్చోనింపి సుందరి చూడ్కులఁబోలు వెలుఁగుగల నందు వెలా

రించునని, లక్ష్మీగళమున తాలిగట్టినహస్తమే మనుష్యగళమున ప్రభాకలిత గుణమణి మాంగల్యమును గట్టి మురియునని, వసుంధర కల్యాణమండపమై వేల్పులనూరించు వేడుకల వేదియై వెలయునని ఒరులు విశ్వసింపకపోయినను, కవితాదృష్టిగల తాత్త్వికుఁడు విశ్వసించితీఱును. అంతియకాదు, ఆత్మవిశ్వాస మందలి భావ జ్యోతిర్మండలమునుండి మాఱుమూల మనస్సుల లోనికి సైతము మరీచికాపరంపరలను ప్రసరించును. చీఁకటి కొట్టులపుడు విద్యుదాగారము లగును.

రాధాకృష్ణుఁడు కవితాదృష్టిగల తాత్త్వికుఁడని తొలుతనే తెలిపితిని. రవీంద్రుని ఆదరమును, మహాత్ముని అనురాగమును అందుచు జోడు దివ్యప్రదీపకళికలమధ్యఁ దోఁచిన మూఁడవ దీపికవలె నిరువుర నడుమ నవయుగదిగ్వలయమున తేజరిల్లుచు ప్రపంచప్రముఖుల 'జేజేల' నీతఁ డందుకొన్నాఁడు కదా! పూర్వదిక్కును వీక్షించుచు, ప్రపంచ పునరుద్ధరణము నపేక్షించు మహనీయులయుద్దేశములు ప్రభాతకిరణస్పర్శకతన వికసించు పద్మములట్లు ప్రఫుల్లములు కాకపోవునా?

క్రమనిష్ఠ ననుష్ఠించు మహాపురుషుని జీవిత విధానమే ప్రజానీకమునకు మేలుబంతియగును.

రేపకడ మేలుకాంచినంతననబర్మ్ తీసంయమీంద్రునిభజన గ్రంథము నొకకేలను, రవీంద్రకవీంద్రుని గీతాంజలిని వేఱొక చేతను, భగవద్గీత నౌదలనుదాల్చి, నిమీలితనేత్రుఁడై కుటుంబ సహితముగ ప్రార్థన సలిపి, ధ్యానమగ్నుఁడై, ఈశ్వరచరణ ద్వంద్వమును హృత్సరోజమున నొడ్డి, పదపడి బాలకులఁగలసి

గాఁగూడ డింభకుఁడై కొండొకవడి యాడి అనంతరమేతనదిన చర్యకు రాధాకృష్ణుఁడు కడంగుననని ఈతని గృహజీవితమును గమనించినవా రెఱుగుదురు. మహోన్నత ప్రణాళికల పునాదులు దైనిక గృహజీవితమందే యుండుననుడీ!

రాధాకృష్ణునిగుండె నిండుకుండ యని ఈతని సన్నిహితు లెఱుఁగుదురు. ఆక్స్‌ఫర్డ్ పీఠస్థలి నలంకరింపఁబోవు మఱొకవ్యక్తి మత్తమాతంగము నధిష్ఠించి, మహాసంరంభమున నింటనుండి తరలియుండును. స్వీయసీమను వీడుతఱి ఈతని కన్నులనుండి నీరు జొటజొటరాలెను. మొగముకందెను. 1936, మే,నాలవతేదీనాఁడు మద్రాసుసెంట్రల్ స్టేషన్ ప్లాట్ ఫారంపై నీతనికి వీడ్కోలొసఁగ బహుసంఖ్యాకులు కూడిరి. రాధాకృష్ణుని మోముపై కన్నుంచి, అది యశ్రుప్లావితమైయుంట నెఱిఁగిన మహానాయకుఁడు సత్యమూర్తి, "మారాధాకృష్ణుని గాంచి మేము గర్వింతుము.ఆతఁడు కంటతడి పెట్టుచున్నాఁడు. వేదాంతము మానవుని కరుణాళువునుగావించును"అనినాఁడు. అప్పటి దృశ్యముఁజూచి ప్రేక్షకు లాశ్చర్యాన్వితులైరి.

పురుషులందు కన్నీరొడ్చువా రెందఱుందురు? మేధావులందు, మహామేధావులందు, వీరిలో నగ్రస్థానమున నిలిచిన వారియందు నెందఱుందురు?

విశేష పరిశ్రమకతన మహామేధావులైన మానవులున్నారు. కాని మహామేధావులందఱుమహాపురుషులు కారు. వజ్రాదపి కఠోరమయ్యు, కుసుమాదపి మృదులమైన హృదయము గలవాఁడే, ఒరులకై, తన దేశమునకై, మహత్తరాశయములకై కన్నీరు వీడజాలువాఁడే మహాపురుషుఁ డందును.

ఒక్కొకపుడు మాలవ్యాపండితుఁడు ఆడుదానివలె జేల యగుట నే నెఱుగుదును. ఒకరి కష్టమునుగుఱించి తెలుపుతఱి మాలవ్యాజీ గద్గదకంఠుఁడై విలపించుటవిలోకించితిని. కష్టమును కట్టెదుటఁ జూచినపుడు ఈతనిస్థితిఎట్లుండునోయూహింపుఁడు. ఎవ్వానిగుండె కరుణచే చలించునో, అదియ జగదీశుని స్నానాగారమగును. కన్నులనుండి నయాగరాధారలై రాలు పవిత్రవారి ఆ గుండెలోని యూటనుండియేకదా వెడలును ! ఈ సలిలము గంగోదకముకంటెపవిత్రమైనదని,ఇట్టిపూతవారిని నేత్రద్వారములనుండి వెలారింపఁజాలువారు మానవు లందరు దుఃగ ధోఁచుచుందురని వచింతును.

స్త్రీలోకమున తఱచుగా వీరిని విలోకింతుము. మేధా శక్తిలో పురుషులందు పురుషులై, హృదయ మహత్త్వమున స్త్రీలందు స్త్రీలైనవారు మనుష్యలోకమున నెందఱున్నారో లెక్కింపుఁడు. కోటి కొక్కరుండున్నను, మానవోద్ధరణమును గుఱించి మనము నిట్టూర్పులను వీడ నక్కఱలేదు.

ప్రలోభములను మార్కొనుచు, దృఢవ్రతులై, గుండె లోని త్రియంబకమునుగని ఉత్కృష్టాశయములకు చూడ్కులను లగించు వారిని గుర్తించి, ప్రశంసించి వారి యుదాత్తయత్న ములకు చేయూఁత నొసఁగువారు సహృదయులు. మహాపురు షులను గనుటెంత కష్టమో ఇట్టి సహృదయులను కనుటయు నంతకష్టమే ! కాదుకాదు! కష్టతరమని కంఠమెత్తి వచింపుఁడు. మహాపురుషులను గుఱుతింపనివారి సంఖ్యయే బలిసియుండు ననియు, కావున వీరులు తఱచుగ దురభిప్రాయములకును,

దురూక్తులకును, దురంత దౌష్ట్యమునకును పాల్పడుచుందు రనియు విశేషించి ఈ యత్యాచారమునకు కడంగువారు సమ కాలికులనియు, తామేవిజ్ఞానులమనియు,గుణగరిష్ఠులమనియు విశ్వసించి, తక్కుంగలవారుమూర్ఖులనియు,పాపులనియునమ్మి వారిని వీరు హింసించుచుందురనియు, కాలము కడచినపిదప గాని జగతికి నిక్కము తెల్లముకాదనియు జాన్ స్టూవర్ట్ మిల్ మున్నగుమహారచయితలు వాకొనిరి. దురభిప్రాయములకుగుఱి యగుట కూడని పనికాదనియు, మహాపురుషులు వీనికి పాల్ప డుట సహజమేయనియు మహావిజ్ఞాని ఎమర్సన్ వచించినాడు.

వక్రాభిప్రాయములుకలవారధికులై యుందురుకావున, ముఖము మీది కాంతినికాక వీపున నే మూలనో యున్నపుట్టు మచ్చను జూచి 'ఇసీ!' యని 'ఇహిహీ!' యని ఇగిలించి, చప్పట్లుకొట్టువారే పెక్కండ్రైయుందురు. కావున సత్క్రమో ద్దేశములుగల అల్పసంఖ్యాకులపట్ల వీరు తోడేళ్లగుంపు లయ్యె దరు. పులిమంద పైబడుతఱి, హృదయస్థ పవిత్రవిశ్వాసమును చలింపనీయక, ధైర్యముతో, ఆనందముతో మధురాలాపనము గావింపజాలువారెందఱుందురు!

విమర్శకునకుచూపుగలకన్నుకావలెనని నాఁడుకార్లైలు మనీషి, నిక్కమే! కాని వానికి యొక్కగోనమే చాలదని వక్కాణింతును. విజ్ఞానదృష్టికి విశాలదృష్టి తోడుకావలెనని, ఆత్మవిశ్వాసము, అనన్యసామాన్యధృతి వీనికి నెచ్చెలులైగుండె యందు విడియవలెనని, ఇట్టి గుండెగలవాఁడేఆదర్శవిమర్శకుఁ డగునని వాకొందును.

మహాపురుషునిపై పడుదుమ్ము విమర్శకునిపైఁగూడఁ బడును జుడీ! ఆతని మస్తకమునఁబడు ధూళి కాలక్రమమున స్వర్ణరజ మగునని రవీంద్రుఁ డనినాఁడు. విమర్శకుఁడు మహాపురుషుని నీడయందే విడిది నేర్పఱచుకొనియుండును కావున నీతనిపై రాలు పాంసుపటలము కూడ కవీంద్రుఁడు తెలిపినట్లు కాలము కడచినంత భర్మభస్మము కాకపోవునా ?

మహాపురుషులును, వారి ప్రతిభాజ్యోత్స్నకు మనసు లొడ్డి, పరితోషపూర్వకముగ గుణసంకీర్తన మొనరించు కవి చక్రవాకములును పథికులై క్రమయాత్రనుసాగించుటనరసియే విశాలహృదయులై, సమకాలికులు తమ విమర్శనమును వ్యక్తీకరింపవలెను. వారి యాత్రలో వీరును గలసి పయనమును సాగించినపుడే వీ రట్లొనరింపఁ జాలుదురు. అపుడేకదా వీరును పడుచు, లేచుచు, కష్టసుఖముల కవగతులగుచుముందంజవేయుదురు! ముండ్లతెరువున ముందంజవేయు టెట్టి కష్టమో అపుడే వీరు గ్రహింపఁ జాలుదురు. క్లిష్టమైన గట్టులమీఁది కెగబ్రాఁకు టెట్టిక్రియయో వీ రపుడే యెఱుంగఁగలరు. అనుభవజ్ఞానములేనివాఁడు వ్యక్తీకరించు అభిప్రాయము అనుచితమై, అనృతమైయుండునని ఋజువు చేయఁగలను. తోడి మానవుని విమర్శించుతఱి తోడిమానవుని వలెనే ఈతఁ డిట్లొనరింపవలెనుగాని,—రక్తమాంసములందు బ్రవేశింపక తప్పు గొప్పులపైఁ గూలఁబడక పరిపూర్ణత్వమున సంపూర్ణ తేజస్వియై పరగు జగదీశునివలెఁ గాదు. ఈ ముఖ్యాంశమును మదినిడికొని, ఎత్తుకొండమీఁదికి యాత్ర సాగించు మహాపురు

షులను, జిజ్ఞాసువులను రెప్పవాల్పక వీరు విలోకించిరేని పథిక ప్రముఖులు క్షతగాత్రులయ్యు, కాలక్రమమున నిష్ఠుర పరిస్థితులనతిక్రమించి అపూర్వశక్తిసమన్వితులై, తేజోమూర్తులై తమ యుదాత్తాశయములను దివ్యభూరుహశాఖాగ్రములందలి ఫలములను త్రుంపునట్లు ప్రమోదభరిత మనస్కులై పుడుకుచుంటఁగని సంతసింతురు. సత్యసందీప్తమైన ఇట్టి దృశ్యము సహృదయుల కనులకే మిఱుమిట్లు గొలుపునుసుడీ! ఇదియే వీరిపట్ల విశ్వరూపమై యుండును. ఈర్ష్య కామిలరోగమై వీరి కన్నులఁ బ్రవేశించెనేని, వీరికిఁ గానబడునది సత్యజ్యోతి కాదు, మఱి విపరీతమైన దృశ్యమే!

పథికుఁడైన విజ్ఞాని, యాత్రికుఁడైన మహాపురుషుఁడు కాలము కడచుకొలఁది అపూర్వశక్తి నందునంటిని. ఈ శక్తి యెందుండునో ఈశ్వర సాహాయ్యమును అందే యుండును. రామలక్ష్మణుల ట్లివి రెండును పథికుని హృదయమును స్పృశించిన పవిత్రముహూర్తమున, నాతఁడు ముక్తిదూతయై మానవలోకము నుద్ధరింపగలఁడు.

రాధాకృష్ణుఁ డిట్టి ముక్తిదూత కావలెననికదా పలికియుంటిని! ఉత్తుంగభావికాల కుధరశిఖరమున నీయుత్కృష్టాశయము రత్నదీపిక వలె తేజరిల్లుచున్నది. రాధాకృష్ణుఁడు పథికుఁడై కదలిపోవు టెఱుఁగుదుము. ఈ దీపికపై చూడ్కినిలిపి, దీనినందుటకై ఈమహాపురుషుఁడుయాత్రసాగించుచున్నాఁడు.

జలదము చితికి తొలఁగినంతన సస్యరాజిపై చివాలున కురియు వెలుఁగు వానవలె, నీశ్వరసాహాయ్యము రాధాకృష్ణుని

పథమున భాస్వన్మరీచికాయుతమై యవతరించుచుండెనని క్రమ గతి నడచు నీతని జీవితమును పరికించినపుడు గ్రహింతుము. నేఁడును రేపునుకూడ నీ సాహాయ్యము ఈతని పూతయత్న మును స్పృశింపకుండునా ? అందద్భుతసృష్టి గోచరింపకుం డునా? సవనకుండమునుండి వెడలిన యజ్ఞపురుషునివలె, దీక్షా యుతమైన ఈతని పవిత్రప్రయత్నమునుండి దివ్యప్రసాదమును బూను మహత్తరఫల మావిర్భవింపకుండునా? ఇది మహిమో పేత సృష్టిసమన్వితమని, దీని కతన వసుమతి శాంతియుతమై, ఆనందప్లావితమై యుండునని ఎవరు గ్రహింపకుందురు?

# భారతీయ నాగరికతా విస్తరణము

—డా॥ మారేమండ రామారావు

## (1) ఆదర్శములు——నాగరికతావిస్తృతి

అతి ప్రాచీన కాలము నుండియు భారతదేశము యితర జాతులతోడను, దేశములతోడను, సంపర్క మేమియు లేక ఏకాంత జీవితమును గడుపుచుండెనను అభిప్రాయము మనదేశీయులలో బలముగ నాటుకొనియున్నది. ఉత్తరమునహిమాలయములునితరదిశల సముద్రము నీ దేశమును బాహ్యసంపర్కము నుండి మూసివేయ, ప్రాచీన భారతీయులు వర్ణవిభేదములను గల్పించుకొని, పూర్వాచార పరాయణులై, కూపస్థమండూకములవలెఁ గాలక్షేపము చేయుచుండిరను నభిప్రాయముపూర్వ చరిత్ర పఠనమువలనఁ గలుగుచున్నది. కాని యిటీవల పరిశోధన లీ యభిప్రాయము వాస్తవము కాదనియు, సత్యదూరమనియు నిరూపించుచున్నవి. ప్రాచీనార్యులకును నేఁటి క్రైస్తవ జాతులకును నడుమ నీ దేశముపై దండెత్తివచ్చిన ప్రతి జాతికిని తమ స్వాతంత్ర్యమును గోల్పోవుచు, వారికి జోహా రొనర్చుచు, కొంచె మవకాశము దొరికినపుడు కొంఁది కాలము తలయెత్తుచు, మొత్తముమీఁద భారతీయులు శతాబ్దముల కాల మస్వతంత్ర జీవితమున కలవడిరను పూర్వాభిప్రాయము సరియైనది కాదు. అటులే భారతీయ నాగరికత భారతదేశపు సరిహద్దులను దాఁట లేదనియు, నేఁటి ఇంగ్లండు,

ప్రాన్సు మున్నగు పాశ్చాత్య దేశీయులపై భారతీయుల ప్రతిభ తమదేశము నెన్నడను దాఁటిపోలేదనియు, నెంచుటయు ప్రమాదకరమే. ఇటీవల ఆశియాఖండమునందలి వివిధ భాగములలోఁగనుగొనఁబడిన చారిత్రకసామగ్రి భారత దేశచరిత్రమున కొక నూతనోత్తేజమును, శక్తిని గలిగించుచున్నది. దానినుండి ప్రాచీన భారతీయు లాశియా యూరోపు ఖండములలోని విశేష భాగములపై నాధ్యాత్మిక దిగ్విజయ మొనర్చిరనియు, నేఁటి ఇంగ్లండు దేశమువలెనే భారత దేశముగూడ నొకప్పుడొక సువిశాల సామ్రాజ్యమున కధినేతయై, నాఁటి ప్రపంచమున కంతటికినిగూడ నాదర్శభూమియై యొప్పుచుండె ననియుఁ దెలియనగుచున్నది. తమ దేశములను, తమ కుటుంబములను విడచి సుదూర దేశముల కేగి యచటి కష్టనిష్ఠురముల కోర్చి యేకదీక్షతో క్రైస్తవమత ప్రచార మొనర్చు ఫాదిరీలవలెనే యొకప్పుడు భారతీయులు వర్ణవయోభేదములు లేక,సముద్ర యానమునందలి ప్రమాదములను లెక్కచేయక; కేవలమును విశ్వమానవ కళ్యాణమునే కాంక్షించి, సుదూర దేశముల కేగి భారతీయ విజ్ఞానమును వెదఁజల్లిరి. అంతవఱకు నజ్ఞానాంధకారమున మునిగిఁయుండియాధ్యాత్మికప్రవృత్తిలేక అనాగరికులుగ నుండిన జాతుల వా రెందఱో నాఁటి భారతీయ పండితుల యొక్కయు, బౌద్ధభిక్షువులయొక్కయు,కవిగాయకశిల్ప్యాది కళారాధకుల యొక్కయు, స్వార్థరహితమగు సేవచే ప్రబుద్ధులై స్వదేశీయ సామగ్రిని భారత దేశాదర్శమునను సమ్మేళనముచేసి విలక్షణమగు నాగరికతను నిర్మించుకొనిరి. అంతియ

గాక సాహసవంతులును, స్వాతంత్ర్యాభిలాషులునగు భారత వీరులెందరో మత రాజకీయాది విప్లవము లొదవినప్పుడెల్ల మాతృదేశమును వీడి జావా, సుమిత్రా, ఇండోచైనా, బర్మా మున్నగు దూరదేశములకేగి, స్వబాహుబలముచే నచటివారిని జయించి, చక్కని రాజ్యములను స్థాపించి, వానియందు తమ తమ మాతృదేశములందలి నాగరికతను నెలకొల్పి వెంపొందించిరి. ప్రాచీన గ్రీసుదేశమునుండి యెందరో వలసపోయి యీ విధముననే పెక్కు చిన్నచిన్న రాజ్యములను నెలకొల్పి గ్రీసుదేశ నాగరికతను విస్తరింపజేసిరి. ఇటీవలి కాలమున ఇంగ్లండు ఫ్రాన్సు మున్నగు దేశములనుండియు ననేకు లపుడే నూతనముగఁ గనుగొనఁబడిన అమెరికా ఖండమున వలసరాష్ట్రములను నిర్మించిరి. కాని గ్రీసు ఇంగ్లండుదేశములవలె భారతదేశ మీవలస రాష్ట్రములతో తగవులాడి, దౌర్జన్యమునుజూపి తుదకు వానినిఁ గోల్పోలేదు. అయ్యవి బయలువెడలిన నాఁటి నుండి క్రీ.శ. 13వ శతాబ్దప్రాంతమున అరబ్బులుమున్నగు నితర జాతులవారికి వశమగువఱకునుగూడ నీ వలస రాజ్యములతో నత్యుత్తమమగు మైత్రినిపాటించి, యాదర్శప్రాయమై భారతదేశము తమ మాతవలె నలరారుచుండెను. ఈ దూరదేశములన్నిటియందునుగూడ భారతీయ నాగరికతాచిహ్నము లనేకములు నేఁటికిని గాంచనగుచున్నవి. నేఁటికిని కొన్ని కొన్ని జాతుల యొక్కయు, దేశములయొక్కయుసాంఘికజీవితమునందును, నాగరికతయందును భారతదేశ సంబంధము స్పష్టముగఁ గన్పించుచున్నది.

భారతదేశముయొక్క యీయాధ్యాత్మికదిగ్విజయము నకును, తత్ఫలితముయొక్క శాశ్వతత్వమునకును గూడ ముఖ్య కారణములు ప్రాచీన భారతీయుల యాదర్శములే. క్రీ. పూ. 1500-500 నడుమ ప్రాచీన సామ్రాజ్యము లనేకములు ప్రబలినవి. వాని కన్నిటికినిగూడ విదేశీయ నాగరికతలతో ప్రత్యర్థిత్వము సంభవించినది. ఫినోషియనులు తాము జయించినజాతుల యార్థికసంపదనెల్ల చూరగొని వారి ననాథులను జేసివేసిరి. అటుపై అస్సిరియనులు పశుబలముచే నెన్నియో తెగలను రూపుమాపి తమ సామ్రాజ్యమును స్థాపించిరి. ఈజిప్షనులును, రోమనులు నీ మార్గమునే యవలంబించి ఖడ్గముతో తమ నాగరికత నితర జాతులవారిలో వ్యాపింపఁజేసిరి. గ్రీసుదేశీయులు గూడ తాము జయించినజాతుల నాగరికతను నశింపఁజేసి వారందఱును తమ నాగరికతనే యవలంబించున ట్లొనర్చిరి. ఇదేకాలమున భారతదేశమునందు ప్రాచీనార్యుల కితరజాతులతో సంబంధ మేర్పడెను. కాని యీ సందర్భమునం దార్యులు ప్రత్యర్థిజాతులను నిర్మూలింపఁజేయుటగాని, వారినాగరికతను పూర్తిగ ధ్వంసము జేయుటగాని, చేయక వారియెడ సామరస్యము నుపయోగించి, వారి నాగరికతయందలి యుత్తమాంశములను గైకొని, తన్మూలమునఁ దమసభ్యతనుగూడ మార్పు చేసికొని, క్రమక్రమముగ నాజాతులవారినెల్లవశపరచుకొనిరి. ఈ యార్యానార్య నాగరికతా సమ్మిశ్రణమువలన నీ రెండు జాతులవారికిని లక్ష్యైక్యతయు, దన్మూలమున శాంతియుసమకూడినవి. దానినుండి జాతి నిర్మూలనముగాక జాత్యుద్ధరణమే ప్రాచీనభారతీయుల యాదర్శమని స్పష్టమగుచున్నది.

పూర్వభారతీయుల యాధ్యాత్మిక ప్రవృత్తిగూడ విశ్వాత్మకముగనే యుండినది. ఉపనిషత్తులు సంసారచక్రమున పరిభ్రమించు మానవకోటి కంతటికినిగూడ మోక్షమార్గము నుపదేశించుచున్నవి. అదే విధమున బౌద్ధతత్వము గూడ సర్వమానవ కల్యాణము చేకూరు మార్గముల నెన్నిటినో యుపదేశించినది. ఈ విధమున ప్రాచీన భారతదేశము అహింస, తృష్ణారాహిత్యము, సౌహార్దము అను సూత్రముల నుపపాదించి ప్రతి వ్యక్తికిని శాశ్వతసుఖము నొనగూర్పదగియుండెను. దానినుండి ప్రాచీన భారతీయులు సర్వసంతరణమును మఱియొక యాదర్శముగ నుంచుకొనిరని స్పష్టమగుచున్నది.

క్రీ. పూ. 5-3 శతాబ్దములలో విశ్వసామ్రాజ్య నిర్మాణ కాంక్షచే రాజన్యు లెందఱో దుష్కృత్యముల నేకములఁ జేసియుండిరి. స్వార్థపరులై కేవల పశుబలముతో పర్షియనులు, నట్టుపిమ్మట యవనవీరుఁ డగు నలెగ్జాండరును సువిశాలమగు సామ్రాజ్యములను నిర్మింప యత్నించి, నాఁటి మనుష్యకోటి నెన్నియో విధముల పీడించిరి. కాని మానవ రుధిరార్ద్రిమములగు యుద్ధభూములలో హృదయదారకమగు నిర్వేదమునణంచి భారతభూమి యిదే సమయమున మఱియొకసారి శాంతిసందేశము నుద్ఘోషించెను. కళింగ సంగర రంగమున "ధర్మమను మహాస్త్రముచే మానవ హృదయములను జయించుటయే నిజమైన విజయము" అను సవిమర్శక మగు ప్రబోధమునందియశఃకాయుఁడగునశోకచక్రవర్తి "సర్వేమనుష్యా మేప్రజాః" అని యుద్ఘోషించి, జాతిమత వివక్షతలను పాటింపక మానవ

సంఘ మంతటికిని ధర్మోపదేశ మొనర్చెను. ఈ చక్రవర్తి మహా సందేశము సిరియా, ఈజిప్టు, సైరినీ, మాసిడోనియా, ఎపిరస్, సింహళము, స్వర్ణభూమిమున్నగుదూర దేశములందు సహితము ప్రతిధ్వనించెను. అహింస, ప్రేమ యను మఱి రెండాదర్శము లను ఈ చక్రవర్తి సమకాలిక ప్రపంచమున కొసంగెను.

క్రీ. పూ. 5 వ శతాబ్ది నుండి క్రీస్తుశకారంభమువఱకును గల కాలమునాఁటి భారతదేశచరిత్రముమఱియొకముఖ్యాంశ మును దెలుపుచున్నది. మొదట పర్షియనులును, పిమ్మట యవ నులు నీ దేశపు పశ్చిమోత్తర ప్రాంతమును వశపఱచుకొనిరి. ఆ కాలమునం దాయాజాతులవా రట స్థిరపడి స్థానికులతోఁ గలసిపోయిరి. పిమ్మట శక, పహ్లవ, యూఎచీ జాతులవా రీదేశముపై దండెత్తివచ్చి యిట స్థిరపడి రాజ్యములను గూడ నిర్మించిరి. కాని యనతికాలముననే వారు తమవిదేశీయవ్యక్తి త్వమును గోల్పోయి, పరిపూర్ణముగ భారతీయులై, భారతీ యాచార వ్యవహారములను పరిగ్రహించి, హిందూబౌద్ధమత ముల నవలంబించి, భారతీయులలోఁ గలసి పోయిరి. దీని నుండి సర్వజన సమాదరణము పూర్వ భారతీయుల మఱియొక యాదర్శమని తెలియుచున్నది.

ఈ విధమున సర్వజాత్యుద్ధరణము, సర్వసంతరణము అహింస, ప్రేమ, ధర్మసంస్థాపనము, సర్వజన సమాదరణమునను నుత్తమాదర్శముల మూలమున ప్రాచీన భారతీయులు నాఁటి ప్రాచ్యపాశ్చాత్య ప్రపంచములపై నాధ్యాత్మిక దిగ్విజయ మొనర్చి విశ్వమానవ కల్యాణమునుచేకూర్చిరి. మధ్య యుగము

నాఁటి పాశ్చాత్యదేశము నందలి సాహస వంతులవలెనే నాఁటి భారతీయ పండితులును,యువకులును, దేశాంతరవిజయములను సంపాదించుటకై యువ్విళ్ళూరుచుండిరి.ఒక్కటియయ్యనహస్ర స్థలముల ప్రతిబింబించుచు నాఁటి భారత భూమి సువిశాలమగు నాధ్యాత్మిక సామ్రాజ్యమున కధినేతయై యొప్పుచుండెను.

ఈ భారతీయ నాగరికతా విస్తరణముయొక్క యారంభ కాలమును గూడ నొక విధమున నిర్ణయింపవచ్చును. కెపడోషియా యను దేశమున "బోగజ్‌కోయి" యనుచోట నొక శాసనము గనుగొనఁబడినది. ఇది క్రీ పూ. 14 వ శతాబ్ది నాఁటిదని పండితులు నిశ్చయించి యున్నారు. "హిట్టైట్" "మిట్టానీ" యను రెండు జాతుల వారు నిరంతరమును తమలో జరుగుచుండిన సమరములను మాని, సంధి యొనర్చుకొని, దానికి బ్రమాణముగ వేదములలో పేర్కొనఁ బడిన ఇంద్ర, వరుణ, మిత్రాది ప్రాచీనార్య దేవతలను పేర్కొనిన ట్లాశాసనమునుండి తెలియుచున్నది.ఈ సంధి చిరస్థాయిగ నుండుటకై యీ జాతుల రాజవంశములకు వైవాహిక సంబంధ మేర్పరుపఁ బడెను. మఱియు నప్పుడు వివాహితులైన నూతన దంపతుల కభ్యుదయ మొసంగుటకై నాసత్యులను వైదిక దేవతలు ప్రార్థింపఁ బడిరి. క్రీ. శ. 13 వ శతాబ్ది నాఁటికి పెక్కు స్థలముల నుపద్రవములు సంభవించి, భారతీయ నాగరికత యంతరించెనని యింతకుబూర్వము చెప్పియుంటిమి. కాన నీ నాగరికతా విస్తరణము క్రీ. పూ. 14 వ శతాబ్దినుండి క్రీ. శ. 13 వ శతాబ్దివరకును జరిగెనని స్పష్టమగుచున్నది.

ఇటీవల ఫిన్ డర్స్ పెట్రీ యను నొక పండితుఁడు యూరప్, ఆశియా, ఆఫ్రికా ఖండముల నడుమఁగలమధ్యధరా సముద్ర తీరమునందున్న మెంఫిస్ నగరమున భారతీయ స్త్రీ పురుషులచిత్రములను గనుగొనెను. ప్రాచీన భారతీయులాశియా ఖండపు ప్రాగుత్తరముననున్న జపాను ద్వీపమునందును, ప్రాగ్దక్షిణముననున్న మొలక్కాసు ద్వీపమునను, నైరృతిభాగము నందున్న ఆఫ్రికాఖండమునకుసమీపమునందున్న మెడగాస్కర్ ద్వీపమునను గూడ తమనాగరికతనువ్యాపింపజేసినటుల తెలియ నగుచున్నది. ఈ యెల్లలనడుమ నుండు సువిశాలభూభాగ మంతయు నొకప్పుడు భారతీయాధ్యాత్మిక సామ్రాజ్యముగ నుండెను.

ఈ యార్యనాగరికత భారతదేశమునందలి యన్ని భాగ ములనుండియు విస్తరించెను. పశ్చిమమున ఆఫ్గనిస్థానము మొదలు తూర్పున జపానువరకునుగల దేశములలో వ్యాపించిన నాగరికత యుత్తరాపథ నాగరికత. బర్మా, ఇండోచైనా, సుమత్రాలలో విస్తరించినది యాంధ్రదేశ నాగరికత. ఆశియా ఖండపు ప్రాగ్దక్షిణద్వీపములలో గొంతవరకును ద్రవిడదేశ సంప ర్కమును గన్పించుచున్నది. ఈ భారతీయ నాగరికత భూమా ర్గమునను సముద్రమార్గమునను గూడ విస్తరించెను. సామాన్య వాణిజ్యమార్గములే నాగరికతా విస్తరణమునకు గూడ మార్గ ములైనవి. ఇటువైని విస్తరణము సవిస్తరముగవివరింపబడును.

*1. టిబెట్* :- క్రీ. శ. 1వ శతాబ్దమున 'యూఎచీ'అను నొకజాతివారు మధ్య ఆశియానుండి భారతభూమిపై దండెత్తి

వచ్చి యిట స్థిరపడిరి. వారిలో నొక తెగవారగు కుషాను లిచ్చట రాజ్యమేలిరి. అందుసుప్రసిద్ధుడును, భారతీయచక్రవర్తులలో నగ్రగణ్యుడునగు కనిష్కుడు కాష్ఘర్, యార్ ఖండ్ మున్నగు మధ్య ఆశియాలోని ప్రదేశములను జయించెను. ఈతని యాదరణముచే నీ దేశములలో మహాయాన బౌద్ధమతము విస్తరించినది. ఇటనుండి యీమతము చైనాకు ప్రాకినది. క్రీ. శ. 7 వ శతాబ్దము స్ట్రాంగ్ ట్సన్ గంపో (Strang-tsan-Gampo) యను నాతడు టిబెట్టును పాలించుచుండెను. ఆతని భార్యయగు నేపాలరాజపుత్రిక తాంత్రిక బౌద్ధమతము నాదేశమున బ్రవేశింపజేసెను. ఆ రాజుమఱియొక భార్యయగు చైనా రాజపుత్రిక యాదరమునటిబెట్టుదేశమున కనేకులగుచైనాదేశ భిక్షువు లేతెంచిరి. గంపోరాజుతనమంత్రిని హిందూదేశమునకు విశేషజ్ఞానము నుపార్జించుటకై బంప, నాతడు దేవనాగరీ లిపి నుండియొక క్రొత్తలిపిని నిర్మించి టిబెట్టుదేశమున బ్రచారము చేయించెను. క్రీ. శ. 8వ శతాబ్దమున మఱియొకరాజు పద్మసంభవుడు నాతనిశిష్యుడగు వైరోచనుడుమున్నగు భారతీయ పండితుల ననేకుల రావించి వారి సాహాయ్యమున టిబెటను భాషలో వాఙ్మయమును నిర్మింపజేసెను. క్రీ. శ. 1083 శ్రీ నాలందా విశ్వవిద్యాలయాధ్యక్షుడును బండితశిఖామణియు నగు దీపాంకర అతీశుడు టిబెట్టునకేగి యచ్చటి మతమునకు నూతనోత్తేజమును గల్గించెను. ఆ దేశమునం దమరకోశము, మేఘదూతము, చంద్రగోమి వ్యాకరణము, చిత్రలక్షణము మున్నగు భారతీయగ్రంథము లెన్నియో భాషాంతరీకరింపబడి

